ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

51వ భాగము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

## విషయసూచిక

# బలరాముఁడు ద్వివిదునిఁజంపుట

శ్లో॥ నరకస్య సఖా కశ్చిద్ద్వివిదో నామ వానరః।
సుగ్రీవ సచివః సోఽథ భ్రాతా మైందస్య వీర్యవాన్॥
సఖ్యుః సోఽపచితిం కుర్వన్వానరో రాష్ట్రవిప్లవమ్
పుర గ్రామాకరాంఘోషాన దహద్వహ్నిం ముత్సృజన్॥

—శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౭ అ. ౨, ౩ శ్లో॥

క॥ జన నాయక లిను సుగ్రీ
వుని సచివుఁడు మైందునకు సహోదరుఁడనఁగా
వినుతికి నెక్కిన ద్వివిదుం
డను ప్లవగుఁడు నరక సఖ్యుఁడతి దర్పితుఁడై॥

సీ॥ చెలికాని పగఁదీర్పఁదలఁచి కృష్ణుండేలు
పురములు జనపదంబులు దహించి
సరిదుపవన సరో వరములు గోరాడి
మందలఁ గొందలమందఁ జేసి॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

సంగప్రభావము ప్రతివారిమీఁదను బడితీరును. ఎంత మంచివాఁడైనప్పటికిని నీచసాంగత్యమొనర్చినచో వాని మనస్సులో నీచత వచ్చితీరును. ఎంతటి సదాచారియైనను వ్యభిచారులగు స్త్రీ పురుషులతో సాంగత్య మొనర్చినచో, వాని చిత్తము చంచలమై తీరును. ఎంతటి సతీసాధ్వి, పతివ్రతయైనప్పటికిని, సదాచారిణియైనను, నామె నిరంతరము కులటలతోడను చరిత్రహీనులతోడనుసహవాసమొనర్చినచో

నామె మనస్సుజారిపోఁగలదు. ఈమనస్సొక భూతమువంటిది. గొప్పగొప్పఆరూఢ యోగులైనను సంగప్రభావముచేఁ బతితు లగుచుందురు. భగవత్సంగముండిననుసధికమున విషయసంగ ముండినచో మనస్సు విషయములందు లగ్నమైపోవును. అందులకే మహర్షులు మాటి మాటికిని వారు చెప్పెడిదిది— ఎవరితోడను సంగమును బొత్తుగాఁ బెట్టుకొనఁగూడదు. ఒక వేళ సాంగత్యము చేసినచో జ్యేష్ఠులతోడను, శ్రేష్ఠుల తోడను, గుణవంతులతోడను, భగవద్భక్తులతోడను సాం గత్య మొనర్పవలయును. నీచులతో సాంగత్యమొనర్చినచో నీచతవచ్చితీరును.

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! పరీక్షిన్మహారా జడుగఁగా మా గురుదేవుఁడగు శుకమహర్షి ఆతని బల రాముని మిగిలిన చరిత్రనుగూడ చెప్పనారంభించెను. బల రాముని వ్రజయాత్రను గుఱించి చెప్పితిని. ఈ మధ్యలోనే ద్వారకకుఁ బౌండ్రకవాసుదేవుని దూతవచ్చెను. అందు వలనఁ బ్రసంగవశమునఁ బౌండ్రక వధ, కాశీదహనము మొదలగు కథలను జెప్పితిని. ఇప్పుడు మరల పరీక్షిన్మహా రాజిట్లనెను :- "స్వామీ ! అనంత, అప్రమేయ, అద్భుత కర్ముఁడగు బలరాముని యితర చరిత్రలను గూడ వినదలఁచు చున్నాను. సంకర్షణభగవానుఁడు సర్వసమర్థుఁడు. ఆతని యితర చరిత్రలనుగూడ చెప్పవలయును, బలరాముఁడు

పరమ పరాక్రమయుక్తులగు కార్యములను జేసియుండ వచ్చును.'' రాజిట్లు ప్రశ్నింపఁగా విని మాగురుదేవులు భగవానుఁడగు బలరాముని అన్యచరిత్రముల నెట్లుచెప్పెనో మీకు వానినన్నిటినిఁ జెప్పెదను.''

త్రేతాయుగమున భగవానుఁడు రావణునిఁ జంపినపుడు సుగ్రీవుఁడే ఋక్ష, వానరసేనలతో లంకకుఁబోయి యుండెను. ఈ వానరులు వేలువేలు ద్వీపములందును, వేలు వేలు వర్షములందును నివసించుచుండిరి. వీ రుపదేవతలు. హనుమంతుఁ కింపురుషులలోనివాఁడు. ఈతని యాకృతి మనుష్యులవలెనే యుండును. కొంత వానర రూపమును గలదు. ఈతనిఁ జూడఁగనే సందేహాము కలుగుచుండును. ''కిం పురుష'' ఈతఁడు పురుషుఁడా ?'' ఉపదేవుఁడగుటచే నీతని ఆయువును నెక్కువగనుండును. హనుమంతుఁడిప్పటికి నున్నాఁడు. ఆతఁడు కల్పజీవి. విభీషణుఁడును గల్పజీవియే. ఋక్షరాజగు జాంబవంతుఁడును జీవించియే యున్నాఁడు. ఆతని కూఁతురిని జాంబవతినిఁ గృష్ణుడు పెండ్లాడినాఁడుకదా! ఈవిధముగ ద్వివిదుఁడను వానరుఁడును జిరంజీవియే. రామచంద్రుని సపరివారముగఁ బూజించువేళ మైంద, ద్వివిదులను నావరణదేవతలుగ స్థాపించుచుందురు. వీరికిఁ బూజయును జరుగుచుండును. విష్ణువునకు జయవిజయులెట్లు పార్షదులో వీరును రామచంద్రునకుఁ

ద్బార్షదులు. వారి వారి లోకములలో వీరెల్లప్పుడు నుందురు. శాపవశమున జయ విజయులు పృథివిపై హిరణ్యాకశిపు, హిరణ్యాక్షులుగను, రావణకుంభకర్ణులుగను, దంతవక్త్రి శిశుపాలురుగను నుత్పన్నమైరో, అట్లే శాపవశమున ద్వివిదుఁడును నిత్యము భగవంతుని లోకమున నుండును. అంశ రూపమున భూమిపైఁ బుట్టెను. శ్రీరామావతారకాలమున నీతఁడును, నీతని సోదరుఁడగు మైందుఁడును సుగ్రీవుని మంత్రులుగ నుండిరి. గొప్ప బలవంతులు. ఈ ద్వివిదునకు గొప్ప బలగర్వ మేర్పడెను. ఈ గర్వముచేతనే యీతఁడు లక్ష్మణునిఁ గూడ అవమానించెను. అంత లక్ష్మణుఁ డిట్లనెను :- "నే నిప్పుడే నీ యీ యవినయమునకుఁ బ్రతిక్రియ చేసి ఫలము చూపెడు వాఁడనే. కాని రామచంద్రుఁడు మీ వానరులందఱకును నభయ ప్రదాన మొనర్చియుండెను. కావున నిప్పుడు నిన్నుఁ జంపను. ఇంకొక అవతారమున నీ గర్వము నణఁచెదను. నీవు దుష్టతావశమున నాకవమానమును గావించినచో నేను నిన్నుఁ జంపెదను.

ఆ ద్వివిదుఁడే శాపవశమున ద్వాపరయుగమున నరకునకు మిత్రుఁడయ్యెను. కృష్ణుఁ నరకాసురునిఁ జంపగా ద్వివిదునకు మిక్కిలి క్రోధము కలిగెను. సంగదోషముచే నీతనికి దుష్టత్వమునుగలిగెను. కృష్ణుఁడు సామాన్య మానవునిఁగాదలఁచుచుండెను. ఆతఁడు మనస్సులోనిట్లనుకొనెను:-

"శ్రీకృష్ణుఁడు నామిత్రుడగు నరకాసురుని జంపినాఁడు. నామిత్రునిఁ జంపినవానిమీఁద నేను కసిదీర్చుకొనక పోయినచో నింక నామిత్రత్వమేమున్నది? పరలోకమున నున్న నా మిత్రునకు సంతోషమును గలిగింపవలయును. అట్లు కలిగించినవాఁడే యథార్థమగు మిత్రుఁడు" అని యిట్లాలోచించుకొని రాష్ట్రమంద నేకములగునుపద్రవములు కావించుచుండెను. ఆతఁడు తన్నెదిరింపఁగల బలవంతుఁడెవఁడను గర్వముతో నుండెను. ఆ యహంకారమున నాతఁడెచ్చట వెండి, బంగారము, ఇంక విలువగల వస్తువులుండునో అచ్చట నగ్నివంటించి తగులఁబెట్టుచుండెను. పశువుల కొట్టములను దగులఁబెట్టుచుండెను.

శౌనకుఁ డిట్లడిగెను :-"సూతా! ఆతఁడు భగవానునిమీఁదనే కసినిఁ దీర్చుకొనఁదలఁచినచో ద్వారకకే వచ్చి అట్లు చేయవచ్చునుగదా! పాపము ప్రజలేమి చేసినారు. నగరగ్రామములను దగులఁ బెట్టుటెందులకు?"

సూతుఁడిట్లనెను :-"స్వామీ! ఇతరులకు ఉపద్రవమును గలిగించుటయే దుష్టుల స్వభావముగ నుండును. ఆతని యుద్దేశ్యము శ్రీకృష్ణునకు బ్రతీకారమొనర్చుటయే. దానికి దారిలో నాతని కాటంకమును గలిగించు రాజులకును, బ్రజలకును బాధను గలిగించు నుపద్రవములను గావించుచుండెను ద్వారకకు వచ్చి ఆతఁడు చాలగొప్ప

అల్లరినిఁ జేయుచుండెను. భగవానుఁడు నివసించు ద్వార కలో నాతఁడెన్నో ఉపద్రవములను గలిగించుచుండెను. కృష్ణునకు బాధ కలిగించుటకే ఆతఁడు దృఢ సంకల్పమొనర్చు కొని యుండెను. వానిలోఁ బదివేల యేనుఁగులు బల మున్నది. అందువలనఁ బర్వతములందలి పెద్దపెద్ద బండల నెత్తి గ్రామములపై విసరివేయుచుండెను. ఒక్కొక్కప్పుడు గ్రామములను దగులఁబెట్టుచుండును. సముద్రములోనికిఁ బోయి అచ్చటినుండి జలములను వెదజిమ్మినఁ గొన్ని గ్రామములే ఆ జలములకుఁ గొట్టుకొని పోవుచుండెను. ఒక్కొక్కప్పుడు ఋషుల ఆశ్రమములకుఁ బోవుచుండును. అచ్చటనుండిన మంచిమంచి ఫలములు గల వృక్షములను బెఱికి పారవేయుచుండును. వారి అగ్నిహోత్రములలోని అగ్ని నార్పివేయుచుండును. ఒక్కొక్కప్పుడా కుండము లలో మలమూత్రములను విసర్జించుచుండును. ఒక్కొక్క ప్పుడు స్త్రీలను, బురుషులను బట్టుకొని పోయి పర్వత గుహ లలో నుంచి బంధించును. భృంగము కీటకములను గొని పోయి; తన బిలములోఁ బెట్టుకొని యెట్లు బంధించునో అట్లే వీరిని బెద్దపెద్ద బండలతో గుహలలోఁబెట్టి బంధిం చును. ధనలోభముచే ధనికులను దొంగలు బంధించునట్లు వంగదేశపు స్త్రీలు మాయలచే పురుషులను వారియిండ్లలో బంధించునట్లు బంధించుచుండెను. ఇట్టి యుపద్రవము లనేకము

లొనర్చుచుండెను. ప్రజలుపోయి యీ సమాచారమును శ్రీకృష్ణునితోఁ జెప్పుకొనిరి. భగవానుఁడిట్లనెను :-"ఆతఁడు బలరాముని వంతులలోని వాఁడు. నేను వానితోఁ గల్పించు కొనను." అప్పు డందఱును బోయి బలరామునకు మొఱ పెట్టుకొనిరి. బలరాముఁడు తాను తలఁచినది చేసితీఱును. అయితే ఆతనికీ యుద్ధములు మొదలైనవి అంతగా నచ్చవు. తన పనియేమో తాను చూచుకొనును. కాని ఆతని కెవఁడైన భంగమును గలిగించెనా వానిపని పట్టును. అందువలనఁ బ్రజలాతనితో నిట్లనిరి:- "స్వామీ! మీరింటిలోఁ గూరుచుంటిరి. చూడుఁడు నేఁడు రైవతక పర్వతము మీఁద నెంతటి ఆనందోత్సవము జరుగుచున్నదో, ఏదో ఒకరోజైన వనవిహార కార్యక్రమమును బెట్టుకొనుఁడు."

బలరాముని కిందులో నభ్యంతరమేమి యుండఁగలదు. మఱునాఁడు వనవిహారమునకు సిద్ధపడెను. సేవకులు ముందుగాఁ బోయి ఆమోద ప్రమోదముల నేర్పాటు కావించిరి. బలరాముఁడు తన భార్యలతో నచ్చటికివచ్చెను. అచ్చట నాట్యగానములును నేర్పాటయ్యెను. మల్లెపూలు, పారిజాతాదులు కొల్లలుగనుండెను. అది సుఖదమగు వసంత ఋతువు. యథేష్టముగ మధుపానమొనర్చి, ఆనందముగ గానమును వినుచుండెను. మధ్య మధ్య తానును బాడుచుండెను.

ఆ వానరుఁడు తాళ స్వర సహితముగ వచ్చుచుండిన సుందరసంగీత సుమధుర ధ్వనిని వినఁగానే, ఆ శబ్దమునుబట్టి ఆతఁడు రైవతపర్వతము మీఁదకు వచ్చెను. వృష్ణివంశావతంసుఁడగు బలభద్రుఁడు వనితల మధ్య విరాజిల్లుచుండుటను గాంచెను. ఆతఁడు స్వచ్ఛ వస్త్రములను ధరించి యుండెను. ఆతని శరీరమంతయును సుందరముగ నుండెను. ఆతఁడు వికసిత పద్మమాలలను ధరించియుండెను. మధుపాన మొనర్చుటచే నాతని విశాలములగు నేత్రములరుణవర్ణము కలవయ్యెను. మధుపాన మత్తతచే నాతఁడు మెల్లమెల్లఁగా నరగన్నుతో మందహాస మొనర్చుచుండెను. ఆతని విశాల శరీరము మదస్రావియగు మాతంగమువలె నుండెను. ఆతఁడు కామినీ కలకంఠముల నుండి వెలువడుచుండిన మధుర గానమును శ్రవణము చేయుచుండెను. ఒక్కొక్కప్పుడు తానును గానమొనర్చుచుండెను. ఆ దుష్టుఁడగు ద్వివిదుఁడు వచ్చి ఆ యానందమునకు భంగమును గలిగించెను. వాని కొక్క దుష్ట ఆలోచన తోఁచెను. ఆతఁడు సమీపమున నుండిన విశాల వృక్షముపై నెక్కి, అచ్చటనుండి స్త్రీలవైపు చూచుచు నోరు తెఱచుచు, కిలకిలారవము లొనర్చుచు వృక్షముల నూప నారంభించెను. యువతులగు స్త్రీలు స్వభావముచేతఁ జంచలురుగను, నవ్వుచుఁ గుతూహల ప్రియులుగ నుందురు. ఈ వానరుఁ డుపద్రవము లొనర్చ

టను గాంచి అందఱును నవ్వ నారంభించిరి. ఎగతాళిచేసి కవ్వింప నారంభించిరి. బలవంతుఁడగు తమపతి సమీపమున నుండుటచే వారి కేమాత్రమును భయము లేకుండెను.

దీనివలన నా వానరుఁ డత్యంత క్రుద్ధుఁడై, అది తన కవమానముగ భావించెను. ఆతఁడు స్త్రీలవైపునకు దుముకు టకుఁ గవ్వించుచుండెను. తన గుహ్యావయవమును జూపించుచు నింక ననేక విధములగు నశిష్టతాకార్యము లొనర్ప నారంభించెను. దీనినిఁ గాంచఁగనే బలరామునకుఁ గోపము వచ్చెను. ఆతఁడు దగ్గఱనుండిన నొక రాతిబండ నెత్తి విసరి వానినిఁ గొట్టఁగానే ఆతఁ డెగిరెను. అల్లైగురుటచే లక్ష్యము తప్ప వానికి దగులకుండెను. ఆతఁ డుపద్రవము నొనరించు టకే సిద్ధపడియుండెను. వెంటనే ఆతఁడు పరుగిడెను. బాదము పిస్తా, పాలు, పచ్చకర్పూరము, కలకండ, ఏలకులు, మధు మిశ్రితమగు భంగుతోఁ గూడిన కలశమచ్చట సిద్ధముగ నుండెను. ఆ దుష్టుఁడు పోయి దానినిఁ దీసికొని నేలపైఁ బగులఁగొట్టెను. భంగంతయును గ్రిందఁబడిపోయెను. భంగు త్రాగువానికి భంగంతయును బోయినచోఁ దన సర్వస్వమును బోయినట్లుండును. ఇప్పుడు బలరామునకు వచ్చిన కోపము నకు మేఱలేకుండెను ఇంత చేసినను నాదుష్టుఁ డూరకుండ లేదు. అతఁడు స్త్రీల చీరలను లాగి తీసికొనిపోయెను. వానిని ముక్కలు ముక్కలుచేసి చించివైచెను. ఆతఁడు గర్జించుచు

గంతులు వైవ నారంభించెను. బలరాముని వైపు కవ్వింపుతోఁ జూచుచు, మూఁతినిఁ జూపించుచు నాతని పరిహాసించు చుండెను.

వీఁడే ఆ ద్వివిద వానరుఁడని బలరాముఁడు గ్రహించెను. "వీని దుష్టత్వమును గూర్చి నేను జాల దినముల నుండి వినుచుంటిని. ఈ మదోన్మత్తుఁడు చాల దేశములను బాడుచేసి నష్టము కావించినాఁడు. నన్నుపేక్షించుచు నవజ్ఞ మొనర్చుచున్నాఁడు. సరే, ఇంక వీని నుపేక్షింపరాదు. వీని ధృష్టత నిప్పుడే వదలించెదను. వీని దుర్మార్గమునకు ఫలమును జూపించెదను." అని ఆలోచించి, తన ప్రధానాయుధములగు హలముసలములను దీసికొనెను. వానరుఁడు సావధానముగ నుండెను. వాఁడు యుద్ధమొనర్చుటకే వచ్చి యుండెను. బలరాముఁడు హలముసలములను సంబాళించుకొనుటను గాంచి, చప్పట్లు చఱచి పోరాడుటకు దుమికి, వెంటనే అచ్చటనుండిన నొక శాలవృక్షమును బెఱికి, బలముకొలఁది బరుఁగిడిపోయి బలరాముని శిరస్సుపై గొట్టెను. బలరాముఁడు వాఁడట్లు కొట్టుననుకొనలేదు. బలరాముని తలపై నది తగులక మునుపో దానినిఁబట్టుకొనెను. ఆతఁడు సుమేరు పర్వతమువలెఁ దనస్థానమున నట్లే కదలక నిలుచుండెను. పాఱిపోవనులేదు, భయపడలేదు. బలరాముఁడు వృక్షమును దన మెడమ చేతితో లాగి

ఒక ప్రక్కన విసరివైచి కుడిచేతితోఁ దనచేతిలో నుండిన సునందమను రోఁకలితో వాని శిరస్సుపై నొక్క ప్రహారమును గావించెను. ముసలము దానిపని అదిచేసెను. వానరుని యొక్క శిరస్సు గుమ్మడికాయవలె బ్రద్దలయ్యెను. గైరిక పర్వతమునుండి గైరిక ధాతువెట్లు వేగముగఁ బ్రవహించునో అట్లే ఆతని శిరస్సునుండి రక్తము ప్రవహించెను. కాని ఆ వానరుఁడు బలవంతుఁడు. ఆతఁడా ప్రహారమును లక్ష్యము చేయక దగ్గఱ నుండిన నొక వృక్షమును బెఱికి బలరామునిఁ గొట్టెను. బలరాముఁడు దానినిఁ గొట్టివైచెను. ఆతఁడు మూఁడవ వృక్షమును బెఱకెను, దానిని విసరివైవఁగా బలరాముఁడు వానిని భంజించుచుండెను. ఆ వానరుఁడిట్లు వనమందలి వృక్షములనన్నిటినిఁ బెఱికి బలరామునిపై వైచుటయును, వానినాతఁడు భంజించుటయును జరుగుచుండెను. వనమంతయును వృక్షవిహీనమయ్యెను. విసరి వైచుట కా వనములో వృక్షములు లేకపోఁగా, నాతఁడచ్చటనుండిన బండను విసర నారంభించెను. బలరాముఁడాతని ప్రహారములను వ్యర్థమొనర్చుటలోనే లగ్నమై యుండెను. ఆ దుష్టుఁడు తనపైఁ బ్రహారమొనర్చుటకు బలరామున కవకాశమును గలిగించుట లేదు.

బలరాముఁడు తన సునందమును ముసలముచే వృక్షములను బర్వతములను, ఇతర వస్తువులను జూర్ణమొనర్చు

టను గాంచి, ఆతఁడు వృక్షపాషాణాదులను విసరుట నాపి వైచెను. ఇప్పుడాతఁడు చపట్లను జఱచుచు ద్వంద్వయుద్ధమునకు సిద్ధపడి, తన విశాల బాహువుచే గుప్పిట పట్టి పిడికిలితో బలరాముని హృదయమున గట్టిగఁ గొట్టెను. ఇప్పుడు బలరాముఁడు కన్నులు తెఱచెను. వానరుఁడు గొప్ప బలవంతుఁడని ఆతఁడిప్పుడు గ్రహించెను. ఆతఁడు హాలముసలముల నొకప్రక్క నుంచెను. వెంటనే దుమికి వాని గొంతుపిసికెను. వాఁడుక్కిరి బిక్కిరయ్యెను. నోటినుండి రక్తమును గ్రక్కనారంభించెను. బలరాముఁ డిట్లనెను:- "ఇప్పుడు చెప్పుము. నీ సంగతియేమో!"

ఇప్పుడు వానికి నోట మాట వచ్చుటలేదు. తెగఁ గొట్టిన వృక్షమువలె నాతఁడు నేలపైఁ బడెను. ఆతఁడు పడఁగానే భూమి కంపించెను. సముద్ర జలము చిందఱ వందఱ యయ్యెను. చెఱువులు, కుంటలు, సరోవరములలోని జలము కదలి కట్టలు దాటి పోయెను. ఆతఁడు పడఁగానె ధమ్మని పడిన శబ్దమువలనఁ జెవులు దిబ్బెడ పడిపోయెను. భూమి ఝంఝూవాతముచేఁ బడవ యూగినట్లూగెను. బలరాముఁడు మరల నింకొక గ్రుద్దును గ్రుద్దెను. దానితో వాని ప్రాణము లెగిరి పోయెను.

వానివలన సమస్తదేవతలును, సిద్ధులును, ఋషులును మునులును దుఃఖితులైరి. వాఁడు చావఁగానే అఁదఱును

బలరామునకు జయ జయ ధ్వానము లొనర్చిరి. ఆకాశము నుండి పుష్పవృష్టి కురిసెను. స్త్రీలాశ్చర్యముతోఁ జచ్చిన నా వానరుని విశాల శరీరమును గాంచిరి.

సూతుఁడిట్లనెను:-"మునులారా! ఈ విధముగ జగత్కంటక రూపుఁడగు ద్వివిదవానరునిఁ జంపి బలరాముఁడు స్వజనములతో నందఱచేఁ బ్రశంసింపఁబడుచు ద్వారకా నగరమునకుఁబోయెను. అందఱును నీ కార్యమును గూర్చి అభినందించిరి. ఈ విధముగ నేను బలరాముఁడీ ద్వివిదుని వధించుటను గూర్చి చెప్పితిని. ఆజ్ఞ అయినచో బలరామునియొక్క చరిత్ర నింకొకటి కూడ చెప్పెదను."

సంతోషమును బ్రకటించుచు శౌనకుఁ డిట్లనెను :- "సూతా! మాకు చాల సంతోషముగ నున్నది. బలరాముని చరిత్రమును వినుచుండ మాకు తృప్తి జనించుట లేదు. ఇంకను వినఁ గుతూహలము కలుగుచున్నది. కావున మా కానందము కలుగునట్లు చెప్పవలయును."

సూతుఁ డిట్లనెను :— "మునివరులారా! సాంబుని వివాహసమయమున బలరాముఁడు హస్తినాపురమునఁ బ్రదర్శించిన నా పరాక్రమమును గూర్చి చెప్పెదను. సావధానులరై శ్రవణమొనర్పుఁడు."

—*—

# లక్ష్మణా హరణము - సాంబ బంధనము

శ్లో. దుర్యోధన సుతాం రాజల్లక్ష్మణాం సమితిం జయః ।
స్వయంవర స్థామహరత్సాంబో జాంబవతీ సుతః ॥
—శ్రీభాగ. ౧౦ స్కం. ౬౮ అ. ౧ శ్లో॥

సీ॥ కోరి సుయోధను కూఁతురు సర్వల
క్షణములు గల్గి లక్షణ యనంగ
మహినొప్పు కన్యకామణి వివాహంబునఁ
జక్రహస్తుని తనూజాతుఁడయిన
సాంబుండు ఘనసాహసమున నెత్తుకపోవ
గౌరవుల్ వీక్షించి కడఁగి క్రొవ్వి -
—శ్రీమదాంధ్ర భాగవతము.

గొప్పవారు వీలైనంతవఱకు కలహమును నివారించుచుందురు. ఇరుపక్షములను గౌరవప్రదమగు నొడంబడిక యుండవలయునని వారు గోరుచుందురు. సామోపాయముచేనే విధముగను నుపద్రవము శాంతింపకుండిన దండము నాశ్రయించెదరు. వారు శక్తికొలఁది యుద్ధము రాకుండునట్లు చూచెదరు. కాని ఆత్మసమ్మానమునకు దెబ్బ సంభవించినపుడు సంఘర్షమునకు వెఱవరు. నిర్భయులై తమ బలమును ప్రదర్శించెదరు. ప్రతిపక్షము వారి తలను గాలను దన్ని తమ గౌరవమును గాపాడుకొందురు. మనస్వులగు వారలకు ఆత్మగౌరవమును రక్షించుకొనుట చాల ముఖ్యమగు కార్యము.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! భగవానునకు లక్షలమంది పుత్రులు కలరు. వారందఱును వివాహయోగ్యులైరి. ఎచ్చట స్వయంవరము జరిగిన నచ్చటికి వీరందఱును బయవెత్తుచుందురు. భగవానుని భార్యలలో జాంబవతియొక్క పుత్రులలో సాంబుఁడు మిక్కిలి అందమైనవాఁడు. సౌందర్యముతోఁ బాటుగా నాతని కొక అభిశాపమును గలదు. సౌందర్య మున్నది కాని ఆతనికిఁ గుష్టురోగము కలదు."

శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా! సాంబునకు గుష్ట మేల వచ్చినది ?"

సూతుఁడిట్లనెను :-"మునులారా! ఇప్పుడా విషయములనన్నిటినిఁ జెప్పుటకు వీలుపడదు. సౌందర్య ప్రజ్వాలితాగ్ని వంటిది. దీని జ్వాలలో నెందఱోఁ గాలి మాడి పోయిరి. అతి సౌందర్యము కల స్త్రీనిఁగాపాడుట చాల కష్టము. అతిసుందరుఁడగు పుత్రుని స్వాధీనమునఁ బెట్టుకొనుట దుస్సాధ్యమగుచుండును. సాంబుని అందమును గాంచి యితర తల్లులందఱును మోహితులగు చుండిరి. దీనినిఁగాంచి సాంబునకుఁ గుష్టరోగము వచ్చునట్లు కృష్ణుఁడే శపించెను. కొన్నాళ్ళకు సూర్యోపాసనచే నాకుష్టరోగము పోయెను. ఇంతకు సారాంశమేమనఁగా నాతఁడు దేవతల కంటె నతి సుందరుఁడు."

ఒకదినమున నాతఁడు హస్తినాపురమున దుర్యోధనునకు లక్ష్మణ యను కన్యక కలదనియు, నామె అత్యంత సుందరియనియు, ఆమె స్వయంవరము జరుగఁబోవు చున్నదనియు విని వెంటనే రథముపై నెక్కి యెవరికినిఁ జెప్పకయే హస్తినాపురమునకుఁబోయెను. ఆతఁడిట్లనుకొనెను :—"నాకింకను లక్షల కొలఁది సోదరులున్నారు. వారికిని దెలిసి యుండినచో వారును స్వయంవరమునకు రావచ్చును. అప్పుడా కన్యక వారిలో నెవరినైన వరింపవచ్చును. అప్పుడు గడబిడయై గృహకలహములు చెలరేగవచ్చును. అందువలన నెవరికిని జెప్పకయే పోయి, కన్యకను గ్రహించి యింటికి వచ్చినచో నందఱకును నాశ్చర్యము కలుగవచ్చును." అని యాలోచించి అతఁ డొంటరిగానే పోయెను.

స్వయంవరమునకుఁబోయి చూడఁగా నచ్చటికి గొప్ప గొప్ప రాజకుమారులు వచ్చియుండిరి. లక్షలమంది రాజులును, రాజకుమారులును నట్టహాసముతోఁ గన్యకమీఁదఁ గల ఆశతోఁ జాతక పక్షులవలె వచ్చి చూచుచుండిరి. కన్యక యెవరిని వరించునో తెలియదు. ముందెవరికి జిక్కిన వారిదె కాఁగలదు.' అని యాలోచించి స్వయం వరము కొఱకు ప్రతీక్షింపక లక్ష్మణ జయమాల పట్టుకొని రాఁగానే వెంటనే సాంబుఁడామె నెత్తుకొని, రథముపైఁ గూర్చుండఁ బెట్టుకొని పాఱిపోయెను. పిల్లను దీసికొని పాఱిపోవుట వారింట

నుండిన ఆచారమే. పెద్దవారెట్లు చేయుదురో పిల్లలును నట్లే అనుకరించెదరు.

మానవంతుఁడగు దుర్యోధనుఁడును, ఆతని సోదరులును, బంధువులును దీనిని దమకవమానముగ భావించిరి. కౌరవులందఱును గుపితులై యిట్లనిరి :-"ఈ కృష్ణుని కుమారుఁడు దుష్టుఁడును, మూర్ఖుఁడును, అవినయవంతుఁడునై యున్నాఁడు. ఈ నీచుఁడిట్టి సాహసమెట్లు చేసినాడు? కన్యవానినిఁ గోరినచో వరింపఁగలదు. అది బాగుగనే యుండెడిది. ఇప్పుడీతఁడు మిక్కిలి నీచకార్యమొనర్చినాఁడు. వీఁడు మనలను లక్ష్యపెట్టలేదు. దుర్వినీతుఁడగు నీ కుఱ్ఱవానినిఁ బట్టుకొని బంధింపుఁడు. వీని చేతులకును కాళ్ళకును సంకెళ్లు వైచి కారాగృహమునఁ బడవేయుఁడు."

ఒకఁడిట్లనెను :-"అయ్యా! ఏ పనిచేసినను ఆలోచించి చేయవలెను. వీనిని బంధించుట యనఁగా యాదవులతో వైరమును బెట్టుకొనుటయే కాఁగలదు. యాదవులీపనిని సహింపఁజాలరు. వినఁగానే వారు సైన్యమును గూర్చుకొని పోరవచ్చెదరు. రక్తపాతము కాఁగలదు. కలహబీజము నాటఁబడును."

అంత దుర్యోధనుఁ డిట్లనెను :-"ఓయీ! నీవేమి మాటలు మాటలాడుచున్నావు? యాదవులు సింహమా మనలను దినుటకు. రాజైనచో వారి విషయమును గూర్చి

ఆలోచింపవచ్చును. యాదవులు విశుద్ధ క్షత్రియులుకారు. వారికి రాజ్యసింహాసనముపైఁ గూర్చుండుటకుగాని, ఛత్ర చామరములను ధరించుటకు గాని అధికారము లేదు. వీరు ద్వారకా పురిలోఁగూర్చుండి రాజులమని కూర్చుండుట మన కృపాఫలముననే. మనమును వారేదో భూమినిఁగొంత అనుభవించెదరులే యని యుపేక్షించితిమి. కాని వారు మన నెత్తిపైకెక్కి నాట్యమాడుఁడను నర్థముకాదు. మర్యాదాతిక్రమణమును జేయవలయుననియును గాదు. సాంబుని బంధమును విని సైన్యమును దీసికొని వచ్చిన రానిండు. వారిచ్చటకు రాఁగానే అగ్నిలో నీరుపడగానే అది శాంతించునట్లు వారు చల్లబడి చప్పబడి పోయెదరు. ఆఁకలిమంట పాయసాదులచే శాంతించును. జలముచే నగ్ని శాంతించును. అగ్నినిఁబొందిచలినశించును. ప్రాణాయామాద్యుపాయముల ద్వారా చిత్తైగ్రత కుదిరినచో నింద్రియములు శాంతించును. మాకు యాదవుల భయములేదు. కాని యీ విషయమునఁ బెద్దలయొక్కయు, పిన్నలయొక్కయు అభిప్రాయమును దీసికొన వలసియుండును. మావంశమునందు అందఱికంటె పెద్దయగు భీష్మపితామహుని అభిప్రాయమును గ్రహించి, యీ యశిష్టబాలకుని బంధింపవలెను.''

ఇదివిని అందఱును గోష్ఠేకులై వృద్ధుఁడగు భీష్మపితామహునికడకు బోయి ఆతనితో నిట్లనిరి:-''పితామహా!

చూచుఁడు. కృష్ణుని కుమారుఁడెట్లు మనలనందఱ నవమా నించినాఁడో, ఆతఁడు బలవంతముగ స్వయంవర రంగస్థలము నుండి అకారణ కన్యక నెత్తుకొని పోయినాఁడు. మేమంద అము నాతని బంధింపఁ దలఁచితిమి. మీ యాజ్ఞ యేమి?''

లోలోన భీష్మ పితామహుఁ డిట్లనుకొనెను :- ''శ్రీకృష్ణునిపాలన పోషణమున నెవఁడున్నాఁడో, ఆతనిబంధిం చుట కెవరికి శక్తి కలదు. కాని వీరేమిచేయఁదలంచిరో దానినిఁ జేసి దానిఫలము ననుభవింప నిమ్ము, చివరకు సాంబుని వివాహము లక్ష్మణతోడనే జరుగఁగలదు.'' ఇట్లాలోచించి ఆతఁడిట్లనెను:-''కుఱ్ఱవాఁడు చాల ధృష్టతనే కావించినాఁడు. వాని నేమాత్రమును క్షమింపరాదు? ఇది వినఁగానే అందఱ రక్తముప్పొంగ నారంభించెను. అందఱును ధనుర్బాణము లచే సుసజ్జితులై సాంబుని వెన్నంటిరి. కర్ణ, శల్య, భూరిశ్రవ, యజ్ఞకేతు, దుర్యోధనాది ఆతని సోదరులును బంధువులును సాంబునిఁ బట్టుకొనుటకుఁబోయిరి. కొంతదూరము పోయి వారు సాంబుని ముట్టడించిరి.

కౌరవులు యుద్ధముకొఱకు వచ్చుచున్నట్లు తెలిసికొని సాంబుఁడు భయపడక, పాఱిపోక నిలుచుండి, ధనుర్బాణము లను ధరించి సింహకిశోరమువలె నిలువఁబడెను. ఇంకే మున్నది. ఇరుపక్షములందును యుద్ధము జరుగుచుండెను. కౌరవులు నిలునిలుమనిరి. సాంబుఁడిట్లనెను:- ''నిలుచుంటిని,

రందు." రెండు పక్షములనుండి సంవర్తక మేఘములు ప్రళయ కాలమున వర్షించునట్లు బాణవర్షము కురియుచుండెను. సాంబుఁడు తక్కువైనవాఁడు కాఁడు. ఆతఁడును గొప్ప వీరుఁడే. ఆతఁడు తన యవమానము నెట్లు సహింపఁగలఁడు? సింహముపిల్లకంటె మృగమెంత పెద్దదైనను సింహకిశోరవ భయపడి పాఱిపోవునా ? ఆతఁడు కౌరవుల ప్రహారములకు సుదృఢముగ సమాధానము చెప్పుచు పైఁగా వారిపైఁ బ్రహారము లొనర్చుచుండెను. ఇచ్చట కర్ణ, దుర్యోధన, శల్య, భూరిశ్రవాది మహారథులుండిరి. అటు సాంబుఁడొక్కఁడే ఉండెను. ఈ యాఱుగురు నొక్కసారిగా విడుచు బాణము లను నివారించుచు నీయాఱుగురుపైన బాణవర్షమును గురి పించుచుండెను. ఆతఁడు కౌరవ వీరుల బాణములను బ్రయో గించుచు రథములను విఱుగఁగొట్టుచుండెను, గుఱ్ఱములను జంపుచుండెను. సారథులను హతమార్చుచుండెను. దుర్యో ధనాది వీరు లీ బాలకుని పరాక్రమమును గాంచి పరమ విస్మితులైరి. వారిహృదయము వీని వీరత్వమును గాంచి యుప్పొంగిరి. వారిట్లనిరి:-"ఈతఁడు చూడఁగాఁ గుఱ్ఱవాఁడు కాని గట్టివాఁడు. ఈతఁడు మనలనందఱితో మిక్కిలి వీర త్వముతోఁ బోరాడుచున్నాఁడు. ఈ విధముగ విరోధ వీరు లును నీతని వీరత్వమును గూర్చి పొగడుచుండిరి.

వారిట్లనుకొనిరి:- "వీనితో ధర్మయుద్ధమొనర్చినచో వీనిని మనము జయింపజాలము. ఆతఁడు పిల్లను దీసికొని పోయినను అంత చెడ్డయేమియును లేదు. మన మాఱుగురము వీనిని వెంబడించఁగా వీఁడొంటరిగ మనలనందఱ నోడించి పిల్లను దీసికొనిపోయినచో, మనకు పెద్ద మచ్చయేర్పడఁ గలదు. మనమెవ్వరికిని ముఖమును జూపింపఁజాలము." అని యిట్లాలోచించుకొని వారు ధర్మవిచారమును వదలివైచిరి. అందఱును నొంటరిగానుండిన నా సాంబునిమీఁద విఱుచుకొని పడిరి. నలుగురును గలిసి సాంబుని నాలుగు గుఱ్ఱములను జంపిరి. ఒకఁడు చాల కౌశలముగ సారథిని వధించెను. ఇంకొకఁడర్ధచంద్రాకార బాణమును బ్రయోగించి సాంబుని ధనుస్సు ఖండించివైచెను. ఇప్పుడు సాంబుఁడు రథహీనుఁడైపోయెను. ఆతనికడ ధనుస్సు కూడ లేకుండెను. వెనుకనుండి యొకఁడు దుముకి పట్టుకొని ఆతని బంధించిరి. కన్యకను వేఱు రథముపైఁ గూర్చుండబెట్టుకొని, బంధితుఁడగు సాంబుని దీసికొని జయధ్వానము లొనర్చుచు హస్తినాపురమునకు వచ్చిరి. సాంబునిఁ గారాగృహమునఁ బడవైచిరి. లక్ష్మణను నంతఃపురమునకుఁ బంపివైచిరి. స్వాయంవర కార్యము నాపివైచిరి.

ఇచ్చట నారదుఁడును స్వయంవర సమయమున హస్తినాపురమునకు వచ్చెను. కన్యక యెవరిని వరించునో చూతమని వచ్చియుండ వచ్చును. భగవానుని పుత్రుఁడగు

సాంబుని బంధించిన విషయమును దెలిసికొని ద్వారకానగరమునకుఁ బోవలసిన అవసరమున్నదని వెంటనే ద్వారకకు బయలుదేరెను. యాదవసభ జరుగుచుండెను. ఆ సమయమున గృహసంబంధమగు విషయమున వాద వివాదములు జరుగుచుండెను. ఆ సమయమున నారదుని వీణానాదమును వినఁగానే అందఱు నులికిపడిరి. అందఱును దేవర్షికి స్వాగతమొసంగిరి. ముని కూర్చుండఁగానే యిట్లనెను:-"మీరు చిన్నవిషయములను గూర్చి వాద వివాద మొనర్చుకొనుచుంటిరా ? మీ ముక్కులు తెగిపోయినవి"

ఉలికిపడి ప్రద్యుమ్నుఁ డిట్లడిగెను :- "మా ముక్కులు తెగుటేమి స్వామీ! మీరేదో అద్భుత సమాచారమును దీసికొని వచ్చి యుందురు. వినవలెను. గదా!"

నారదుఁ డిట్లనెను :- "నీ తమ్ముఁడగు సాంబుని కౌరవు లధర్మముగ బంధించిరి. ఆ బాలకుఁడు వొంటరిగ నాలుగురు మహారథులతోఁ బోరాడెను. ఏదో విధముగ రథహీను నొనర్చి ఆతనిఁ బట్టుకొనిరి."

అందఱిట్లనిరి :- "స్వామీ ఏమి జరిగినది ? సాంబుఁడు కౌరవుల కేమి యపరాధ మొర్చినాఁడు."

నారదుఁ డిట్లనెను:-"ఏమియును లేదు. ఆతఁడు తన కులధర్మమును బాలించినాఁడు. ఆతని తండ్రి చేసినది, సోదరుఁడు చేసినది చేసినాఁడు. ఇంకొకరి పిల్ల నందఱ ముందు

తీసికొని పాఱిపోయినాఁడు. కౌరవులు యాదవుల నందఱను దిట్టి ఆతనిఁ బంధించుకొని తీసికొని పోయిరి. యాదవుల విషయములో వారు పలికిన పలుకులున్నవి లేనివి నే నిప్పు డేమి చెప్పఁగలను ?''

ఇది వినఁగానే యాదవులందఱును గుపితులై వారిలో వారిట్లనుకొనిరి :-''కౌరవులు మనల నెదుర్కొనుచున్నారా? మనమందఱమును బోయి వారి చేసిన పనికి తగిన ప్రతీకారము నొనర్చెదము. సాంబుని బంధించి వారు మనల నవమాన మొనర్చినారు. వెంటనే సేనను గూర్చుకొని నేఁడే కౌరవులపై దండెత్తవలయును. దీనికి ఉగ్రసేన మహారాజు దీని కాజ్ఞ యొసంగు నను నాశ కలదు.''

వృద్ధుఁ డగు నుగ్రసేనుఁడు భగవానుని వైపు చూచెను. ఆతఁ డూరక కూర్చుండి మాటలను వినుచుండెను. పూర్వము పెద్దల యెదుట దన పుత్రుల నెత్తుకొనెడువారు కారు. వారిని ముద్దు పెట్టుకొనెడువారు కారు. వారేదైన వస్తువును గోరినచోఁ బెద్దలకడకు పంపుచుందురు. వారి వివాహ ప్రసంగము వచ్చినచో దూరముగఁ బోవుదురు. ఒక వేళ వారి నేదైన నడిగినచో వారిట్లనుచుందురు :- ''పెద్దవారి నడుగుఁడు. వారేది చెప్పిన దాని నొనర్చెదము. పెద్దలుండఁగా నేదైన నుత్సవములు పర్వములందును దమ పేరును లిఖించుకొనెడువారుకా . సారాంశ మేమనఁగాఁ, దమ కంటెఁ బెద్దలుండఁగాఁ దమ సంతానమునుగూర్చి తా

మాలోచింపవలసిన పని యే మున్నది ? పరివారములో నెవరు పెద్దలుగ నుందురో సమస్త కార్యములును వారి వలననే జరుగుచుండును. అందువలన భగవానుఁడు సాంబునిఁ బట్టుకొనిన విషయమున నేమియును మాటలాడలేదు. ఉగ్రసేనుఁడును, వసుదేవుఁడును, బలరాముఁడును, నింకను యాదవ వృద్ధులునుండిరి. వీరందఱేమి నిర్ణయించెదరో అదియే జరుగఁగలదు. భగవానుఁడు మౌనముగ నుండుటను గాంచి ఉగ్రసేనుఁడు పలుకుట కారంభించెను. "ఇది కేవలము సాంబునకు జరిగిన నవమానము కాదు. సమస్త యదువంశమునకును జరిగిన అవమానము. కావున నాయభిప్రాయ మేమనఁగా మనము వెంటనే కౌరవుల మీఁదకు దండెత్తి పోవలయును. సాంభుని వదలనంతవఱకు మన మొక్క క్షణమైనను శాంతముగఁ గూర్చుండఁజాలము."

ఉగ్రసేనుని వాక్యములకు యాదవ యువకులందఱును జయజయ ధ్వానములొనర్చి సమర్థించిరి. యుద్ధము కొఱకు వారి శరీరము లుప్పొంగుచుండెను. వారు వెంటనే హస్తినాపురమునకు బోవుటకు తొందఱ పడుచుండిరి. కొందఱు సేనాపతులను సేనను సిద్ధమొనర్పవలయు ననుచుండిరి.

ఆయువకులు యుద్ధమునకు సిద్ధపడి యుత్సాహమును జెందుటను గాంచి, బలరాముఁడు లేచి నిలుచుండి యిట్లనెను:-"ఈ విషయమున నేను గొంత చెప్పఁదలఁచినాను"

ఉగ్రసేనుఁ డుత్సాహముతో సరే చెప్పు మనెను.

అంత బలరాముఁ డిట్లనెను :-"నా యభిప్రాయమున మన మిప్పుడు తొందఱ పడవలసిన పని లేదు. మనకును గౌరవులకును బురాణ సంబంధము కలదు. వారితో మనము యుద్ధ మొనర్చుట ఉచితముగా నుండదు. ఇంతమంది రాజులతో మనకు శత్రుత్వమున్నది. కౌరవులు మనకు శత్రువులు కారు మిత్రులు. వారిమీఁద హఠాత్తుగ దండెత్తుట శోభింపదు."

అంత యాదవులలో నొక యువకుఁ డిట్లనెను :-"ఈ పని శత్రువులు చేసిన పనియే చేసినారు. శాంతించుట కైనను హద్దున్నది. వారు మనలను నిర్బలులుగ దలచిరి. ఇది మనకు ఘోరావమానము."

బలరాముఁడు గంభీరముగ నా యాదవ కుమారునికిఁ నచ్చఁజెప్పుచు నిట్లనెను :- "నాయనా! నీ కింకను శరీరములోఁ గ్రొత్తరక్తము కలదు. నీవు పుర్వాపరములను విచారింపక ఉత్తేజితుఁడ వగుచున్నావు. నీ వెవరి పిల్లనైన బలవంతముగఁ దెచ్చినచో వారు ప్రతీకార మొనర్పరా? వారికిని మానమర్యాదలు కలవు కదా! మానవుల కితరుల దోషములు ఆవగింజంతైనను గొండంతలుగఁ గనఁబడును. కాని తన దోషము సుమేరువంతటి దైనను గనఁబడదు. సాంబుఁ డిట్టి పిల్లతనపు చేష్టలు చేయకుండవలసినది. వానికి వివాహము కావలసియుండిన మనతోఁ జెప్పియుండినఁ

బాగుండెడిది. మన మిచ్చుటినుండి సేనను దీసికొనిపోయి, తీసికొని వచ్చెడువారము. రాక్షస వివాహము క్షత్రియులకు విహితమైనదే కాని, బలమును గావలసియుండును. అస్తు. ఏమియును ఫరవా లేదు. నే నొంటరిగా హస్తినాపురమునకు బోయి, శాంతముగ నచ్చఁజెప్పెదను. దుర్యోధనుఁడు నా శిష్యుఁడు, ఆతఁడు నా మాటను కాదనఁడు. భీష్మపితామహుఁడు. వృద్ధుఁడు ఆతఁడు వెనుకముందు లాలోచింపఁ గలవాఁడు. యథాశక్తిగఁ గలహము లేకయే పని జరుగునట్లు నేను బ్రయత్నించెదను. అట్లు పని జరుగకున్నచో నే నొక్కఁడనే చాలును. వారిని బలప్రయోగముచే నిర్జించుటకు. ఇంతటి సేనను దీనికొని ·హస్తినాపురమునకు బోవు టెందులకు ?

ఉగ్రసేనమహారా జిట్లనెను :- "అవునవు నిది చాల బాగున్నది. బలరాముఁడు పోయి యీ కలహమును నివారింపవచ్చును. దీనిని ముదరనిచ్చుట మంచిది కాదు. అల్ప కార్యమునకై యుత్తేజితులగుట బుద్ధిమంతుల లక్షణము కాదు. బెల్లమును బెట్టిననే చచ్చుచుండ విషప్రయోగము యొక్క అవసర మేమున్నది ?"

ఇది వినఁగానే యువకులకుఁ మిక్కిలి నిరాశకలిగెను. యుద్ధావసరము రాఁగా నది బలభద్రుని యాజ్ఞచే నది ఆగి పోయినది. అది రాజాజ్ఞ ఇంకేఁ జేయఁదగిన దేమున్నది.

కిష్వాకు కలికలుష వినాశనుఁ డగు బలరాముఁడు హస్తినా పురమునకుఁ బోవుట కుద్యుక్తుఁడయ్యెను. ఆతఁడు బాగుగా దెలిసిన విద్వాంసులును ననుభవజ్ఞులు నగు బ్రాహ్మణులను వెంటఁ బెట్టుకొనుటయే గాక శాంతి ప్రియులగు కుటుంబము లోని వారలను గూడ వెంటరమ్మని కోరెను. నక్షత్రముల మధ్య చంద్రునివలె విద్వాంసులును, వృద్ధులునగు విప్రుల తోడను కులవృద్ధులతోడను హస్తినాపురమునకు బయలు దేరెను. భగవానుని యొక్క ఆత్మ సచివుఁడగు నుద్ధవుఁ డును నాతని వెంట నుండెను.

సూతుఁ డిట్లనెను :-''మునులారా! హస్తినాపురము నకు ఊరిబయట నుండిన నొక ఉపవనమున విడిసి, స్వస్థ చిత్తుఁడై కూర్చుండిన తరువాత నాతఁడు ఉద్ధవునితో నిట్ల నెను :-''ఉద్ధవా! నీవు హస్తినాపురమునకుఁ బోయి భీష్మ పితామహుని, ధృతరాష్ట్ర విదురులను, దుర్యోధనాదు లను గలిసికొని నేను వచ్చిన సమాచారమును జెప్పవల యును. వారు మన యెడల నెట్టి వ్యవహార మొనర్చు చున్నారో ముందుగాఁ గనిపెట్టవలయును.''

ఉద్ధవుఁడు చిత్తమనెను. ఇట్లు పలికి యుద్ధవుఁడు వెంటనే హస్తినాపురమునకుఁ బోయెను. దైవవశమున నా సమయమునఁ గౌరవసభ జరుగుచుండెను. దానిలో భీష్మ పితామహుఁడును, ద్రోణాచార్యుడును, కృపాచార్యుడును ధృతరాష్ట్ర విదురులును, బాహ్లికుడును గూర్చుండి యుండిరి.

అచ్చటికిఁ బోయి ఉద్ధవుఁ డందఱకును యథాయోగ్యముగఁ బ్రణామాదులను గావించి యిట్లనెను :-"బలరాముఁ డిచ్చటికి మీ కడకు రావలయునని వచ్చి ఊరిబయట ఉపవనమున విడిసి యున్నాఁడు. ఆతఁడు మీకడకీ సంగతిని జెప్పుటకు నన్ను బంపిఁ యున్నాడు. ఇప్పుడు మీరేది యుచితమని తలచెదరో దాని నొనర్పుడు."

సూతుఁడిట్లనెను :- "మునులారా! తమకు ప్రియుఁడును, సహృదయుఁడు నగు బలరాముఁడు వచ్చినాఁడను సంగతినిఁ దెలిసికొని అందఱును నానందమును జెందిరి. వారు మాంగలిక వస్తువులను గైకొని బలరామునకు సత్కారమొనర్చుటకై బయలువెడలిరి. ఇప్పుడు రెండు పక్షముల లోను జరిగిన సంభాషణమునుగూర్చి ముందు చెప్పఁబోవుచున్నాను. సావధానులరై వినుడు."

— 5 —

## కౌరవులు-బలరాముడు

శ్లో॥ యస్యాంఘ్రి పంకజరజోఽఖిల లోకపాలై
ర్మౌల్యుత్తమైర్ధృతముపాసిత తీర్థ తీర్థమ్।
బ్రహ్మా భవోఽహమపి యస్య కలాః కలాయాః
శ్రీశ్చోద్వహేమ చిరమస్య నృపాసనం క్వ॥

—శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౮ అ. ౩౭ శ్లో॥

చ॥ అదియునుగాక యెవ్వనిపదాంబుజ చారురజోవితానమా
త్రిదివ వరాది దిక్పతి కిరీటములందు నలంకరించు భూ
విదితపుఁ దీర్థముం గడు బవిత్రము సేయునునట్టి కృష్ణుచేఁ
బొదలిన రాజ్యచిహ్నములఁ బొందఁగరాదఁట యేమి
చోద్యమో॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

ఐశ్వర్య మదమత్తులగువారు ఇష్టమువచ్చినట్లు వాగు చుందురు. కాని వారి మదము నణఁచువారు దొఱికినప్పుడు వారి కన్నులు తెఱిపిడి పడును. అప్పుడు వారు చేసిన దానికిఁ బశ్చాత్తాపమును జెందుదురు. అప్పుడు వారి బుద్ధి త్రోవలోఁ బడును. వినయావనతులై తాము చేసిన అప రాధమును క్షమింపుమని కోరుకొనును. అపరాధము నొప్పు కొనుట భగవదనుగ్రహము లేనిది జరుగదు. ఎవరికి ధన, జన, విద్యా, బుద్ధి, కళా, కౌశల, అధికాది మదములున్ననో వారు తమ యపరాధములను సరియైనవియే యని చెప్పు చుందురు. వారికి అపరాధము నొప్పుకొనెడు ఓర్పుండదు. తమ దోషమును దాము తెలిసికొను శక్తియుంతంగా యెవని కుండునో, వారికి భగవదనుగ్రహముయొక్క అనుభవ మంతగా నుండును. లోకప్రదర్శనము కొఱకుగాక, భయ దంభాదులచేఁగాక సత్యహృదయముతో దామొనర్చిన దానికిఁ బశ్చాత్తాపము కలిగినచో నదియే నిజమగు కృపకు లక్షణమగును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! కౌరవులు బల రాముని రాకనుగూర్చి వినఁగానే వారు పూజాసామగ్రి నంతను దీసికొని, వెంట గోవునుగూడ తీసికొని నగరమున కావలనుండిన నుపవనములోనికిఁ బోయిరి. అందఱును దమతమ వయస్సుననుసరించి చిన్నలును బెద్దలును నమస్కార ప్రణామములను గావించిరి. అందఱు నానందముగఁ గూర్చుండిన తరువాత దుర్యోధనుఁడు బలరామునకు గోవు నర్పించి, అర్ఘ్యమొసంగి, పాద్యాది షోడశోపచారములచే ధూప, దీప, నైవేద్య, వస్త్రాదుల నొసంగెను. ఆతనికాతిథ్య సత్కారమొనర్చెను. దుర్యోధనుఁడు శాస్త్రీయముగఁజేసిన పూజలను స్వీకరించి బలరాముఁడందఱ నాదరించెను. తన కంటె వయస్సులోను, సంబంధమునను బెద్దవారైనవారిని సమ్మానించెను. వారికి దలనువంచి ప్రణామమొనరించిరి."

బలరాముఁ డిట్లనెను :- "ఓయీ! అందఱును గుశలముగ నున్నారా? మీ రాజ్యకార్యములు చక్కగా నెఱవేఱుచున్నవా? ప్రజలందఱును సంతుష్టులైయున్నారా? మీ మంత్రి, పురోహిత, అమాత్య, సేవకాదులు కర్తవ్యముగ భావించి కార్యములొనర్చుచున్నారా?"

దుర్యోధనుఁ డిట్లనెను :- "స్వామీ! అంతయును మీకృపయే ద్వారకలో నందఱును గుశలముగనున్నారా? ఉగ్రసేన మహారాజును, వసుదేవుఁడును, శ్యామసుందరుఁడును, ఆతని పుత్రులును బౌత్రులును, ఇతర యాదవులును

నానందముగ నున్నారా? మీరు నేఁడు దర్శనమొసఁగి మా మీఁద గొప్ప కృపఁజూపితిరి."

బలరాముఁ డిట్లనెను :- "అందఱును కుశలముగనే యున్నారు. నేనొక విశేషకార్యమున మీ అందఱకడకు వచ్చినాను. నేనీసారి నాకొఱకు రాలేదు. మహారాజాధిరాజగు నుగ్రసేనుఁడు మీకొఱకొక ఆజ్ఞాపత్రమునిచ్చి నన్నుఁ బంపినాఁడు. మీరాతని యాజ్ఞను సావధానులరై శ్రవణమొనర్ప వలయును. విని దాని నవిలంబముగఁ బాలన యొనర్పుఁడు."

ఉగ్రసేనుఁడు వారికొఱకాజ్ఞను బంపినాఁడను మాటను వినఁగానే కౌరవులు మండిపోయిరి. క్రోధముచే వారి భ్రుకుటి ముడివడెను. కాని బలరాముఁడాగలేదు. ఆతని వచనములలో దీనత్వము రాలేదు. ఆతఁడు నిర్భయుఁడై యిట్లనెను:- "మీరు చాల అన్యాయము చేసినారు. యుద్ధధర్మము నుల్లంఘించినారు. ధర్మయుద్ధమున నొక వ్యక్తితో నొక్కఁడే పోరాడవలయును. మీరాఱుగురు మహారథికులు కలిసి సాంబుని ముట్టడించి, వాని నధర్మముగ జయించి బంధించితిరి. ఇట్లు చేయుట యుద్ధధర్మమునకు సర్వదా విరుద్ధము. ఈపనిని మీరు శత్రుత్వముతోఁ జేసినారు. కాని మాకు మీయెడల సత్సంబంధమునే పెట్టుకొనియున్నాము. ఈ చిన్నవిషయముకొఱకై వివాదమును బెంచుకొనుటమాకిష్టము

లేదు. మన యిద్దరి ఐక్యము నష్టము కాఁగూడదు. అందు వలన మహారాజు నన్నుఁ బంపినాఁడు. ఇప్పటికైన దేమో అయినది. కావున మీరు మీ అపరాధమునకై క్షమాపణమును గోరవలయును. సాంబుని వధూసహితముగ వెంటనే విడిచిపుచ్చవలెను."

ఇది వినఁగానే కౌరవుల కోపము మితిమించిపోయెను. బలరామునకు నమ్రతగా సూటిగా నెవ్వరును జవాబు చెప్ప లేదు. కాని ఆతఁడు వినుచుండ బరస్పరమిట్లనుకొనిరి :- "బలరాముని వచనములలో దీనత్వము లేదు. ఆతనికడ భయ సంకోచ భావములు లేవు. ఆతఁడు వీర్య, శౌర్య, బలములందు పరిపూర్ణుఁడుగ నుండెను. ఆతని వచనము లాతని కనురూపముగనే యుండెను. కాని కౌరవులు దీనిని వారు ఘోరావమానముగ భావించిరి. వారిలో నొక్కఁడు శుష్క హాసమొనర్చుచు నిట్లనెను :- "చూడుమయ్యా! ప్రపంచ మెంతటి విచిత్రమైనదో. ఇప్పటికే కలియుగము వచ్చి వేసినది. పూర్వకాలమునఁ గాలి చెప్పు కాలికే యుండెడిది. శిరస్సుననుండు కిరీటము శిరస్సుననే యుండెడిది. కాలవైపరీత్యమునఁ గాలిచెప్పు ఇప్పుడు కిరీటము మీఁదకెక్కు చున్నది."

ఇంకొకఁ డిట్లనెను:- "అదెట్లు?"

ఆతఁడే పండ్లు పటపట కొఱకుచు నిట్లనెను:- "నీచుల నెంతగాఁ బైకెక్కించినను, గొప్పవానినిఁ జేత మన్ననువారి

నీచత పోనే పోదు. ఇప్పుడీ యాదవులను గాంచుఁడు. యయాతిమహారాజు తనమైనుగురు పుత్రులలోనల్గురకు శాప మొసంగి, రాజ్యభ్రష్టుల నొనర్చెను. వర్ణాశ్రమముల నుండి బహిష్కృతుల నొనర్చెను. పెద్దకొడుకులకు రాజ్యమొసంగక చిన్నవాఁడగు బూరునకు రాజ్యమునొసంగెను. పురువంశ క్షత్రియులు విశుద్ధక్షత్రియులుగా నెన్నఁబడుచుండిరి. మిగిలిన ద్రుహ్యు, తుర్వసు, అను, వీరు భారతవర్షమును వదలి వెడలి పోయిరి. వారచ్చటికిఁ బోయి మ్లేచ్ఛ, యవన, దర్దుర, కంక, ఖశ మొదలగు ననార్యజాతులలో రాజులైరి. వీరు వర్ణాశ్రమ బహిష్కృతులైరి. అందఱికంటె బెద్దవాఁడగు యదువు భారతదేశమందే యుండెను. ఆతని వంశజులే యీ యాదవులు. వీరికి రాజ్యాసనమునఁ గూర్చుండుటకును నధికారము లేదు. క్షత్రియులని పిలువఁ బడుటకును నధిఁ కారము లేదు. వీరికిని క్షత్రియులకును గంచము పొత్తు, మంచము పొత్తు లేదు. వీరు తమ వంశము వారి తోడనే వివాహ మొనర్చుకొనుచుందురు. మాపూర్వులు గొప్పపొర బాటున వీరితో సంబంధమును గావించిరి. పాండుమహారాజు కుంతినిఁ జేసికొనెను. 'స్త్రీరత్నం దుష్కులా దపి' అనఁగా స్త్రీ రత్నముత్తమకంటె నీచకులమున నుండినను గ్రహింపవచ్చును. ఈ విధమున మన కురువంశమునకును యదువంశమునకును సంబంధము కలుగుట కారంభమయ్యెను. ఇప్పుడు వీరు మన దగ్గఱకు వచ్చుచుఁబోవుచుండిరి. పూర్వము మనము వీరితో

నట్టివ్యవహారమునే చేయుచుండెడు వారము. సంబంధులు కాఁగానే మెల్లమెల్లఁగాఁ గూర్చుండి లేచుచుఁ దినుట, త్రాగుట మొదలుపెట్టిరి. వీరుగ్రసేనునిఁ దమరాజుగఁ బ్రక టించుకొనిరి. మనము నుపేక్షించితిమి. సరే! పోనిండు భూఖండములోఁ గొంత అనుభవింప నిమ్మనుకొంటిమి. ఇది వీరికి క్రొత్తఆచారమయ్యెను. ఉగ్రసేనునికి బూర్వము వీరు ఛత్రచామరములను ధరించి రాజ్యసింహాసనమునఁ గూర్చుం డెడు వారుకారు. కంసుఁడు ప్రతాపవంతుఁడగు రాజైనను రాజ్యఛత్ర చామరములను నాతఁడు ధరించి యుండలేదు. ఆతఁడు పంచాయతీ రాజ్యమును బోనాడి ఏకాధిపత్యమును స్థాపించి, ధారాసభను, శాసనసభను దీసివైచెను. కాని శ్రీకృష్ణుఁడు చెప్పఁగా నుగ్రసేనుఁడు యాదవులచే నియ మింపఁబడిన రాజుగ నెన్నఁబడెను. ఇదంతయును మన బల హీనముననే జరిగినది. అప్పుడు మనము లేచినిలుచుండి, కసరి యిట్టి దుస్సాహసము నేలచేయుచున్నారని యుండి నచో నీనూతనాచారము జరిగెడిదేనా? కులాచార విరుద్ధ ముగఁ గార్యము లొనర్చెడువారేనా? అట్లైన వీరికి సాహస ముండెడిదికాదు. కాని మనమేమియును మాటలాడలేదు. తత్పరిణామమున వీరు ఛత్ర, చామర, వ్యజన, శంఖా. రాజముకుట, రాజసింహాసనాదిఁ చిహ్నములను ధరించు చుండిరి. రాజులవలె శాసన శయ్యాదు లుపయోగించు చుండిరి. ఆ పరిణామముననే నిన్నమొన్న యేర్పడిన రాజ

మాత్రులు మనల నాజ్ఞాపించుచున్నారు. మనల కాదేశముల నొసంగుచున్నారు. భయపెట్టుచున్నారు. గద్దించుచున్నారు.''

అంత నింకొకఁడు వ్యంగ్యస్వరమున నిట్లనెను:-''ఏమైన గానిండు. రాజులు కాదయ్యా, రాజాధిరాజులే అయినా రయ్యా యిప్పుడు. వీరు రాజరాజులే అయినచో రాజులపైఁ గూడ శాసన మొనర్ప నధికారమున్నది. మీరు పేక్షించి వీరికి కాళ్ళు తెప్పించినారు కావున వీరియాజ్ఞలను మన్నింప వలసినదే.'' అంతఁ బండ్లు పటపటకొఱుకుచు నింకొకఁ డిట్లనెను :- ''పొరపాటు మనదే. ఈ నీచులకు గాళ్ళు తెప్పించితిమి. వీరు రాజ్యమునుబొంది మనకనుకూలు రయ్యెదరను నాశతో నుంటిమి. మనకాధారముగ నుండగ నుందురను కొంటిమి. కాని వీరు వేఱుపాటుగనే యుండిరి. వీరు తినిన ఆకునే చించుకొనుచున్నారు. కుక్కకు మొఱఁగుట నేర్పితిమా అది తనయజమానినే కఱవఁబోవును. సర్పమునకుఁ బాలుపోసినచో సాత్త్వికప్రకృతి రాదుసరిగదా! దానివిషము వృద్ధిపొందును. ఇట్టి స్థితియే యీ యాదవులకును గలిగినది. వీరికి రాజ్యచిహ్నముల నొసంగినవారికే వీరు ప్రతికూలాచరణ మొనర్చుచున్నారు. దాతనే తుచ్ఛముగ భావించి ఆజ్ఞనొసంగుచున్నారు. ఇప్పుడు చేయవలసిన పని యిదియే. వీరినుండి యీ ఛత్ర చామరాది రాజ్యచిహ్నములను లాగు కొనుటయే. అంత వీరిని రాజ్యబహిష్కృతుల నొనర్ప వల

యును. వీరు రాజ్యచిహ్నములను ధరింప యోగ్యులుకారు. ఇచ్చట యీ చిన్నవాని దుస్సాహసమును గాంచుఁడు. ఈ నీచుఁడు రాజకన్యకతో వివాహమాడ దలఁచుచున్నాఁడు. రాజైనను సామాన్యపు రాజుకాఁడు. పురువంశరాజులతో. ఇప్పుడు వీని దుష్టతకు ఫలములభింపఁగా వీనిపెత్తండ్రి వచ్చినాఁడు మీసముపైఁ జేయివైచుకొని, ఉగ్రసేనుఁ డీయాజ్ఞ నిచ్చెను. ఆయజ్ఞ నిచ్చెనని బడబడలాడుచున్నాఁడు. ఈనిర్లజ్జునకు అట్లనుటకు సిగ్గైన వైచుట లేదు. మనమే వారినిఁ బైకెత్తితిమి. మనలనే వా రాజ్ఞాపించుచున్నారు.''

అంత నింకొకఁ డిట్లనెను :- ''ఓయీ! కత్తెవరిదో గే దెవారిది. నేఁడు యాదవుల మాట సాగుచున్నది. పది పండ్రెండుగుర నిర్బలులగు రాజులను వీరోడించినారు. దాని మీఁద వీరికహంకారము పెచ్చు పెరిగిపోయినది. వీరు తామే మహాబలవంతుల మనుకొనుచున్నారు.''

ఆతఁడుపండ్లుపటపట గొఱకుచు నిట్లనెను :-''ఓయీ! భగవద్భజన మొనర్పుము. ఎక్కడి బలవంతులురా? ఒక్కఁడును గట్టివాఁడు లేనప్పుడే. ఎచ్చటనైన సింహములతో గొఱ్ఱెలు పోరాడఁగలవా? మనకులమున భీష్మపితామహుఁడు కలఁడు. ద్రోణాచార్యుఁడున్నాఁడు. భీమార్జునాదులున్నారు. భూమండలమున రాజులసంగతినట్లుంచుఁడు. వీరిని దేవేంద్రుఁడును జయింపఁ జాలఁడు. ఈ త్రాగుబోతు బలరాముని వాగనిమ్ము. ఈతఁడేమి చేయఁగలఁడో చూతము.''

సూతుఁ డిట్లనెను :-"మునులార! కౌరవులకు దమ కులీనతను గూర్చి బలైశ్వర్యములను గూర్చిఁ అత్యధికమగు గర్వము కలదు. రామకృష్ణు లిద్దరును సాక్షాదీశ్వరులని వా రెఱుగకుండిరి. అందువలననే వారిట్టి కఠోర వాక్యములను బలుకుచు, నాతనికి బ్రణామ నమస్కారము లేమియును జేయకయే వెనుదిరిగి తమ నగరమున కసభ్యతగా వెడలి పోయిరి."

కౌరవులు తన యెడల నిట్టి యశిష్ట వ్యవహార మొన ర్చెదరని బలరామునకు స్వప్నమందైనను లేకుండెను. వారి కుటిలత్వము గాంచుటను, వారి కఠిన వచనములను విను టచేతను బలరామునకు మిక్కిలి కోపము వచ్చెను. ఆతడు మాటిమాటికిని శుష్కహాసము నొనర్చుచు నుద్ధవునితో నిట్లనెను:-"వీరి పొగరు చూడుఁడు? ఈతఁడు పైకి నవ్వు చున్నను లోలోపల నాతని రోమరోమమున గ్రోధము వ్యాపించి యుండెను. క్రోధముచే నాతని సౌమ్యరూపము ఉగ్రమయ్యెను. ఆతఁడు గ్రీష్మఋతువునందలి మధ్యాహ్న మార్తాండునివలె దుర్దర్శనీయుఁడై యుండెను. ఆతఁ డిట్ల నెను:-"ఉద్ధవా! చూడుము. సాంబుని బట్టుకొనిన సంగతిని విని యాదవు లెంత కుపితులైరో చూచితివి కదా! నే నేదో విధమున వారికి నచ్చఁ జెప్పి శాంతుల నొనర్చితిని. యాద వులకును గౌరవులకును గలహముండఁ గూడదనియు శాంత

ముగ నుండవలయునవియు ననుకొంటిని. మనకును వీరికిని సంబంధమును, మిత్రత్వము పూర్ణముగ నుండి. కాని వీరు తాము శ్రేష్ఠులమనియు, ఐశ్వర్యవంతుల మనియు గులీనుల మనియు, గుటు బీరులమనియు దమ విపుల సంపత్తును జూచుకొని మిక్కిలి మదించిరి. ఒక మదము వలననే ఉన్మత్తుడైన వ్యక్తి యెన్నో అనర్థములను గావించును. పైగా నానామదము లున్నప్పుడెంత అహంకరించునో చెప్పలేము. అట్టివాడు శాంతిని గోరడు అట్టి వారితో శాంతిని గూర్చి చెప్పినచో, వారికి భయపడి చెప్పుచున్నట్లు భావించు చుందురు. కావున వారు శాంతి ప్రస్తావమును గాలదన్ని, శాంతి నిచ్చించు వారల నవమానించు చున్నారు. వీరు మన మాట విను వారుకారు.''

ఉద్ధవుడిట్లనెను :-''అయితే, యేమి చేయవలసి యుండును.''

బలరాముడు రోషస్వరమున నిట్లనెను :-''ఏమి చేయుదము. తన్నులగొడ్డు లాలింపులచే వశపడదు. పశువులను గఱ్ఱదెబ్బలతోడనే వశపఱచుకొనవలెను. ఈ మూర్ఖులు పశుసమానులు. అందువలననే వీరికి నాశాంతి వాక్యములు నచ్చలేదు. శ్రీకృష్ణుడు యుద్ధ తత్పరుడు. కాని వాని నెట్లో చెప్పి నేను వచ్చితిని. కాని వీరి పొగరును జూడుము నాముందే వీరెట్టి కఠినవాక్యములను బలికినారో.''

"ఈ దుష్టులు ఉగ్రసేన మహారాజు మమ్ముల నాజ్ఞాపించుట కధికార మేమున్నదను చున్నారు. ఉగ్రసేనుని యాజ్ఞలను ఇంద్రాది లోకపాలురును శిరసావహించెదరు. ఈ నీచ కీటకము వారి ముందేమి లెక్క. వారుగ్రసేనుని రాజుగా భావించుటలేదు. భోజవంశ, వృష్ణివంశ, అంధక వంశముల కితఁడధిపతి. ఈతనిముందీ కౌరవులు దేనికి బనికి వచ్చెదరు. యాదవులు రాజ్యసింహాసనమున కధికారులు కారని వీరు పలుకుచున్నారు. యాదవులకు రాజ్యసింహాసన మే మూల? ఏమి లెక్క? ఇంద్రునిజయించి స్వర్గము నుండి యింద్రుని సుధర్మసభను దెచ్చి, ఇంద్రునిఁ బరాజితు నొనర్చి పారిజాత వృక్షమును దెచ్చిన కృష్ణుని రాజ్యసింహాసనమున కధికారియని యీ దుష్టమానవ నరపతి అను చున్నాఁడు. ఈ తుచ్ఛరాజులు అల్ప లక్ష్మీచ్ఛాయనుబొంది తా మే ఐశ్వర్యవంతులమని గర్వించుచున్నారు. ఆ లక్ష్మి కృష్ణుని సశరీరిణియై నిరంతరము సేవసేయుచుండును. అట్టి కృష్ణుని సమ్ముఖమున ఛత్ర చామరాది చిహ్నములేమి లెక్క? ఎవని చరణ కమల రజమును ధరించి ఆ శివవేష ధారియగు శివుఁడు శివుఁడైనాఁడో, ఏ చరణ రజమును బొంది బ్రహ్మ సృజించుచుండునో, శేషరూపుఁడనగు నేనును నెవని చరణ రజ ప్రభావముచే భూమండలమును ధరించు చుంటినో, ఆ కృష్ణునకు రాజ్యమేమి లెక్క?"

"బాగున్నది. వీరేమనుచున్నారో అననిండు. మేము కాలి చెప్పులము. ఈ కౌరవులు శిరములా? ఒక్కొక్క ప్పుడు కాలిచెప్పులు శిరమందుబాది వారి వెంట్రుకలనూడ గొట్టుచుండును. మేము వీరిచ్చిన రాజ్యమును భోగించు చున్నాము. ఇప్పుడు చూడవలెను. వీరెవరిచ్చిన రాజ్యము ననుభవించెదరో, వీరు మాటాడిన మర్మస్పర్శ వాక్యముల నెవడును నాత్మాభిమానముగల మనస్వులగు పురుషులు సహింపఁజాలరు. శాసన మొనర్చువారు శాసనమొనర్ప చేత గాని వారిమాటల నెవరు సహింపఁగలరు? మంచిది. నేఁడు పృథివిపైఁ గౌరవులైనను నుండవలెను. యాదవులైనను నుండవలయును. నాకు సేనాదులవసరము లేదు. నే నొంటరిగా భూమియందు కౌరవరహిత మొనర్పఁగలను. యాదవులు రాజులగుదురో కారో నేఁడు కౌరవులు చూచెదరుగాక! వారే భీష్మద్రోణాదులను జూచుకొని అహంకరించు కొను చున్నారో వారిని గూడఁ రానిమ్ము. నేఁడు వీరందఱితోఁ బాటుగ వీరి రాజధానిని గంగలోఁ గలిపెదను."

సూతుఁడిట్లనెను:–"మునులారా! ఇట్లు పలికి అత్యంత రోషమున సంకర్షణ భగవానుఁడు తన హలముసలములను దీసికొనెను. ఆ సమయమున నాతని రోషముద్ర మూఁడు లోకములను నాతఁడు భస్మమొనర్చునా యనునట్లుండెను. ఆతని యీ రోషమును గాంచి లోకపాలురు భయపడిరి.

పృథివి కంపింప నారంభించెను. ఆతఁడు హాలమును దీసికొని హస్తినాపురమును బెల్లగించుట కుద్యమించెను."



## బలరాముఁడు హస్తినాపురమును గర్షించుట.

శ్లో॥ లాంగలాగ్రేణ నగర ముద్విదార్య గజాహ్వయమ్।
విచకర్ష స గంగాయాం ప్రహరిష్య న్నమర్షితః॥
శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౮ అ. ౪౧ శ్లో॥

వ. సీరము పూన్చి కౌరవరాజధానియైన కరినగరంబు కడ తన హలాగ్రంబును జొనిపి యప్పాట భేదన విస్తారంబగు గడ్డ భుజాగర్వ దుర్వారుండై పెకలించి తిగిచిగంగాప్రవాహంబునం బడఁద్రోయ గమకించిన.

—శ్రీమదాంధ్ర భాగవతము.

గొప్పవారి కెంత త్వరగాఁ గోపము వచ్చునో అంత త్వరగా శాంతించును. ఆతని యెదుటఁ బెడకట్టెగా నుండి, అహంకారమును జూపునెడల వారియెడల నాతఁడు వజ్రము వలె నగును. ఆతని యెదుట దీనుఁడై, గిలగిల కొట్టుకొనినచో నట్టివారి యెదుట నాతఁడు మైనమువలెఁ గఱగిపోవును. కోమలమై పోవును. ఇదియే మహాపురుషుల యొక్క మహత్వము. అభిమాన వశమున నజ్ఞాని ఆతనిఁ గటువచనము

లను బలికినచో నాతఁడు మనస్సులో నుంచుకొనఁడు. ఆత్మ అజ్ఞానమును స్మరించి క్షమించును.

సూతుఁడిట్లనెను:-"మునులారా! క్రోధోద్రేకముగ శేషావతారుఁడగు సంకర్షణుఁడు హస్తినాపురమును దన హలాగ్రముచేఁ బెల్లగించెను. నగరమునంతను బెల్లగించి దానిని గంగవైపునకు లాగెను. అందఱకును భూకంపము వచ్చినట్లుండెను. ప్రవాహజలమున నౌక యూగినట్లుండెను. నగరమును నూగిపోవుచుండెను. బలరాముఁడు నగరమును గంగలోనికి లాగుటను గాంచి కౌరవులందఱును జాల భయపడిరి. ఇప్పుడు వారి సైన్యమును బనిచేయఁజాలదు. వారి పరాక్రమమును బనికి రాకుండెను. ఇది సంకర్షణునకుఁ జేసిన అవజ్ఞయొక్క ప్రతిఫలమని భీష్ముఁడు గ్రహించి, దుర్యోధనునిఁ బిలిచి యిట్లనెను:-"నీవు వెంటనే లక్ష్మణా సహితుఁడగు సాంబుని దీసికొని బలరాముని కడకుపొమ్ము. ఆతనికి క్షమాపణమును గోరుకొనుము. అట్లు చేయకుండినచో మన నగరము మిగులనే మిగులదు."

ఇది విని దుర్యోధనుఁడు తన సంబంధులను బంధువులను వెంటఁబెట్టుకొని, లక్ష్మణా సహితముగ సాంబునిఁ దీసికొని సపరివారముగ బలరాముని కడకుఁ వచ్చెను. అందఱును భయపడిరి. అందఱకును ప్రాణముమీఁదకు వచ్చెను. ఈ సంకటమును బయటపడుటకు బలరాముని శరణుఁ వేడుట

తప్ప వేఱొక యుపాయము లేకుండెను. అందువలన నంద
ఱును గలిసిపోయి అమిత బలశాలియగు బలరాముని పాద
పద్మముల మీఁదఁబడి ప్రణామమును గావించి యిట్లనెను :-
"రామా! రామా! మహాబాహూ! నీ వమిత తేజస్వివి.
నీ బలపౌరుషము లెవ రెఱుఁగ గలరు ? నీవు సమస్త సంసార
మున కాధారుఁడవు. మేము నీ ప్రభావము నెఱుఁగఁ జాలకయే
యిట్టి కువాచ్యములను బలికితిమి. జగదీశ్వరుఁడ వగు నిన్నవ
మానించితిమి. అశరణ శరణా! ఇప్పుడు మాకు నీ మహిమ
తెలిసినది. మేము జడమతులము, మూఢులము. కుబుద్ధిఁ
చేతను, అజ్ఞాన వశముచేతను నీకపరాధమును గావించితిమి.
నీవు నీయుదారతచే క్షమింపవలయును. నీ వీ దృశ్యప్రపంచ
మునకును,విశ్వబ్రహ్మాండమునకును నాధారుఁడవు. బ్రహ్మవై
సృష్టినిఁ జేయుచుందువు. విష్ణువై నీవే దానిని రక్షించుచుం
దువు రుద్రుఁడవై చివరకు నీవే నీవేర్పఱచిన సృష్టిని సంహ
రించుచుందువు. నీవే అన్నిటికి నాధారమవు. నీకాధార
మెవరును లేరు. శేషావతారా! సాలెపురుగెట్లు తన
నోటినుండి తీసిన తంతువులతో వలనల్లి, దానిలోనే క్రీడించు
చుందువు. వాస్తవమునకు నీకాసక్తి యేమియును లేదు.
నీ వీ సమస్త జగత్తును నాటవస్తువుగఁ జేసికొని లోకవల్లీల
యొనర్చు చుందువు, నీవాట నుపసంహరింప దలఁచి
నప్పుడు,సమస్తమును నీయుదరమునను౦చుకొందువు.అప్పుడు

క్షీరసాగరమునకు బోయి పరుండెదవు. అప్పుడు నిన్ను క్షీర సాగరశాయి యగు నారాయణుఁడని చెప్పుచుందురు. నీవు వాస్తవమున సత్వ, రజ, స్తమములను త్రిగుణములకును బరుఁడవు. నీవు విశుద్ధ సత్వమయుఁడవు.

సర్వభూతాత్మా! చాల మంది నీవు క్రోధివని పలుకు చుందురు. కాని నీ క్రోధము వివేకశూన్యులగు సర్వసాధార ణుల క్రోధము వంటిది కాదు. నీవు కోప బడినను లోక కల్యాణము కొఱకే కోపపడుచుందువు. నీ క్రోధము సమస్త ప్రాణులకును శిక్షణ నొసంగుటకై యుండును. ద్వేషా సూయలతోఁ గూడి యుండదు. సర్వశక్తిధరా! నీవు హాలము ద్వారా జ్ఞానమును గలిగించి, మాకన్నులను దెఱ పించితివి. విభూ! మేము నీ పాదపద్మములకు పునః పునః ప్రణామము లొనర్చుచున్నాము. శరణాగత వత్సలా! మేము నీశరణు జొచ్చితిమి. విశ్వకర్మా! శరణాగతుల మగు మమ్ము రక్షింపుము.''

సూతుఁ డిట్లనెను:-''మునులారా! కౌరవులు గర్వ పోతులు. వారు వారి కులమును, సేనను, శక్తిని, ఐశ్వర్య మును జూచుకుని మిక్కిలి గర్వపడు చుందురు. అందులకే వారు బలరాము నన్ని మాటలనినారు. వారి భవనములూఁగ సాగఁగానే వారు కన్నులను దెఱచిరి. అప్పుడు పరుగిడి బలరాముని కడకువచ్చిరి, వచ్చి అత్యంత దీనతతో వినయ

వినమ్రులై ప్రార్థించిరి. ఆతడు హలమును దీసి యీవలఁ బెట్టెను. హస్తినాపురమును లాగుటను మానివైచెను. వా రందఱ కభయదాన మొసంగుచు నిట్లనెను :–" నేను మీరు చేసిన ప్రార్థనకు సంతోషించితిని. ఇఁక భయపడ వలసినపని లేదు. మీరు నిర్భయులు కండు. ఈవిధముగఁ బలికి అంద ఱకును నోదార్పును గలిగించెను.

సంకర్షణుఁడు సంతుష్టుఁ డైనాడను సంగతినిఁ దెలిసి కొని, దుర్యోధనుఁడు ముందునకువచ్చి యిట్లనెను:–'ప్రభూ! ఇదుగో మీ పుత్రుడగు సాంబుఁడు నవవధువుతోఁ గూడి మీ చరణములకు ప్రణామ మొనర్చు చున్నాఁడు. వీరిని మీ రాశీర్వదింపుడు."

ఇది విని కాళ్ళమీదఁ బడిన సాంబుని బలభద్రుఁడు ప్రేమ పూర్వకముగ లేవఁదీసి కౌగలించుకొనెను. ఆతనిఁ శిరస్సును మూర్కొనెను. లక్ష్మణునకును నాశీర్వాదముల నొసంగెను."

బలరాముడుఁ దుర్యోధనునితో నిట్లనెను :– "మం చిది. మేమే కార్యము కొఱకు వచ్చితిమో అది అయినది. ఇఁక మేము పోయివచ్చెదము."

దుర్యోధనుఁడు వినీత భావముతో నిట్లనెను :– "అట్లుకాదు స్వామీ! అట్లుపోవుట యెట్లు సంభవింపఁ గలదు. మీరు మా నగరములోనికి వచ్చి మా ఆతిథ్య మును గ్రహించి, కోడలితో మీపుత్రునిఁ దీసికొనిపొండు."

అందఱును బలవంతి మొనర్పఁగా బలభద్రుఁడు హస్తినాపురమునకు వచ్చెను. దుర్యోధనుఁడు లక్ష్మణ వివాహమును వేద విధి ననుసరించి సాంబుని కిచ్చి చేసెను. ఆతఁడా పిల్ల నెక్కువ ప్రేమించుటచే నామె వెంట అఱువది సంవత్సరముల యీడుగల పంద్రెండువందల గజములను, పదివేల గుఱ్ఱములను, సుందర సువర్ణ మండితములై మెఱయు చుండిన నాఱువేల రథములను, వేయిమంది దాస దాసీ జనములను నరణముగ నొసంగెను. దాసీలందఱును మిక్కిలి సుందరలు, యువతులు, సువర్ణ భూషణములను గంఠమందును, సర్వాంగములందును ధరించి యుండిరి.

ఈ విధముగ బలరాముఁడు హస్తినాపురమునఁ గౌరవుల ఆతిథ్యమును గ్రహించి కొడుకును కోడలిని వెంటఁ బెట్టుకొని అరణములతోఁ గూడుకొని ఆనందమునఁ దన పురికి విజయమొనర్చెను. అందఱును బలరాముని ఆగమనమును వినఁగానే అందఱును మేళతాళములతో నగరము వెలుపలకు వచ్చి ఎదుర్కొని తీసికొనిపోయిరి. అచ్చటికి చేరిన తరువాత హలధరునకు అందఱును స్వాగతసత్కారములను గావించిరి. అందఱును బలరాముని కొఱకు ప్రతీక్షించుచుండిరి. అందఱియొక్క చింత ఆతనిమీఁదనే యుండెను. ఇంతటి అభిమానులగు గౌరవుల నింత త్వరగా వశములోని కెట్లు తీసికొని వచ్చినాఁడా యని అందఱు నాశ్చర్యమును జెందుచుండిరి.

అందఱును నుత్సాహముగ నడుగుచుండుటనుగాంచి బలభద్రుఁడు మొదటినుండి చివరవఱకు సమాచారము నంతను జెప్పుచు నిట్లనెను :- "మొట్టమొదట వారు కొన్ని అనరాని మాటలను వాగిరి. కోపమువచ్చి లేచి వెడలి పోయిరి. అప్పుడు నేను నాహలాగ్రముచే నగరమును బెల్లగింపఁ బ్రారంభింపఁగా నందఱును నదరిపోయిరి. తడిసిన పిల్లికి వలె భయపడి నన్ను శరణువేఁడ వచ్చిరి. నే నిట్లను కొంటిని :- "చచ్చినవారినిఁ చంపుటెందులకు ? భయపడిన పిఱికివానిపై నస్త్రములను వేయుట మంచిదికాదు." అని యాలోచించి నేను వారిని క్షమించితిని. నాయుద్దేశ్యము కేవలము వారిని భయపెట్టుటయే. వారెప్పుడు సాంబుని లక్షణాసహితముగ నావద్దకు దీసికొనివచ్చిరో, అప్పుడు నేను వారిని క్షమించితిని." ఇది విని అందఱు నానందించిరి. అందఱును బలరాముని బల, బుద్ధులను గూర్చి భూరిగఁ బ్రశంసించిరి.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! బలరాముని హలాగ్రముచే లాగబడుటచే హస్తినాపుర మిప్పటికిని గంగానది వైపునఁ బల్లముగ నున్నది. దక్షిణ వైపు మెఱకగ నున్నది. ఇప్పుడా నగరమంతయును లేదు. హస్తినా పురమను నొక దిబ్బకలదు. ఇప్పుడు గంగ అచ్చటినుండి చాల దూరమునకుఁ బోయినది. కాని అది గంగవైపునకు

వాలి యుండుటచే నిప్పటికిని బలరాముని బలపౌరుషము లను నది సూచించు చున్నది ఈవిధముగ నేను మీకుహ స్తినా పుర కర్షణమును బ్రసంగమున జెప్పితిని. ఇప్పుడింక మీ రేమి వినఁదలంచు చున్నారు.''

శౌనకుఁ డిట్లనెను :-''సూతా! మాకు భగవానుఁ డగు కృష్ణుని గూర్చిన అన్య చరిత్రములను జెప్పుము. ఈతఁడు తన పత్నులతో నెట్లు వ్యవహరించు చుండెడి వాఁడు. ఎట్లు భార్యల నందఱను సంతోష పెట్టువాఁడు ?''

సూతుఁ డిట్లనెను :-''స్వామీ! ఈ శంక దేవర్షి నారదునకు గూడ కలిగినది. భగవానుఁ డొక్కఁడుఁ కదా! ఆతనికి పదునాఱువేల నూటయెనిమిది మంది భార్యలు కలరే. ఒంటరిగా నందఱ నెట్లు సంతోష పెట్టు చున్నాడు! ఈ విషమునఁ బరీక్షిన్మహారాజు అడుగకుండినను మా గురుఁ దేవుఁడగు శుకుఁ డేమి సమాధానమును జెప్పెనో దానిని మీ కిపుడు వర్ణించి చెప్పెదను. మీ రందఱును సావధాను లరై వినుడు.

— 5 —

# నారదుఁడు-కృష్ణుని గృహచర్య

శ్లో. నరకం నిహతం శ్రుత్వా తథోద్వాహంచ యోషితామ్
కృష్ణే నైకేన బహ్వీనాం దద్ది దృక్షు స్మ నారదః॥
—శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౯ అ. ౧ శ్లో.

చ॥ నరవర యొక్కనాఁడు విను నారద సంయమి మాధ
వుండు దా, నరకునిఁ ద్రుంచి వాని భవనంబున నున్న
పదాఱువేల సుం, దరులను నొక్కమాటు ప్రమదంబున
నందఱ కన్ని రూపులై, పరిణయ మయ్యె నా విని శుభ
స్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్.
—శ్రీమదాంధ్ర భాగవతము.

స్త్రీలనందఱఁ బ్రసన్నులుగ నుంచఁగల వాఁడీశ్వరుఁడు తప్ప యింకెవరుకును సాధ్యముకాదు. సర్పములతోఁ జాల దినములాడి, అవి క్రుద్ధములు కాకుండునట్లు చేయుటకు వీలున్నది. కాని స్త్రీలు సదా ప్రసన్నులుగ నుంచుట మాత్రము సాధ్యముకాదు. భగవానుఁడు లక్ష్మీదేవినిఁ బ్రసన్న నొనర్చుచుండును. ఆమెనేకాక భూదేవిని లీలాదేవినిగూడ వారు సవతులై పోరాడుకొనకుండునట్లు ప్రసన్నులుగ నుంచఁగలుగుచున్నాడు. భగవంతుఁడు తప్ప యింకెవఁడైనను స్త్రీచేనేవో చీవాట్లు, తిట్లు ఇంకేవేవో పడితీరవలసినదే. స్త్రీలను వశములో నుంచుకొనుటయును నొక కళయే. ఈ కళలో మన శ్యామసుందరుఁ డందెవైచిన చేయి. అందుకనియే

ఆతఁడు పదునాఱువేల నూట యెనిమిది మంది స్త్రీలను బెండ్లి చేసికొని, వారి నందఱను సదా సంతోష పెట్టు చుండును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఎవరికెవరిమీఁదఁ బ్రేమయుండునో, ఆతఁడు వానినిఁ గలిసికొనకుండఁజాలఁడు. అట్లు కలిసికొనకుండిన మనస్సున కేమియును దోఁచదు. మన నారద మహామునికి శ్యామసుందర భగవానుని చరణము లందు దృఢమగు ననురాగము కలదు. అందువలన నాతఁడు ద్వారకకు బోకుండ నుండఁ జాలఁడు. భ్రమరము కమలము చుట్టును దిరుగుచుండునట్లు, నారదుఁడును సదా ద్వారకకు నలువైపులను దిరుగుచుండును. అటు నిటుఁబోయి మరల ద్వారకకు వచ్చుచుండును. పండ్లలో నేదైన నిరుక్కొనిన నాలుక దానికదియే ఆచ్చటికిఁబోయినట్లు, ప్రేమ యెవరి మీఁద నుండునో అచ్చటికి మనస్సు వలదన్నను బోవుచుం డును. వారి విషయమునే తలఁచుచుండును. ఆతఁడెట్లు తిను చుండునో, ఎట్లు లేచుచుండునో, వారితో నెట్లువ్యవహరించు చుండునో. ఆతడికెట్టి కష్టము వచ్చియుండును. అప్పుడాతఁ డేమి చేసినాఁడో. ఈ సమయమున నాతఁడేమి చేయుచుం డునో." అని యీ విధముగ ననేక విచారము లాతని విషయమున నుత్పన్నమగుచుండును. అందువలన నారదుఁ డెల్లప్పుడును భగవానుని విషయమును గూర్చి చింతించు

చుండును. ప్రేమలో సదా నూతనత్వముండును. ప్రేమ యొక్క చేష్టలన్నియును మిక్కిలి ప్రియములుగ నుండును. ఎట్లనఁగా రసగుల్లాను, బంగారు, వెండి, కంచు. ఇత్తడి, మట్టి, కొయ్య, ఆకు మొదలగు పాత్రములలో నెచ్చట బెట్టి తిన్నను దీపిగానేయుండును. అందువలన నారదుఁడు మాటి మాటికిని ద్వారకకు వెడలుచుండును. భగవానుఁడు స్నాన మాడుచుండిన నెట్లుండునో, భోజనము చేయుచుండిన నెట్లుం డునో, పోవుచున్నను వచ్చుచున్నను నెట్లుండునో, నిద్రించు చుండిన నెట్లుండునో చూడవలయునని యుండును. ఎన్ని సారులు చూచినను నింకను జూడవలయుననియే యుండును. ఎంతగాఁ జూచినను దృప్తియు డదు. తిరిగి తిరిగి మరల నచ్చటికే వచ్చును.

ఒకదినమున నారదుఁడిట్లనుకొనెను :- "భగవంతుని దగ్గఱకు నేనెప్పుడు పోయిచూచినను నాతని భార్యలంద ఱును సంతుష్టులయియే యుండిరి. సవతులలో మత్సరముగల సత్యభామవంటి మానినులును భార్యలలో లేకపోలేదు. కాని కృష్ణుని వలననందఱును సమానముగ సంతుష్టులైయున్నారు. అందఱికంటె పెద్దరాణి యగుటచే నేను రుక్మిణీదేవి యింటికే పోవుచుందును. పోఁగానే భగవానుఁడు నాతో నిట్లనును :- "నారదా ! వీణను వాయించుము." నేను వీణను మీటఁ గానే గుంపులు గుంపులుగ నందఱును నచ్చటికి వచ్చిచేరు

చుండెదరు. భగవానుఁడెచ్చట నుండిన నచ్చటికి బోవుద
నని వారందఱును వీణాశబ్దము రాఁగానే బయలుదేరి వచ్చు
చుందురు. అన్నిటికంటె నాశ్చర్యకరమగు విషయ మేఁ
నఁగా నందఱకును శ్యామసుందరుని యెడల నత్యధికమగ
ననురాగము కలదు. ఆ స్త్రీలు వేలకొలఁదిగ గలరు. భగ
వానుఁడొక్కఁడే. వారినందఱను నెట్లు సంతోష పెట్ట
చున్నాఁడో. నేను బూర్వ కర్మవశమున నొక్కస్త్రీతో
సంబంధమును బెట్టుకొంటిని. చివరకు దానిని వదలవల
వచ్చినది.

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- "సూతా ! నీవు ఒక్కొ
క్కప్పుడాశ్చర్యకరములును, విచిత్రములు నగువిషయము
లను జెప్పుచుందువు. వానిమీఁద విశ్వాసమును జనింపదు.
మహాభాగా ! నారదుఁడు పుట్టుక తోడనే గృహత్యాగి
యగు బ్రహ్మచారియే. అతఁడెన్నడును దార పరిగ్రహ
మొనర్పలేదు. భగవానుని యొక్క యీ మోహమయ
మాయను దప్పించుకొనియే యున్నాఁడు. అతఁడును నొక్క
భార్యను వివాహ మాడెనని చెప్పుచున్నావు. మహాభాగా !
నారదుడెవరిని వివాహమాడెను. ఆమె నేలవదలెను, నా
నారదుఁడీ మాయలో నేలపడినాడు ? విరాగియైనవాఁడు
రాగియెట్లైనాఁడో ? ముందు మా కీవిషయమును జెప్పవల
యును."

సూతుఁడిట్లనెను :- ''స్వామీ ! మాయలో నుండు వానికి మాయ సంసర్గముండక పోవుట అసంభవము. ఈ సనక సనందనాదులు మాయిక సృష్టిలోనివారుకారు. వీరు మోహమయమగు మాయకు ముందే పుట్టిరి. పంచపర్వ యగు నీ యవిద్య కలుగఁగానే బ్రహ్మ ఒక్కఁడుగ నున్నవాఁ డిద్దరయ్యెను. అప్పటినుండి అందఱకును నిద్దరు కావలయు నను కోరిక కలిగెను. చాలామంది ఋషులును, మునులును జీవితాంతము వఱకు ఊర్ధ్వరేతస్కులుగ నుండి బ్రహ్మచర్య వ్రతమును బాలించుచుండిరి. కాని ఒక్కొక్కప్పుడు మోహమయమగు నీమాయ వారిని గూడ మోహములోఁ బడ వేయు చుండును. ఋషులలో నొక్క బదరీనాథుఁ డగు నారాయణ ఋషియే యీ మాయలోఁ బడకుండెను. కాని ఏదోవిధ మగు గడబిడ అందఱకును గలిగియే తీరును. సాంసారికులను నిత్యమును గృహస్థధర్మములో నిరతులై యుండుటచే నే కొలఁదిగనో గొప్పగనో సంస్కారము పడితీరును. కావుననే మానవుఁడెన్నడును ననాశ్రమిగా నుండరాదని ఋషులు మాటిమాటికిని జెప్పుచునే యున్నారు. ఒక్క క్షణమైనను మానవుఁడనాశ్రమిగా నుండినచోఁ బతితుఁడై పోవును. ఆధారము లేక జీవనమును బండి యెట్లునడవగలదు? సరే, మీరు నన్నునారదుని వివాహ ప్రశ్నమును గూర్చి అడిగితిరి. దానినే నేను జెప్పెదను.

ఒకనాఁడు విష్ణువును శ్రీకృష్ణలీలలను గూర్చి నారదుఁడు చాల ప్రశ్న లడుగఁగా విష్ణువు సమాధానమును జెప్పెను. నారదుఁడు భగవానుని సమాధానములకు మిక్కిలి సంతుష్టుఁడై యిట్లనెను :–"స్వామీ! మీరు నాయెడలఁ గృప జూపితిరి. భగవానునియొక్క రహస్యమయ లీలలను జెప్పితిరి. ఇప్పుడు నా కేమి ఆజ్ఞ? ఇప్పుడు నేనేమి చేయుదును? మీ యాజ్ఞయైనచో నేను హిమాలయమునకుఁబోయి తపస్సు చేసికొనెదను."

ఇది విని నవ్వుచు భగవానుఁడిట్లనెను :–"నారదా! ఇప్పుడు తపస్సును గిపస్సును వదలిపెట్టుము. తపస్సు ఇంటిలోని వస్తువు–ఎప్పుడు తలఁచుకొనిన నప్పుడు చేయ వచ్చును. ఒక్కపనినిఁ జేయుము. పోయి వివాహమును జేసికొనుము."

నారదుఁడులికిపడి యిట్లనెను :–"స్వామీ! మీ రేమి మాటలు మాటలాడుచున్నారు? నేను వివాహమును జేసికొననని ప్రతిజ్ఞ చేసి యున్నాను. నేను దేనికొఱకై భయపడి ప్రతిజ్ఞ చేసితినో మీరు దానినే నాకంట గట్టఁజూచుచున్నారు. స్వామీ! నాకు వివాహమును జేసికొనవలయునని లేదు.

నవ్వుచు భగవానుఁ డిట్లనెను :–"ఓయీ! ఒంటరిగా నీవనుకొనిన పనులు నెఱవేరఁజాలవు. జన్మాంతరీయ సంస్కా

రములు ప్రబలములుగ నుండును. ఇతరులయొక్క ఆకర్ష ణము మనల నావైపునకు లాగుకొనును. అందువలన నిచ్ఛ లేకున్నను లాగితీరును.''

నారదుం డుత్సాహముతో నిట్లనెను :-''నన్నుఁ దన వైపునకు లాగఁగల వారెవరున్నారు ?''

భగవానుఁడిట్లనెను :-''నీకు స్మరణ లేదా ? నీవు పూర్వము ఉపబర్హణుఁడను గంధర్వుఁడవు. ఆ తరువాత నీవు దాసీ పుత్రుఁడవైతివి అప్పుడు నీకు సాధుసాంగత్యము లభించినది. ఆ మూలమున నీకు మరల నారద శరీరము లభించినది. బ్రహ్మకు మానసపుత్రుఁడవైతివి. నీవు గంధ ర్వుఁడవుగ నున్నప్పుడు నీవు గొప్ప స్త్రీలంపటుఁడవు. నీవతి సుందరుఁడవుగ నుండెడు వాఁడవు. నీరూపమునుగాంచి చాలమంది గాంధర్వస్త్రీ లాసక్తినిఁ జెంది యుండిరి. ఆ గంధర్వస్త్రీలలో నొక్కతె నీయందు మిక్కిలిగ నాసక్తినిఁ జెందియుండెడిది. నిన్నుఁ బతిగాఁ బొందుటకై ఆమె శంక రుని గూర్చి ఘోరముగ తప మొనరించెను. ఆమె తపస్సుచే శంకరుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై వరము నడుగుమనెను. ఆమె యిట్లు వరమును గోరెను :-''సదాశివా ! నీ వీ దాసీ యెడలఁ బ్రసన్నుఁడవగుచో నాకు జన్మాంతరమున నార దుఁడే పతికావలయును.''

శివుఁడు బోళాశంకరుఁడు కదా! అతఁడప్పు డిట్లనెను :- "ఏవమస్తు మంచిది, అట్లే యగుగాక!" ఈ వరమునుబొంది ఆ గంధర్వ కన్య మిక్కిలి సంతోషించినది. ఈ సమయమున నామె సృంజయ మహారాజునకుఁ గూతురై పుట్టినది. నీవు పోయి ఆమెను వివాహమాడుము. శంకరుని యొక్క వరమింకొక విధముగఁ గాజాలదు. నీ వామెను పెండ్లిచేసికొని తీరవలయును."

నారదుఁడిట్లనెను :-"స్వామీ! మీరు నన్ను ధర్మ సంకటమునఁ బడవైచినారు. ఇప్పుడు మీ యాజ్ఞ నెట్లు దాటఁగలను?"

నవ్వుచు శ్రీమన్నారాయణుఁ డిట్లనెను :-"ఓయీ! ఇందులో ధర్మ సంకట మేమున్నది? నొసటను వ్రాసిన వ్రాలు నెవరు చెరుపఁగలరు?" ఫరవాలేదు. నిన్నే రాజ కుమారితోఁ బెండిలి చేసికొనుమని చెప్పుచుంటినో ఆమె సాధారణపు పిల్లకాదు. చాల చక్కనిది. కమల లోచన. అత్యంత కోమలాంగి. మధురభాషిణి. ఆమె కలహము లెఱుఁగదు. మాటమాటకును ముఖమును ముడుచుకొనదు. మంచి స్వభావము కలది. సుశీల. సద్గుణవతి. రూపవతి. ఒక్క నీయందే ఆమె మనస్సు లగ్నమైనది. ఈ ప్రారబ్ధము నెవ్వరును నెఱుఁగఁజాలరు. కావున నీవు ధర్మముగ నామెను వివాహమాడుము. అధర్మముగ రహస్యముగ వివాహ

మాడుట పాపము. ధర్మవిరుద్ధమగు కామమును నేనే. కావున నీవాలోచింపకుము. నీవొక్కసారి ఆమెను జూచిరమ్ము."

సూతుఁడిట్లనెను :- "మునులారా! నారాయణుని వాక్యములను విని నారదుఁడు దుఃఖిత మనస్సుతో నాతనికిఁ బ్రణామమును గావించి సృంజయపురమునకుఁ బోయెను. అచ్చటికి బోయి చూడఁగా నామె అత్యంత సుందరియై యుండెను. నిరంతరము జప, తప, పూజా, పారాయణము లందును, వ్రతమందును నుండెడిది. ఆమె చిత్తము నారదునిపై లగ్నమై యుండెను. మునులారా! మనస్సుతో నిరంతరము ధ్యానమొనరించినచో నావలి వారిమీఁద దాని ప్రభావము పడకుండుట అసంభవము. ఆమె సాధారణపు స్త్రీ అయి యుండినచోఁ దపస్వికి స్త్రీని జూడఁగనే ఏవగింపు కలిగెడిదే. కాని నిరంతరము దాన, వ్రత, జప, తప, దేవారాధనలో మునిఁగియుండి, తపస్వినివలె జీవితమును గడుపుచుండిన నామె ప్రభావము నారదునిపై నేల పడదు? నారదుఁడు జితేంద్రియుఁడైనను మాయామోహరహితుఁడు. అయినను నాతఁడా కన్యకను జూడఁగనే ఆసక్తినిఁ జెందెను. ఇప్పుడు నారదుఁడిట్లనుకొనెను :- "భగవానుని ఆజ్ఞయు నైనది. భవిష్యత్తుకూడ అట్లున్నది. ఈమెను వివాహమాడ వలసినదే." మరల నిట్లనుకొనెను:-"నాకు తండ్రియున్నాఁడు తండ్రి యుండఁగా వివాహమాడుటకు స్వతంత్రత లేదు.

కావున దండ్రికి పోయి చెప్పెదనుగాక! ఆతఁడిష్టపడినచో నాకు వివాహమును జేయును. ఒకవేళ వివాహము వలదనిన నేనంతగాఁ గావలయునని పట్టుపట్టను” అని అనుకొని ఆతఁడు వెంటనే బ్రహ్మలోకమునకుఁ బోయెను. పోయి బ్రహ్మచరణములకు సాష్టాంగనమస్కారమొనర్చెను. చాల కాలమునకుఁ దన కుమారునిఁగాంచుటచే బ్రహ్మ చాల ప్రేమించెను. ఆతని శిరస్సును మూర్కొనెను. బ్రహ్మ యిట్లనెను:- “నారదా! నీవు చాలదినములకు గాని రావేమి? ఏమి విశేషములు?”

నారదుఁడు వినీత భావముతో నిట్లనెను :-“స్వామీ! అంతయును మీకృపయే. ఇప్పుడు నేను శ్రీమహావిష్ణువు వలన శ్రీకృష్ణ చరిత్రమును వింటిని. చాలకాల మచ్చటనే యుంటిని. కథాంతమున నాతఁడొక విచిత్రమగు సమాచారమును జెప్పెను. ఆతఁడిట్లనెను:-“నీవు సృంజయరాజకుమార్తెను వివాహమాడుము.”

ఇది వినఁగానే బ్రహ్మయొక్క ముఖమండలము వికసించెను. ఆతఁడిట్లనెను :-“నేనెప్పటినుండియో నీకు చెప్పుట లేదా? నీవు నామాటను వినకపోయితివి. నేను మోహవశమునఁ జెప్పుచుంటినని నీవనుకొంటివి. అట్లుకాదు నాయనా! మాకును బ్రపంచ జ్ఞానము కలదుకదా! నాయీ గడ్డమొదులకు బక్వమైనది కాదు. నేనేది చెప్పినను ఆలోచించి

చెప్పుచుందును. స్త్రీ లేకున్నఁ బురుషుఁడు సగమే. అందు వలననే ఋషులందఱును బెండ్లి చేసికొనిరి. విష్ణువు తన పత్నియగులక్ష్మిని సదా తన హృదయమున ధరించును. శివుఁడు స్త్రీతో నర్ధనారీశ్వరుఁడైనాఁడు కాదా ? శక్తి హీనుఁడైన దేవత నొకనినిఁ జెప్పుము. కావున నీవు నా మాటను వినకపోయినఁ బోనిమ్ము. భగవానుని ఆజ్ఞను దిరస్కరింపరాదు. ఆతని యాజ్ఞలను బాలించి తీరవల యును.”

నారదుఁడు దానికిష్టపడుచునే యుండెను. అందు వలన నాతఁడిట్లనెను :- “సరే. స్వామీ! మీ అందఱఆజ్ఞ అట్లుండఁగాఁ బెద్దల సమ్ముఖమున నేనేమి చెప్పఁగలను ? మీకందఱకేది యుచితమైన దానినిఁ జేయుఁడు.”

ఇది వినఁగానే బ్రహ్మకు శరీరము పులకరించెను. అజ్ఞానమున నున్నవాఁడు త్రోవకు వచ్చినాఁడు. వెంటనే దేవతలకాజ్ఞ యొసంగఁగాఁ బెండ్లి ప్రయత్నము లొనర్చు చుండిరి. ఒక రత్నమండిత విమానముపై నారదుని గూర్చుండఁబెట్టుకొని బ్రహ్మ తన కుమారునకు వివాహ మొనర్ప సృంజయరాజు కడకు బోయెను.

బ్రహ్మ తన పుత్రునకుఁ దన కుమార్తెను వివాహము చేయుటకు వచ్చినాఁడను సంగతినిఁ దెలిసికొని రాజు యొక్క ఆనందమునకు మేఱలేకుండెను. ఆతఁడు బ్రహ్మ

కును, వెంటవచ్చిన దేవతలకును యథోచితముగ నాదర సత్కారములను గావించెను. అనంతరము శుభముహూర్తమున సుందర దివ్యవస్త్రములతోడను, రత్నాభరణముల తోడను నలంకృతయగు దన కుమారితను నారదునకిచ్చి రాజు వివాహమును గావించెను. వివాహము కాఁగానే నారదుఁడా పిల్లను వెంటఁబెట్టుకొని వచ్చుచుండఁగా సృంజయ మహారాజు కన్యకను గాంచి ఉచ్చ స్వరమున నేడ్వనారంభించెను. ఆతఁడిట్లనెను :- "అమ్మా నీవు నా గృహమును శూన్యమొనర్చి పోవుచున్నావు. నీవు లేకున్న నాయీ గృహము బాగుండదు. నేను వనమునకుఁబోయి తపస్సుద్వారా శరీరమును శుష్కింపజేసి త్యజించెదను." తండ్రియొక్క యీ ప్రేమభరితవాక్యములను విని కన్యక పెద్దగా నేడ్చెను. మాటిమాటికిని ఆమె తండ్రినిఁ గౌఁగిలించుకొనెను. ఏదోవిధముగ రాజదంపతులు పిల్లను బంపివైచిరి. ఆతఁడు పుత్రునకు రాజ్యము నొసంగి తపంబునకు వనమునకుఁబోయెను.

ఇచ్చట నారదుఁడు బ్రహ్మలోకమునకు వచ్చి తన నూతన పత్నితో నానంద విహార మొనర్చుచుండెను. కొంత కాలమాతనికి మిక్కిలి ఆనందముగనుండెను. ఎప్పుడు ప్రొద్దుపోడుచుచున్నదో, ఎప్పుడు తెల్లవారుచున్నదో తెలియకుండెను. కాని కొన్నిదినముల కాతని మనస్సు ద్వివిధముగ

నయ్యెను. తీపి తినుట కలవాటుపడినవాని కెంతటి తీపిని బెట్టినను దృప్తియుండదు. సదా మధురమునే అనుభవింపఁ గోరును. కాని తీపి తిను నలవాటు లేనివానికి వాని చిత్తము కొంచెము తీపి తినఁగానే విసుగు జనించును. దాని మీఁదనుండి మనస్సు పోవును. కావున నారదునకుఁ గొన్ని దినములకు రాజకుమారియందు విరక్తి కలిగెను. ఒకనాఁ డాతఁడు బ్రహ్మలోకమునఁ గల నొక వటవృక్షము క్రిందకుఁ బోయి అచ్చట తపమొనరింప నారంభించెను. ఇంతలోనే అచ్చటికి దిగంబరులగు సనక, సనందన, సనత్కుమార, సనాతనులను మహర్షులు వచ్చుచుండుటను గాంచెను. వారు పంచ శరద్వయస్కులైయుండిరి. ముఖమండలము తేజస్సుచే వెలుఁగుచుండెను. నల్గురును దిగంబరులే. బంగారువన్నెగల జడలు ముఖమండలమున విడివడఁబడి యుండెను. తన నల్గురు సోదరులను గాంచఁగనే నారదుఁడు లేచి నిలుచుండెను. వారికి సాష్టాంగ ప్రణామమును గావించెను.



నారదుఁ డేకాంత వనమునకు వచ్చినను ఆతఁడా రాజకుమారినే చింతించుచునే యుండెను. ఆతని మనోగత భావమును గ్రహించి, వారిలో సనత్కుమారుఁ డిట్లనెను :-

"నారదా! ఇదేమిటయ్యా! కృష్ణచింతనమును వీడి కామినీచింతన మొనర్చుచున్నావా? ఛీ! ఛీ! ఇది చాల

లజ్జాకరమగు విషయము. ఈ స్త్రీ ప్రేమ ఒక అగ్నివంటిది. దీని నార్చుటకెన్ని ప్రయత్నము లొనర్చినను ఆరనిది. దూరముగ బోదలంచినచో నామె యేడ్చి, చింతతోనుండును. అప్పుడా విరహాగ్ని, కామాగ్ని ప్రజ్వలించుచునే యుండును. ఈ స్త్రీ జ్ఞానమార్గమును నాశన మొనర్చుట కొక సాధనము. త్యాగమార్గపథికుడు బుద్ధిపూర్వకముగ నీబంధనమున బడగూడదు. స్త్రీ సంగ మొనర్చు వాడవశ్యము స్త్రీగర్భమున బడితీరవలసినదే. కృష్ణచింతనమును వదలి స్త్రీవలలో నెవడు పడునో, ఆతడు మాయలోబడినాడనుకొనవలయును. అల్పమగు పొరపాటుచే నీవు గంధర్వుడవయ్యును దాసీపుత్రుడివైతివి. ఇప్పుడు మరల నామాయలోనే పడిపోయితివి.

ఏడ్చుచు నారదుడిట్లనెను :- "నేనేమి చేయవలయునో మీరేదైన నుపాయమును జెప్పుడు."

సనత్కుమారుడు కసరి యిట్లనెను:- "నీకు ఉపాయమంతయును దెలియును. నీవు తపస్సును జేయుటకు భారతవర్షమునకు బొమ్ము. ఈ మాయావతి ప్రియను వదలిపెట్టుము. గంధమాదన పర్వతముమీదనుండిన బదరీవనమున నరనారాయణులు తపస్సుచేయుచుందురు. అచ్చటికి పోయి యుండుము. నేను నీకు పరమ రహస్యమయమగు ద్వ్యక్షరీకృష్ణమంత్రము నొసంగెదను. ఇది సమస్త

శాస్త్రముల సారము. పరమగోపనీయమును, నతి రహస్య మయమగు మంత్రమిది. నిరంతరము దీనిని జపించు చుండుము. ఏకాగ్రచిత్తుఁడవై స్వరసహితముగ జపించుము.

కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ
కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ
కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ
కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ

ఈ రెండక్షరముల మంత్రమును జపించుము. మనస్సుతోనైనను జపించుము. లేక తాళస్వర సహితముగఁ గీర్తింపుము. ఎట్లు చేసినను దీనివలన నీకు కల్యాణము కలదు.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఇది వినఁగానే నారదుఁడు నల్గురు మునులకును సాష్టాంగనమస్కార మొనరించెను. వారాతని నాశీర్వదించి గోలోకమునకు భగవానుని దర్శనమొనర్చుటకు వెడలిరి. ఇచ్చట నారదుఁడు పరమ రహస్యమయమగు నీద్వ్యక్షరీ కృష్ణమంత్రమునుబొంది యీ భారతవర్షమునకు వచ్చెను. ఇచ్చటికి వచ్చి, ఆతఁడు కృతమాల నదీతటమున నొక మందిరములోనికిఁ బోయెను. అచ్చట నాతనికి శంకరుఁడు దర్శనమొసంగెను.

నారదునిఁగాంచి బోళాశంకరుఁడు పకపక నవ్వెను. ఆతని గాఁగిలించుకొని యిట్లనెను :-"ఆహాహా! నారదా! నీదర్శనమైనది. ధన్యమైనది. ప్రపంచమున వైష్ణవ దర్శనమగుట పరమ పుణ్యఫలము. వైష్ణవ దర్శనమైనచో సర్వమును లభించినట్లే, నీకు సనత్కుమారుఁడు పరమ రహస్యమయమగు మంత్రము నొసంగినట్లు నాకు దెలిసినది. ఈమంత్రమును నాకు గోలోకమున రాస సమయమున సాక్షాత్ శ్రీకృష్ణుఁడే యిచ్చియున్నాఁడు. నేను దీనిని నా పుత్రుఁడగు గణేశునకును, కార్తికేయునకును నొసంగితిని. బ్రహ్మకును భగవానుఁ డీ మంత్రమునే యొసంగెను. బ్రహ్మదాసిని ధర్మున కొసంగెను. ధర్ముఁడు తనపుత్రుఁడగు నారాయణున కొసంగెను. బ్రహ్మ సనత్కుమారునకును నొసంగెను. ఆతఁడు నీ కొసంగినాఁడు. ఇప్పుడు నీవు మిక్కిలి ఆనందముతో బదరీవనమునకుఁబోయి, యీమంత్రమును జపింపుము. శ్రీకృష్ణుని మనోహరమూర్తిని ధ్యానమొనరింపుము."

మహాదేవుఁ డిట్లనెను :-"ఓయీ! అన్యదేవతల ధ్యానము చాలకఠినము కాని కృష్ణధ్యానము చాల సరళముగ నుండును. ఒకచోట ననేకులు కూర్చుండిన నందులో నందఱికంటె సుందరుఁడును, నవ్వుముఖము కలవాఁడును, అందఱికంటెఁ జంచలుఁడును, బాగుగా నలంకరించుకొనిన

వాఁడును, అందఱికంటె నధిక సంగీతప్రియుఁడునైన వారి యెడల నందఱకును సహజముగు నాకర్షణము కలుగును. వారు నరుఁడు కానిండు నారీ కానిండు అట్టి వారాకర్షించె దరు. అందువలనఁ గృష్ణోపాసనను అందఱును సమానముగఁ జేయుచుందురు. ఆతనిలో సౌందర్యము, హాస్యము, చంచలత్వము, మండన ప్రియత, సంగీత ప్రియత, మనోమోహకత అనునీగుణములన్నిటికంటె నధికోత్కృష్టములు. నీవు శ్రీకృష్ణు నిట్లు ధ్యానమొనరింపవలయును — ఆతఁడు నూతన జలధర మేఘమువలె శ్యామముగ నుండును. నిత్య కిశోరావస్థలో నుండును. ఆతఁడతి సుందరమును, నులిపిరి కను, బంగారుసరిగెతోడనుండు పచ్చని పట్టుపీతాంబరమును ధరించియుండును. ఆతని ముఖకాంతి ముందు శరచ్చంద్రుని కాంతియును దిగదుడుపగును. ఆతని అంగప్రత్యంగములు భూషణములచే విభూషితమైయుండును. ఆతని సర్వాంగము లందును శ్రీచందన మలఁదఁబడియుండును. వక్షః స్థలమునఁ గౌస్తుభమణి క్రీడించుచుండును. శిరస్సున నెమిలి పింఛముండును. కంఠమందు దివ్యమణిహారములును, అమ్లాన సుగంధిత పుష్పమాలలను ధరించుచుండును. అతని ముఖమండలమున మందహాసమొలుకు చుండును. నేనును బ్రహ్మాది దేవతలును నాతని నుపాసించుచుందుము. ఆతఁడు మిక్కిలి ఇష్టముతో ధ్యానములోనికి వచ్చును. ఆతఁడు నిర్గుణుఁడు.

ప్రకృతికిఁబరుఁడు. పరమాత్మ. ఆతఁడు నిరంతరము భక్తులపై ననుగ్రహ వర్షమును గురిపించుచుండును. నీవాత్మఁ ధ్యానింపుము.''

ఇది విని నారదుఁడు మిక్కిలి ప్రసన్నుఁడయ్యెను. బదరీవనమునకుఁబోయి తపస్సును జేయుచుండెను. ''కృష్ణ'' మహామంత్రమును నిరంతరము జపించుచుఁ గీర్తించుచుండును. భగవానుఁడవతరించి నాఁడను సంగతినిఁ దెలిసికొనిన తరువాత నాతఁడు వ్రజము చుట్టును దిరుగుచుండెను. ద్వారకలో నున్నాఁడని తెలిసికొని యిప్పుడు ద్వారక చుట్టును దిరుగుచుండెను. ద్వారకకుబోయి మరల దిరిగిపోవుచుండును. మరల వియోగమును భరించలేక మరల మరల నేదియో నిమిత్తమును బెట్టుకొని వచ్చుచుండును. ఈసారి భగవానుఁడు తనభార్యల నెట్లు సంతోషపెట్టుచున్నాఁడో చూడవలయునని వచ్చెను. ఎనిమిది మంది పట్టపురాణులే కలరు. పైగా నరకాసురునిఁజంపి పదునాఱు వేలమందినిఁ దెచ్చియుండెను. ఇప్పుడిందఱితో నెట్లున్నాఁడో చూడవలయును. ఆతని గృహచర్యయెట్లుండునో? ఆతఁడు పదునాఱు వేల మందితో వారివారి గృహములందొక్కసారిగా వివాహమాడెనని వినియున్నాము. ఇప్పుడు వారందఱితో నెట్లు వర్తించుచున్నాఁడో.'' అని యాలోచించు కొనుచు ద్వారకకు వచ్చెను. ఇప్పుడాతఁడు వీణను మీటలేదు. రుక్మిణీ

గృహామునకుం బోలేదు. ద్వారకానగరమును బ్రవేశింపం గనో అతని ఘ్రాణేంద్రియమునకు దివ్యసుగంధము తగిలెను. ఇట్టి దివ్యసుగంధము స్వర్గమందును దుర్లభమే. అచ్చట నారదుండు దివ్యసుగంధము వెదజల్లు సుందర పుష్ప వృక్షము లసంఖ్యాకములుగ నుండెను. చాలచెట్లు ఫలభార భరితములైన నమ్రములై యుండెను. కొన్ని వృక్షములకు మొగ్గలు వైచియుండెను. కొన్ని మొగ్గలు వికసించెను. వానిపై వివిధ వర్ణములు, వివిధ కూజితములు చేయు విహంగములు కలకలారవము లొనర్చుచుండెను. అవి దశదిశలను బ్రతిధ్వనింపం జేయుచుండెను. మధులోభ ముచే మధుకరములు పుష్పముల మీందఁ గుంజారవ మొన ర్చుచుం దిరుగుచుండెను. అచ్చటచ్చట చిన్న చిన్న కమలా కరములు కలవు. వానిలో వివిధ వర్ణములుకల కమలములు వికసించియుండెను. ఇందీవర, అంభోజ, కల్హార, కుముద, ఉత్పలాద్యనేక పుష్పములు ప్రఫుల్లితములై యుండెను. హంస, సారస, జలకుక్కుటాది జలవిహంగములు విహరించుచుండెను. వానిలో రంగుల రంగుల మత్స్యములు తిరుగుచుండెను. ద్వారకాపురియందు దగ్గఱ దగ్గఱగాం దొమ్మిది లక్షల అంతఃపురము లుండెను. అవన్నియును సువర్ణముతోం గట్టంబడి యుండెను. వానిగోడలకు రత్న ములు కూర్పంబడి యుండెను. ఉజ్జ్వల మణులచే నవి ప్రకా

శించు చుండెను. కొన్ని భవనములు వెండితోఁ గట్టఁబడి యుండెను. అవన్నియును క్రమబద్ధముగ నాకేరకముగ నుండెను. అన్నిటి యందును నుద్యానవనము లుండెను, మధ్య మధ్య పెద్ద పెద్ద వీధులుండెను. దూరదూరమునఁ జౌకులుండెను. అచ్చటి సందులు గొందులును నిరుకుగ లేవు. అవియును స్వచ్ఛముగ నుండెను. సుగంధ జలములచే నవి చల్లఁబడియుండెను. దూరదూరమున విశ్రామ గృహము లును, సార్వజనిక ఉద్యానవనములును, సభాభవనములును, విహారస్థానములును నుండెను. దేవాలయము లందలి మెగుచు చుండినఁ బెద్ద పెద్ద ధ్వజములు శ్రీకృష్ణుని యశమును వాయుమండలమునఁ బ్రసార మొనరించుచుండెను. ఆ విశాల నగరమునందు సర్వప్రథమముగఁ బదునాఱు వేల నూఱు భవనము లొకేవిధముగఁ గట్టఁబడి యుండెను. అన్నిటి యందును భగవానునిపత్నులు నివసించుచుండిరి. ఆగృహము లన్నియును సమస్తసుఖ సమృద్ధితో నుండును. వానిని నిర్మించు టకై విశ్వకర్మ తన నైపుణ్యమునంతను జూపించెను. అంత కంటె సుందర భవనముల నాతఁడెచ్చటను నిర్మించియుండ లేదు. ఇవన్నియును భగవానుని పత్నుల భవనములని నారదునకుఁ దెలియును. వాని అన్నిటిమీఁదను క్రమసంఖ్య వేయఁబడి యుండెను. నారదుఁడు మొదలఁ మొదటిసంఖ్య గల గృహములోనికిఁ బోయెను. నారదుఁడు నూటిగాలోపల

ప్రవేశించెను. ఇదివఱలో వీణవాయించుకొనుచువచ్చి, భోజనముచేసి వెడలిపోయెడువాఁడు. నేఁడాతఁడు పరీక్షకొఱకై వచ్చియుండెను. అందువలన నాతఁడు సమస్త విషయములను బరీక్షించుచుఁ బోవుచుండెను. ఆతఁడు నలువైపులను దృష్టిని సారింపఁగా భవనమందలి స్తంభములన్నియును మెఱయుచుఁ జంద్రశిలలచే నిర్మింపఁబడెను. అన్నియును వైడూర్యములచేఁ గట్టఁబడియుండెను. గోడలలో నింద్ర నీలమణులు పొదుగఁబడెను. వాని కాంతి యెన్నటికినిఁ జెడదు. క్రింద భూమియును నింద్ర నీలమణులతో నేర్పఱుపఁ బడెను అచ్చటి మంచములును, ఆసనములును, పీఠములును నేనుఁగు దంతములతో, నగిషీపని చేయఁబడినవై యుండెను. అంతయును గళామయములై యుండెను. అచ్చటచ్చట ముత్యాలసరములు వ్రేలాడుచుండెను. చాందినీ సుందరముగను, స్వచ్ఛముగను, విమలముగనుండెను. ఎంతటి నునుపుగా నున్నదనఁగా వానిపై ఈఁగ వ్రాలినచో జాఱిపోవును. ఎంత వెదికినను గసవుగాని, ధూళిగాని అచ్చట కనఁబడదు. అచ్చటి దాసదాసీజనము సుందరులు, సుశీలురు. స్వచ్ఛమును నిర్మలములునగు వస్త్రములను ధరించిరి. అందఱ కర్ణములందును మణిమయ కనకకుండలములు శోభించుచుండెను. వారు రంగుల రంగుల చీరెలను గట్టుకొని అటునిటుఁ దిరుగుచుండ ననేక రూపములను ధరించి సౌందర్య

భవనమునందు దిరుగాడు చున్నట్లుండెను. ఆ భవనమున ఘృతదీపములుగాని, తైలదీపములుగాని వెలుఁగుట లేదు. రత్న, మణిదీపములు వెలుఁగుచు నాభవనములను బట్టపగలు వలెఁ బ్రకాశింపఁ జేయుచుండెను. ఆ ప్రకాశమునఁ జిన్న చిన్న సూదులైనను గనఁబడును. అచ్చటచ్చట కర్పూరా గురు ధూపములు వేయఁబడి యుండెను. ఆ ధూపము గుండ్రముగ నుంగరములు తిరుగుచుఁ బై కెగురుచుండఁ గపోతము లాకాశమున కెగురుచున్నట్లుండెను. ఆధూపములు గవాక్షముల గుండా బయటకు వచ్చి పైకి బోవుచుండ మయూరములు దానిని మేఘముగ భావించి నృత్యము చేయుచుండెను. అవి యెంతో ఆనందముగఁ గూయుచుండెను. నెమిళ్ళు పురులను విప్పి నృత్యము చేయుచెంతో ఆనందమును గొలుపుచుండెను. ఇట్టి సుందర సుసజ్జిత భవన శోభను గాంచుచు నారఁదుడు దానిలోనికిఁ బ్రవేశించెను. ఆతని ఆశ్చర్యమునకు మేఱలేకుండెను. ఇది రుక్మిణీ భవనము. తానిచ్చటి కెన్నో సార్లు వచ్చి భగవానుని దర్శించి, భోజన మొనర్చి, వీణతోఁ బాడియుండెను. కాని నేఁడాతని కా గృహము నూతనముగ నుండెను.

నారదుఁడిట్లాలోచించుకొనుచు వచ్చుచుండునంతలో మణిప్రకాశమున శ్రీకృష్ణభగవానుఁడు నారదునిఁ గాంచెను. ఆసమయమున సాయంకాలపు టలంకారముల నొనర్చు

కొని మంచముపై గూర్చుండెను. దగ్గరనే ఆతని ప్రాణ ప్రియయగు రుక్మిణి తనకనురూపమగు గుణ, రూప, వయో వేషములుగల పదివేలమంది దాసీలతో నుండెను. స్వయముగ రుక్మిణి బంగారుతోఁ జేయఁబడిన పిడిగల చామరముతో వీచుచుండెను. కొందఱు విడియము లందించు చుండెను. కొందఱు పాదము లొత్తుచుండిరి. కొందఱు తమ్మ నుమియు పాత్రను సవరించుచుండిరి. కొందఱు మాలలను వేయుచుండిరి. ఈ విధముగ నందఱును సేవా సంలగ్నులై యుండిరి.

నారదుని గాంచఁగనే బ్రహ్మణ్య దేవుఁడగు వాసుదేవుడు వెంటనే తన మంచమునుండి దిగి లేచి నిలుచుండెను. ఎదురుగాఁ బరుగిడిపోయి మకుటమండిత మస్తకమును మునిచరణ కమలములందుంచెను. వినయావనతుఁడై శ్రద్ధతోఁ బ్రణామ మొనరించి, ఆతని బ్రేమపూర్వకముగఁ బట్టుకొని వచ్చి తన శయ్యపైఁ గూర్చుండఁబెట్టుకొనెను. అంతఁ జేతులను జోడించుకొని కుశల ప్రశ్నలనడిగెను. భగవాఁనుడు నరనాట్య మొనర్చుచుండెను గదా! అందఱచేఁ బూజింపఁబడు వాఁడును, అందఱచే నాదరింపఁబడు వాఁడును, నేడు నారదునిఁ బూజించుచుండెను ఎవని చరణకమలములనుండి బయలుదేరిన జలము సమస్త భువనములను బావనమొనరించు గంగా నయ్యెనో, అట్టిభగవానుఁడు నేఁడు తన

చేతులతో నారదుని పాదపద్మములను ప్రక్షాళనము గావించి, తన శిరస్సుపైఁ జల్లుకొనెను. ఆతఁడు బ్రహ్మణ్య దేవుఁడను దన జగద్విఖ్యాత నామమును సార్థక మొనర్చు కొనెను.

చరణములను గడిగి శ్రీహరి నారదుని విధ్యుక్త ముగఁ బూజించెను. అంత రెండు చేతులను జోడించుకొని అమృత సదృశములగు మృదుమధుర వాక్కులచే నాతని కర్ణకుహరములను బరిప్లావిత మొనర్చుచు నిట్లనెను :- "ప్రభూ! మీరీ సేవకునిపైఁ గృపఁ జూపితిరి. నేను మీకే సేవను జేయుదును ? నేను జేయవలసిన పనియేమో శల వొసంగుఁడు".

కృష్ణుఁడిట్టి నమ్రతను జూపించునని నారదుఁడు కలలోనైనా ననుకొనలేదు. ఇంతటి ఆదరము నొనర్చునను కొనలేదు. అందువలన నాతఁడు లజ్జితుఁడై యిట్లనెను :- "స్వామీ ! నీవేల యిట్లనవు ? నీవనన్యాశ్రిత భక్తుల యెడలఁ బ్రేమను ప్రదర్శించుటయును, వారిని సంరక్షించుట యును, దుష్టుల నణచుటయును ఇవి నీకు సహజ స్వభావ ములు. నీకు బ్రాహ్మణ్యదేవుఁడను పేరుకలదు. అందువలన మావంటి నామధారక విప్రులను గూడ యెంతో ఆదరించు చుండెదవు. నీవీచరాచర ప్రపంచమున కేకైకాధిపతివి. నీవు విశ్వంభరుఁడవు. అజుఁడవు. అవ్యక్తుఁడవు. నిర్గుణుఁడవు.

నిరాకారుఁడవు. కేవలము భక్తులను రక్షించుట కొఱకును వారిమీఁదఁగల అనుకంపచేతను, జగత్తుయొక్క స్థితి, రక్షణ, కల్యాణార్థము నిరాకారుఁడవయ్యు సాకారుఁడవైతివి. అజుఁడవయ్యు జన్మించితివి. నీవే కర్మబంధమునను నవనిపై నవతరింపలేదు. నీవు స్వేచ్ఛచే నీశరీరమును ధరించితివి. నీ జ్ఞానమగాధమైనది. బ్రహ్మాది దేవతలును వారి హృదయములలో నిరంతరము నిన్నుఁ జింతించుచుందురు. భవకూపమునఁబడిన ప్రాణుల కేకైక అవలంబనము నీవే. సంసార సాగరమును దాటుటకై మీయీ పునీత పాదపద్మములే నౌక. నేడు నాకా అమలచరణకమలముల సాక్షాద్దర్శనమైనది. కావున నాకంటె భాగ్యశాలి యింకెవఁ డుండగలడు? మీరు నన్ననుగ్రహింపవలయును. ఈ చరణకమలములు సదా నామన మందిరమందు వసించు నట్లును, నెన్నడును నేను మఱవకుండునట్లును ననుగ్రహింప వలయును. మీచరణములను హృదయమునధరించి, చతర్దశ భువనములందును నిర్భయుఁడనై తిరుగుదును.''

భగవానుఁడిట్లనెను :- ''నారదా! నీవు చాల దినములకు వచ్చినావు. నీవు మమ్ముమఱచియే పోయినట్లున్నది. నీ పాటలే వినిపింపలేదు''.

నారదుఁడు వ్యగ్రతతో నిట్లనెను :-''స్వామీ! నేఁడు నా వీణాతంత్రులు కొంచెముగ వదులైనవి. నాకీదినము

చాలముఖ్యమగు పనియున్నది. క్షమించుఁడు. నాకాజ్ఞ యిండు. మరలవచ్చి పాడెదను.''

భగవానుఁడు బలవంత మొనర్చుచు నిట్లనెను :- ''అదేమి నారదా! పాట పాడకుండినను, గొంచెము భోజనము చేసి పొమ్ము.''

నారదుఁ డిట్లనెను :-''ప్రభూ! నాకాఁకలి లేదు. వరుణునికడ భోజనము చేసి యిప్పుడే వచ్చుచున్నాను.''

భగవానుఁడు బలవంత మొనర్చుచు నిట్లనెను :- అట్లుకాదు. మీరువచ్చి యెంగిలి చేయకుండ పోయిన నది చాల దోషము. అంత రుక్మిణితో నిట్లనెను :-చూచెదవేమి? శీఘ్రముగ నన్నమును దీసికొనిరమ్ము.''

ఇది విని రుక్మిణి త్వరగాఁ బోయెను. ఫలాహారము నైనఁ జేయుఁడని లోపలినుండి లడ్డు, వేడి వేడి జిలేబి, మీగడ, చక్కెర కలిపిన పాలను దీసికొనివచ్చెను. ఇప్పుడు నారదుఁడేమి చేయఁగలఁడు? మధుర పదార్థమును జూడఁ గనే యిష్టము లేకున్నను బ్రహ్మకైనను కోరిక జనించును. తినకుండ నుండఁజాలడు.'' రుక్మిణి నెట్లు కాదనఁగలఁడు. అన్నిటి నెగురవైచెను. అంత చేతులను గడిగికొని పుక్కిలించి వీణను దీసికొని ''స్వామీ! ఆజ్ఞయేనా?'అని పలికి వెంటనే వెడలి పోయెను. భగవానుఁడాతని మనోగత భావములను గనిపెట్టెను. అందువలన నాతఁడేమియు నన

లేదు. నారదుఁడు వెంటనే యింకొక యింటికిఁ బోయెను.

సూతుఁడిట్లనెను :-"మునులారా! ఇప్పుడు రెండవ యింటిలో నారదుఁడేమి చూచినదియు వర్ణించెదను."

## నారదుఁడు కృష్ణుని గృహచర్యను దర్శించుట.

శ్లో. దృష్టం తవాంఘ్రి యుగళం జనతాపవర్గమ్
బ్రహ్మాదిభి ర్హృది విచింత్య మగాధబోధైః
సంసారకూపపతితో త్తరణావలంబమ్
ధ్యాయంశ్చరామ్యనుగ్రహేణ యథాస్మృతిఃస్యాత్.

శ్రీభాగ. ౧౦స్కం ౬౯అ. ౧౮శ్లో.

తే. అబ్జసంభవ హర దేవతార్చనీయ
భూరి సంసార సాగరోత్తారణంబు
నవ్యయానంద మోక్షదాయకము నైన
నీ పదధ్యాన మాత్మలో నిలువ నీవె.

శ్రీమదాంధ్ర భాగవతము.

భగవానుఁడు భక్తుల కోరికలను నెఱవేర్చుటకై సమస్తమును జేయుట కుద్యుక్తుఁడగును. ఏ యాటను జూపింపఁదలఁచిన నట్టి రూపమును ధరించును. తండ్రి పిల్లల నాడించుటకు వివిధములగు నాటవస్తువులను దెచ్చును. వారి నానందింపఁజేయుటకై స్వయముగ నా యాటవస్తువులతోఁ దానును నాడును. తండ్రిని పార్థివ పదార్థములతోఁ జేయఁబడిన నిర్జీవ వస్తువులేమి సంతోషపెట్టఁగలవు? కాని తండ్రి యానందము ఆటవస్తువులలో లేదు. అతఁడు పుత్రుఁడు

ప్రసన్నుఁడగుటనుగాంచి ప్రసన్నుఁడగును. పుత్రుని యానందము కొఱకే ఆతఁడాటవస్తువులతో నాడునది. అదేవిధముగ భగవానుఁడును నరనాట్య మొనర్చును. ఆతఁడు తన భక్తుల నానంద పరుచుటకై అట్లు చేయును. ఆతనికి భోగేచ్ఛ యేమియును లేదు. ఆతఁడాత్మా రాముఁడు, ఆత్మక్రీడ, ఆత్మ రతియొనర్చును.

సూతుఁడిట్లనెను :–"మునులారా! నారదుఁడు రుక్మిణీ యింటినుండి భగవానుని యోగమాయను గాంచుటకై మెదలకుండ రెండవయింటికిఁ బోయెను. అచ్చటను భగవానుఁడుండెను. తన భార్యతోఁ బాచికలాడుచుండెను. చాల తెలివిగఁ బాచికలను విసురుచుండెను. తానుపందెమును గెలిచి నపుడు భగవానుఁడు పకపక నవ్వుచుండెను. తన ప్రియురాలి వీపు దట్టుచు నేను గెలిచితినా లేదా యనుచుండెను. ఆమె యిట్లనెను :–"ఇప్పుడే ఉబ్బిపోకుఁడు. ముందున్నదిగదా?" కొన్ని పందెములలో జగడము చెల రేగుచుండెను. ఇది నా పందెమనిన నాపందెమను కొనుచుండిరి. అప్పుడుద్ధవుఁడు తీర్పరిగా వచ్చుచుండును. ఉద్ధవుడూరక కూర్చుండి చూచుండును. ఇట్లాడుచుండగాఁ గాలి చప్పుడయ్యెను. ఇప్పుడు పావులను, వస్త్రము నావల బాఱవైచి కృష్ణుఁడు లేచి నిలుచుండెను. భార్య సిగ్గుచే మేలిముసుఁగు వైచుకొని లోపలికిఁ బోయెను. భగవానుఁడు

నారదునకు స్వాగత సత్కారమొనర్చి, తెలియని వానివలె నిట్లనెను :-"మీరెప్పుడు వచ్చితిరి ? చాల దినములకు వచ్చినారే. ఎక్కడకీ దీర్ఘ ప్రయాణము."

ఇది విని నారదుఁడు గొప్ప మాయలోఁబడిపోయెను, అతఁడిట్లనుకొనెను :- "ఇప్పుడే వేడి జిలేబి పెట్టినాఁడే ! మరల నడుగుచున్నాఁడే యెప్పుడు వచ్చితివని ?"

నారదుఁడు మాటలాడకుండుటను గాంచి యిట్లనెను:- మేము గృహస్థ బంధనములోఁ బడిపోయితిమి. దీనివలన మహాత్ముల దర్శనము దుర్లభమైనది. మాబోఁటి సకామ గృహస్థులకు తమబోఁటి అప్తకామ మహాత్ముల దర్శనమెట్లు లభింపఁగలదు. మా కేదైన సేవయుండిన శలవొసంగుఁడు, మీ సేవవలననే మా జీవితము సఫలము కాఁగలదు."

నారదుఁడిట్లనెను :- "స్వామీ ! నేను మీదర్శనమునకు వచ్చితిని. మీరిట్టిమాటలు మాటలాడుచున్నారేల ?"

భగవానుఁడు తొందఱగ నిట్లనెను :- "ఈ మాటల నన్నిటిని తరువాత మాటలాడుకొందము. మీరు భోజనము విషయమును జెప్పుడు."

నారదుఁడిట్లనెను :- "స్వామీ ! నే నిప్పుడే భోజనమును జేసివచ్చితిని."

భగవానుఁడు దీనతాస్వరమున నిట్లనెను:-"నారదా! అట్లుకాదు. గృహస్థుల యింటికివచ్చి మీరు భోజనము

చేయకపోయినచో మాకు చాల అన్యాయమే. మథురనుండి మంచి పాలకోవా వచ్చినది. నీ శిష్యురాలు సత్యభామ రసగుల్లాలు బాగుగాఁ జేసినది. కొంచెముగఁ దినుఁడు.''

నారదుఁడు వలదనుచునే యుండెను. ఇంతలో సత్యభామ పళ్ళెరములోఁ బెట్టుకొని వానినిఁ దెచ్చెను. నారదుఁడు వలదనుచున్నను, నది భగవానుని దగ్గఱ నేమి సాగును ? ఒక్కొక్కటిగ నన్నిటినిఁ దినిపించెను. నారదుఁ డిట్లనుకొనెను :- ''ఇది చాల చిక్కే. ఇట్లు పదునాఱువేల యిండ్లలో జరిగినచో జయజయ సీతారామ కావలసినదే. రహస్యముగ భగవానుని లీలలను జూడవలయునని ఆతఁడు నిశ్చయించుకొనెను. ఆతనికిఁ గనఁబడినచోఁ దిననిది వదలిపెట్టఁడు.'' అని నిశ్చయించుకొని సూక్ష్మరూపమున భగవానుని ప్రతి యింటికిని బోయి భగవల్లీలను గాంచుచుండెను.

ఒకచోట భగవానుఁడు చిన్న చిన్న పిల్లలను వడిలోనికిఁ దీసికొని అన్నమును బెట్టుచుండెను. ఇంకొకని చేతిలో నప్పచ్చి పెట్టి, గారెలు పెట్టు అని చక్కిలగింతలు పెట్టుచుండెను. కొందఱను ప్రేమతోఁ జఱచుచుండెను. కొందఱను ముద్దుపెట్టుకొనుచుండెను. కొందఱ ముక్కుబట్టుకొని యూపుచుండెను. ఒక్కొక్కనికి శిరస్సునఁ జిటికెలు వేయుచుండెను. ఒక్కొక్కని వ్రేలినిఁబట్టుకొని తప్పటడుగులను వేయించుచుండెను. ఒక్కనిచే బొంగరమును ద్రిప్పించుచుండెను.

ఒక్కనిని జిచ్చితో నిద్రపుచ్చుచుండెను. నారదునిఆశ్చర్యము నకు మేరలేకుండెను. ఆతని కౌతూహలము పెరుగు చుండెను

అంత నాతఁడు తర్వాత యింటికిఁ బోయెను. అచ్చట భగవానుఁడు నీటితో స్నానమాడుటకు నిలుచుండెను. ధోవతిని, ఉత్తరీయమును బట్టుకొని ఆతని భార్యనిలుచుండి యుండెను. నారదుని పాదుకల చప్పుడును విని కృష్ణుఁడులికి పడెను. భగవానుఁడు తన్నుఁజూచెనేమో యనుకొనెను. అందువలన వెంటనే ఆతఁడు నెమ్మదిగ బయటకుఁబోయి యింకొక యింటికిఁ బోయెను.

ఆ యింటిలో నొక పెద్ద యజ్ఞము జరుగుచుండెను. చాలమంది బ్రాహ్మణులు వేదమంత్రములను జదువుచుండిరి. తన భార్య కొంగునకు నుత్తరీయపుకొంగును ముడివైచుకొని చేతులు జోడించుకొని నిలుచుండెను. యింకొక యింటికి పోఁగా దేవపూజకై వస్తువులను బ్రోవుచేయుచుండిరి. రంగు రంగుల పూల రాసు లచ్చట నుండెను. నానావిధములగు నైవేద్యములు, ఫలపుష్పాదులచ్చట నుంచఁబడెను. ఆసన, గంధాక్షత, ధూప, దీపాది వస్తువులు యథాస్థానమున నుంచఁబడెను.

ఆ తరువాత గృహమునకుఁబోఁగా భగవానుఁడచ్చట బ్రాహ్మణులకు స్వయముగ భోజనమును వడ్డించుచుండెను.

వారిని బలవంతము పెట్టి తినిపించుచుండెను. స్వామీ! ఈ పూరీ మృదువుగనున్నది, వేడిగనున్నది. ఇంకొక్కటి తినుఁడు కొంచెముగ హల్వాతినుఁడు; క్షీరాన్నమును మీరు త్రాగనే లేదు. అట్లు బాగుండదు క్షీరాన్నమును బూర్తిగఁ ద్రాగ వలసినదే. కొంచెముగఁ బచ్చడినిఁ జప్పరింపుఁడు. లడ్డులను దిని తీరవలసినదే. చివరకు గొంచెముగఁ జారుఁ త్రాగిన నాహారము జీర్ణము కాఁగలదు. శొంఠివేసిన మజ్జిగను ద్రాగుఁడు. చాల బాగుండును. ఒక ముసలి బ్రాహ్మణునితో "స్వామీ! మీకు పండ్లు లేవు కావున హల్వా తినుఁడు అను చుండెను. ఒక యువక బ్రాహ్మణునితో మీరును ముసలి వారివలెఁ దినుట బాగుండలేదు. మోదకములను వేయింతునా?" అనుచుండెను. నారదుఁడు దీనినిఁ గాంచి వెను దిరిగి పోబోఁవ నంతలో భగవానుఁడువచ్చి ప్రణామమును గావించి యిట్లనెను :- "రండు, రండు, నారదా! మీరు సమయమునకు వచ్చినారు. స్వర్గముననుండగనే మీకు బ్రాహ్మణభోజన సుగంధము వచ్చినదా యేమి?

గాబరాపడి నారదుఁ డిట్లనెను :- "లేదు స్వామీ! నేను భోజనము చేయుదునుగాని యిప్పటికే కంఠము వఱకు నిండిపోయినది."

నవ్వి భగవానుఁ డిట్లనెను :- "మీరట్లే యనుచుందురు. బ్రాహ్మణుఁడు భోజనము విషయముననుు, మగపిల్ల

వాఁడును, ఆడపిల్లయును పెండ్లి సంగతి యెత్తిన పైకి వలదు వలదనుచుందురు. కాని తెలిసికొనఁగలవారు ఆ వలదువల దను దాని అర్థమును గ్రహింపఁగలరు."

నారదుఁడిట్లనెను:- "కాదు స్వామీ! నేను నిజముగనే చెప్పుచున్నాను. ఏమాత్రము కోరిక లేదు."

భగవానుఁ డిట్లనెను :- "మొదట అంతగాఁ కోరిక ఉండదు వస్తువు ఎదుటకు రాఁగానే కోరిక జనించును. విస్తరి ముందు కూర్చొండి వడ్డించిన పదార్థములను జూడఁగనే యిచ్ఛ జనించును" నారదుఁడు వలదనుచుండెను. కాని మదనగోపాలుఁడు మాననిచ్చునా? చేయి పట్టుకొని తీసికొనిపోయి బ్రాహ్మణులమధ్య కూర్చుండఁబెట్టెను. ఆతనికి వెంటనే వడ్డింపఁబడెను. నారదుఁడు వివశత స్వరమున నిట్లనెను:-"స్వామీ! పొట్టపగిలిపోఁగలదు."

నవ్వుచు భగవానుఁ డిట్లనెను:- "మీకు ఆ తాపి వాతీపి శ్లోకము జ్ఞాపకము లేదా యేమి?

నారదుఁడు విసుగుతో నిట్లనెను:-"నాకుస్మరణశక్తి అంతయును కుంఠితమైనది."

భగవానుఁ డిట్లనెను :- "మంత్రమును నేను జదివెదను. మీకు పొట్టమీఁదఁ జేతితో నిమురుఁడు."

శ్లో॥ ఆతాపీ భక్షితో యేన వాతాపీ చ నిపాతితః।
సముద్రః శోషితో యేన సమేఽగస్త్యః ప్రసీదతు॥

మంత్రములను దలవంచుకొని శ్రద్ధాభక్తులతో వినుచుం
డెను.

సరసతాసరిత ప్రవహించు చున్నదా యను నట్లి
కొకచోట తన భార్యతోఁ బరిహాసములు పలుకు చుండెను
వేఱొకచోట అంతఃపుర సరోవరమున స్త్రీలతో జలక్రీ
లాడు చుండెను. అచ్చట నా స్త్రీలపైఁ దాను నీరు చిలుక
చుండెను. వారు తినపైఁ జిలుకుచుండిరి. ఇంకొకచోట
నాశ్రితులకుఁ బారితోషికములను బంచుచుండెను. మఱి
యొక చోట సైనికులకు బదకములను బంచుచుండెను. ఇం
కొకచోట అన్యదేశముల దూతలతో సంధి విగ్రహములకు
సంబంధించినవి మాటలాడు చుండెను. ఇంకొకచోట నితర
లను గసరుచుండెను.

మఱియొకచోట గృహములలో నేర్పాటులను గావించు
చుండెను. కొన్నిచోట్ల గృహమునకు సంబంధించిన వస్తువు
లను దెచ్చుటకు సేవకుల కాదేశించు చుండెను. ఒక యిం
టిలో గర్భాదాన సంస్కార మొనరించు చుండెను. పండిత
పూజ నొనర్చుట కేర్పాట్లు చేయుచుండెను. ఇంకొకచోట
నేడవ నెల గర్భిణికిఁ బుంసవన మేర్పాటు చేయుచుండెను.
అత్తవారింటి నుండి వచ్చిన వస్తులను జూచుచుండెను. స్త్రీలు
గీతములను బాడుచుండిరి. మంచి ఉత్సవము జరుగు చుం
డెను, ఇంకొక యింటిలో సీమంతోన్నయన సంస్కారము

జరుగుచుండెను. అచ్చట దానము లొనర్చుచుండెను. ఇంకొక యింటిలోఁ బసిపిల్లవాఁడు పుట్టఁగా నాందిముఖాది శ్రాద్ధములొనర్చి జాతకర్మ సంస్కారమునకుఁ బ్రయత్నము లొనర్చుచుండెను. ఇంకొక యింటిలో నప్పుడే పిల్లవాఁడు పుట్టగా బొడ్డును గోయించు చుండెను. ఇంకొక చోట జననమై పదునొకండవ దినమగుటచే నామకరణ మహోత్సవము జరుగుఁచుండెను. వేఱొక చోట బుత్రునకు బుట్టుఁవెంట్రుకలు దీయించు చుండెను. మఱియొక చోట నన్నప్రాశన జేయించు చుండెను.

నారదుఁడింకొక యింటికి బోఁగా నచ్చట ఉపనయన మండపమున నుపనయన సంస్కారమును గావించు చుండెను. ఆ బ్రహ్మచారి భిక్షనడుగు కొనునపుడు భగవానుఁడు నవ్వుఁ చుండెను. ఇంకొక చోట నాచార్యునిచే వేదాధ్యయన మారంభింపఁ జేయుచుండెను. అగ్నిలో నాహుతులను వేయుటను నేర్పుచుండెను. ఇంకొక చోట కుమారుఁడు స్నాతకుఁడై రాఁగా వానికి సదృశయగు భార్యను వెదుకుచుండెను. ఇంకొక చోటఁ బుత్రుని వివాహ ప్రయత్నము జరుగుచుండెను. పుత్రుని వివాహమునఁ గ్రొత్త పెండ్లికూతురినిఁ జూచుఁ నుత్సవము జరుగుచుండెను. అచ్చట కృష్ణుఁడు అందఱను బరామర్శించు చుండెను. ఇంకొక చోట గూతురి వివాహ ప్రయత్న మొనర్చుచుండెను. పెండ్లి ప్రయత్నములు చేయు

చుండెను. ఇంకొకచోట కన్యాదాన మొనర్చుచుండెను. మఱియొకచోట నాఁడుపిల్ల నత్తవారింటికి బంపుచుండెను. ఆ పిల్లతండ్రి యగు భగవానునిఁ గౌగలించుకొని యేడ్చుచుండెను. ఆమె నోదార్చుచుఁ దన ప్రేమాశ్రులచే నామె శిరస్సును దడుపుచు నిట్లను చుండెను :-"అమ్మా! ఏడువకమ్మా! నిన్ను ద్వరలోనే తీసికొని వచ్చెదనులే" పిల్లకు సారెలను బంపు చుండెను.

ఒకచోట కృష్ణుని జన్మోత్సవము జరుగు చుండెను. జన్మ నక్షత్రమునకు దాన పుణ్యాదు లొనర్చుఁ చుండెను. ఇంకొకచోట నేదియో పండుగను జేసికొనుచుండిరి. ఇంకొకచోట మహామహోత్సవములు జరుగు చుండెను వేఱొకచోట్లలో ధర్మశాలలను, విద్యాశాలలను, ఔషధశాలలను గట్టించు చుండెను. వేఱొకచోట విద్యార్థులకు వృత్తి నేర్పఱచు చుండెను. ఇంకొకచోట నధ్యాపకుల కిష్టవృత్తి నేర్పఱచు చుండెను. కొందఱు లేఖకులు వ్రాసిన పుస్తకములను విని వానికి ఉపోద్ఘాతములను, అభిప్రాయమును వ్రాయుచుండెను. ఇంకొకచోట గవితను బ్రశంసిచుచుండెను. వేఱొకచోట నూతన సంస్థలను గృహములను నావిష్కరించు చుండెను. మఱియొకచోట ఋషులను మునులను ధర్మమును గూర్చి ప్రశ్నించు చుండెను. మఱియొక్క చెట్లను నాటుఁడని ఆదేశించు చుండెను. మఠములకును, మందిరములకును

వార్షిక, మాసిక వృత్తుల నొసంగుచుండెను. మంత్రుల కట్లు చెల్లించుడని ఆదేశించుచుండెను.

సూతుడిట్లనెను:- "మునులారా! ఎన్నని చెప్పఁగలను? నారదుఁడెచ్చటికి బోయిన నచ్చటచ్చట భగవానుఁడేదో నూతనకార్యము నొనర్చుటను గాంచుచుండెను. ఎచ్చట కనఁబడినను కృష్ణుఁడు నారదుని ఎప్పుడు వచ్చి'రని అడుగుచుండెను. భోజనము సేయుమని బలవంత మొనర్చుచుండెను. భగవల్లీల కెంతగాఁ జూచినను తృప్తి కలుగుటలేదు. ఈ విధముగ నాతఁడు పదునాఱువేల నూట యెనిమిది యిండ్లకు బోయెను. ఇప్పుడన్నిటిని వర్ణింప నారంభించినచోఁ గథ పెరిగిపోఁగలదు. నే నిప్పుడత్యంత సంక్షేపముగ నాతని గృహాచర్యను గూర్చి వర్ణించితిని. ఇప్పుడు భగవానుఁ డాతనిపై నెట్లు కృపఁ జూపినదియును, నేమి ఉపదేశించినదియును వర్ణించెదను. సావధానులరై శ్రవణ మొనర్పుఁడు."



## భగవత్కృపచే నారదుని ఉత్సుకత శాంతించినది

శ్లో॥ ఏవం మనుష్య పదవీమనువర్తమానో
నారాయణోఽఖిల భవాయ గృహీతశక్తిః।

రేమేఽంగ షోడశ సహస్రవరాంగనానామ్
సవ్రీడ సౌహృద నిరీక్షణహాస జుష్టః॥
శ్రీభాగ. ౧౦స్కం. ౬౯అ. ౪౪ శ్లో

క॥ ఈపగిది లోకహితమతి
నా పరమేశ్వరుఁడు మానవాకృతిఁ దిజగ
ద్దీపిత చారిత్రుడు బహు
రూపములం బొందె సుందరుల నరనాథా।

చ॥ అని హరి యిట్లు షోడశ సహస్ర వధూమణులం బ్రియంబునన్, మనసిజ కేళిఁదేల్చిన యమానుషలీల సమగ్ర భక్తితో, వినినఁ బఠించినం గలుగు విష్ణుపదాంబుజ భక్తియున్ మహా, ధన పశుపుత్త్ర మిత్ర వనితాముఖ సౌఖ్యములన్ నరేశ్వరా॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

విజ్ఞులు తమమీఁద సందేహ మున్నవారి కవకాశ మొసంగెదరు. వారివద్ద తెలియని వారివలె నటించెదరు. సమయము వచ్చినపుడు దాసిని బయటపెట్టి వస్తుస్థితిని వారికిఁ దెలిపెదరు. దానివలన వారి సందేహములు దూరములు కాఁగలవు. అంత నిద్దరును నవ్వుకొనుచు మాటలాడుకొందురు. దీనివలఁన బ్రేమ వృద్ధియగును. శ్రద్ధా విశ్వాసము లింకను బెరుగఁగలవు.

సూతుఁడిట్లనెను:—"మునులారా! నారదుఁడుత్సాహముతో భగవల్లీలలను గాంచుచుండెను. అంతఃపురములో

ననేక రూపములను ధరించి కేశవుఁడు క్రీడించి నాఁడనుటయే కాదు. ఆతఁడు నగరమందును, నగరమునకు వెలుపలను అనేక రూపములతో వ్యవహరించు చుండెను. ఒక్కొక్క చోట గుఱ్ఱము నెక్కి వేటకు బోవుచుండెను ఇంకొక చోట రథము నెక్కి రాజసభకు బోవుచుండెను. నారదుఁడీ విధముగఁ దిరిగి తిరిగి అటునిటుఁ జూచునంతలో ముక్కునకు బేసరులు, చెవులకు దిద్దులును, ననేక హారములును, ఆభరణములును ధరించి, ఒక సుందరి మేలి ముసుఁగుతో వచ్చు చుండెను. ఆమె మేలి ముసుగుఁనుండి ప్రేమభరిత దృష్టులతో నారదునిఁ గాంచుచుండెను. నారదుఁడు మొదట చూడఁగనే యీచీకఁటిలో నింతటి సుందరి ఒంటరిగా నేల పోవుచున్నదా యని అనుకొనుచుండెను. కాని చూడఁగా నామె దృష్టిలో మోహాకత కలదు, ఆతఁడాగలేక పోయెను. ఆతఁడామె దగ్గఱకు బోయెను వీనినిఁగాంచి ఆ స్త్రీ నవ్వెను.

నారదుని ఆశ్చర్యమునకు మేఱ లేకుండెను. ఆస్త్రీ వేషమును వేసికొనిన పురుషుఁడే కాని స్త్రీ కాదు. ఆమె బులాకినిబెట్టు కొనెను. శ్యామసుందరుఁడే స్త్రీ యయ్యెను. నారదుఁడులికిపడి తెలిసికొని యిట్లనెను :—"స్వామీ! మీరు పురుఁషులు స్త్రీ వేషమును వేసికొనినారేల ? పురుషులు స్త్రీ వేషమును ధరించుట నిషిద్ధము కదా!"

నవ్వి భగవానుఁ డిట్లనెను:-"నాకు విధి నిషేధములు లేవు."

నారదుఁ డిట్లనెను:-"విధి నిషేధములు లేవు సరియే. ఇప్పు డీ వేషమెందులకు వేసినారు."

భగవానుఁ డిట్లనెను :-"శాసకుఁడందఱను రక్షించుచుండవలయును. వేషమును మార్చి అందఱ మనోగత భావములను గ్రహింపవలయును. ప్రజల భావము లేవో తెలిసికొనుట అవసరము. మా అంతఃపురమందలి స్త్రీ పురుష భావము లేమిటో కనుగొనవలసి యున్నది. దీని నంతను గ్రహించుటకై నే ననేక రూపములను ధరించుచు దిరుగుచుందును."

నారదుఁడిట్లనెను :-"స్వామీ! ధన్యుఁడ నైతిని. పదునాఱువేల నూటయెనిమిదిమంది భార్యల నెట్లు సంతోష పెట్టుచున్నావో యని నే ననుకొనుచుండెడు వాఁడను. మీ కృపచే నా కది శాంతించినది. యోగేశ్వరా! మీ మాయ నెఱుఁగుట సామాన్యముకాదు. నీవు మాయాపతివి. నీమాయను బ్రహ్మాది దేవతలును నెఱుఁగఁజాలరు. అట్టియెడ నాబోటి అల్పజ్ఞుఁడెట్లు తెలిసికొనఁగలఁడు? కాని యీ మాయను నేను మీ అనుకంపచే దర్శించితిని. నేఁడు నేను కృతార్థుఁడనైతిని. నాభ్రమ యంతయును బారిపోయినది. ఇప్పుడు నేను మీ వలన నొక ఆశీర్వాదమును గోరుచున్నాను."

భగవానుఁ డిట్లనెను :-"అదేమి ? నీవుసంకోచమును వదలి నన్నడుగుము."

నారదు ఁడిట్లనెను : "దేవా! నేను మీ భువన మోహనమగు మాయను దర్శించితిని. నా యుత్సాహము నశించినది. నీసుందర లీలలయందును నాకనురాగముకలుగు నటుల నాశీర్వదింపుఁడు. ఆ లీలను నిరంతరమును నేను గాన మొనర్చుచు సమస్తలోకములను దిరుగుచుండవలయును."

భగవానుఁ డిట్లనెను :-"మంచిది. అట్లే అగుగాక ! నీవు వీణను మీటుచు నా లీలలను, గుణములను గాన మొనర్చుచుండుము. ఇంకేమైన నడుగఁదలఁచితివా ?"

నారదుఁ డిట్లనెను :-"స్వామీ! నాకొంక శంక యున్నది. నీవఖిల బ్రహ్మాండ నాయకుఁడవయ్యు నిట్టి యద్భుతాద్భుత లీలల నేల చేయుచున్నారు ? సాధారణ గృహస్థుల వలె వ్యవహారమేల చేయుచున్నారు ?"

భగవానుఁడు నవ్వి యిట్లనెను :-"చూడుఁడు. ధర్మ ప్రవర్తకుఁడను నేనే. దానినిఁ జెప్పువాఁడను నేనే. దాని ననుమోదించువాఁడను నేనే. శ్రేష్ఠుఁడెట్లాచరించునో అందఱును నట్లే ఆచరించుందురు. నేను ధర్మము ననుసరించి నడువకపోయినచో లోకులు ధర్మహీనులై నశించెదరు. కావున నేను ధర్మమార్గమును శిక్షణ నిచ్చుటకై వ్యావహారిక కర్మల నొనర్చుచున్నాను."

నారదుఁడిట్లనెను :-"మీరు ఒక్క శరీరముతో నిన్ని కార్యము లొనర్చుటను గాంచి మోహమును జెందినాను."

సర్వ భగవానుఁ డిట్లనెను :-"వత్సా! దీనికిఁజింతిం వలసినపనిలేదు. నేను సర్వాత్ముఁడను. అందఱ అంతఃక ణములందు సాక్షిరూపమున నుండి నేనే అన్నిటినిఁ జేయ చున్నాను. నన్ను సర్వగత సర్వాంతర్యామిగ గ్రహిం నీవు నా యోగ మాయాప్రభావమునకు మోహితుఁడవ కాకుండుము."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈవిధము సమస్త భవనము లందును భగవానుఁడు వివిధ లీలల నొ ర్చుటను గాంచి మొదట నాతఁడు మిక్కిలి విస్మితుఁడయ్యెను అనంత వీర్యుఁడగు భగవానుని యోగమాయా వైభవమున మాటి మాటికిని గాంచి, కౌతుక వశమున నటునిటు దిఁ గెను. భగవానుని ఉపదేశమును బొందగాఁనే ఆతని విస్మ యమును, కౌతుకమును దూరమయ్యెను. చతుర్వర్గ ఫల దాతయును, భగవానుఁడయ్యును గృహస్థ ధర్మమును బాలించుచుండెను. దానికి నారదుఁడు పరమానందమును జెందెను. నారదుఁడు ప్రణామ మొనరింపఁగా భగవానుఁ డాతని సమ్మానించెను. ఈవిధముగ భగవానునిచే సమ్మా నితుఁడై, ప్రసన్నచిత్తముతో నాతనినే స్మరించుచుఁ దన యిచ్ఛానుసారముగ నితరలోకములకుఁ బోయెను.

ఈ విధముగ మహర్షులారా! భగవానుఁడు మనుష్య లీలల నొనర్చుచుఁ బదునాఱువేల నూట యెనిమిది మంది భార్యలతో నొంటరిగా రమించుచుండెను."

సూతుఁడిట్లనెను :- "మునులారా! నే నత్యంత సంక్షేపముగ అజితుఁడగు భగవానుని కథను జెప్పుచుంటిని. ఆతఁడు విశ్వోత్పత్తి, స్థితి, ప్రళయములకుఁ గారణుఁడు. అచింత్య కర్ముఁడు. ఆతని యీపరమ పావనమగు నుపాఖ్యానము నెవరు వినెదరో, వినిపించెదరో, చదివెదరో, చదివించెదరో, గానము చేయుదురో, గానమును జేయించెదరో, అనుమోదన మొనరించెదరో వారందఱకును విశ్వంభరుఁడు భక్తినిఁ బ్రసాదించుగాక! మునులారా! ఇప్పుడు మీరేమి వినఁదలఁచుచున్నారు?"

శౌనకుఁడిట్లనెను :- "సూతా! మాకు భగవానుని నిత్యచర్యను గూర్చి చెప్పవలయును."

సూతుఁ డిట్లనెను :- "మంచిది స్వామీ! వినుఁడు."

— ౯ —

## కృష్ణుని దినచర్య

శ్లో॥ బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ వార్యుపస్పృశ్య మాధవః॥
దధ్యౌ ప్రసన్నకరణ ఆత్మానం తమసః పరమ్॥

శ్రీ భాగ. ౧౦స్కం ౭౦ అ. ౪శ్లో:

వ॥ ...మేలు కని తనచిత్తంబునఁ జిదచిదా నందమయుం బరమాత్ము నవ్యయు|నవికారు నద్వితీయు నజితు ననంతు నచ్యుతు నమేయు నాధ్యు నాద్యంత విహీనుఁబరమ బ్రహ్మంబు నైన తన్నుం దా నొక్కింత చింతించి॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

ఎవని విషయమునైన బాగుగాఁ దెలిసికొనఁ దలఁచి నచో వానిదినచర్యను జూచినఁ దెలియఁగలదు వాని కాలము నేయే కార్యములలో గడుపుచుండునో చూడ వలెను. విద్వాంసులు కావ్యశాస్త్ర వినోదములందు కాలమును గడుపుదురు. సాంసారికులు తమకాలమును విషయ వ్యసనములందును, పరస్పర కలహములందును గడుపుదురు. ధర్మాత్ములగు గృహస్థులు తమ కాలమును ధర్మార్థ కామము లందు నియమముగ గడుపుదురు. పగలు ధర్మార్థములను గూర్చి చింతించెదరు. రాత్రియందు కామోపభోగము లనుభ వించెదరు. వారు పనుల నన్నిటి నెప్పుడెట్లు నిర్వహింపవల యునో నిర్ణయించుకొందురు. ఆ సమయమున నేపనినిఁ జేయరు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవానుని గృహచర్యను గూర్చి వినిన తరువాత మీరు నన్ను భగ వానుని దినచర్యనుగూర్చి అడిగితిరి దానినివర్ణించెదను. ముని వర్యులారా! సూర్యుఁడుదయించినప్పుడు సూర్యోదయమందురు,

సూర్యోదయమునకు బూర్వము మూఁడు నాలుగు గడియలకు ముందు తూర్పున నాకాశ మెఱ్ఱగానుండును. దానినరుణోదయ మందురు. సూర్యుని సారథియగు అరుణుఁడు ముందుగా నుదయించును. తదనంతరము సూర్యుని దర్శనమగును. అరుణోదయ కాలమునే బ్రాహ్మముహూర్త మందురు. దాని నుషఃకాలమనియు నందురు. ఆసమయమునఁ గమ్మని నిద్రవచ్చును. ఆసమయమున సూర్యమండలము నుండి అమృతము స్రవించును. కావున నాసమయమున వాయువు స్వాస్థ్యమునకుఁ బరమహితకరముగనుండును. విషయలంపటు లీకాలమున నిద్రించి గడిపెదరు. యోగులీకాలమునందు బ్రహ్మధ్యాన మొనరించెదరు. కర్మిష్ఠులా సమయమున స్నాన మొనర్చి సంధ్యావందన, దేవతా, ఋషి, పితృ తర్పణము లొనరించెదరు. సూర్యోపస్థాన మొనర్చెదరు. అగ్నియందు హోమమొనర్చి దేవతలను సంతుష్టి పరచె దరు. ఆసమయమున నిద్రించువారు తమ బహుమూల్య మగు ధనమును గృత్రిమముగ మెఱయుచుండు గాజుముక్క లకై వెచ్చించిన వారగుచున్నారు. ఆసమయమునఁ గమ్మని నిద్ర ప్రజలను లోభపెట్టుటకు వచ్చును. కావున బుద్ధిమంతు లగు వారు ఆసమయమును బొరపాటుననైన నిద్రలో గడుప రాదు ఆసమయమునఁ గోడి లేచికూయును. ఇది నిద్రకు సమయము కాదని అది చెప్పుచున్నది. కోడికూఁత విని

యును నెవరు నిద్రించెదరో వారి కాంతి, తేజస్సు నశించి, కళావిహీనులగుదురు.

కోడికూయఁగనే భగవానుఁడు నిద్రలేచెడువాఁడు. ఇది ఆతని భార్యలగు రుక్మిణి మొదలైనవారికి అంతగా నిష్టము లేదు. వారు ప్రియతముని వియోగమునకుఁ జాల కలవర పడుచు నా కుక్కుటములను దూషించుచుందురు :- "ఈ పనికిమాలిన దప్పుడే కూయుట ప్రారంభించినది. దీనికి రాత్రులందు నిద్రకూడ నుండదు. మాస్వాధీనమున నున్నచో ద్వారకలో నొక్క కుక్కుటమునైన లేకుండఁ జేసెదము. సరిగా నిద్రపోవు వేళకిది 'కొక్కొరో కోకో' అని కూయుటకుఁ బ్రారంభించును. కోడి కూయఁగా నే పారిజాతాది వృక్షము లపై నుండిన పక్షులన్నియును గలకలారావము లొనర్చు టకుఁ బ్రారంభించును. శుక, పిక, శారికా, మయూరాది పక్షులు తమ సుమధుర వాక్కులతో భగవంతుని గుణము లను గానమొనరించును. ఇవి పలుకుట వందిగణము భగ వంతుని బిరుదావళులను బలికినట్లుండును. ఆ సమయమున నమృతమయ పవనము కల్పవృక్ష సుమన ములనుండి సుగంధమును దెచ్చుచుఁ బ్రవహించును. భ్రమర బృందము గుంజారవ మొనర్చుచుఁ బుష్పముల చుట్టును దిరుగు చుండును. పక్షిశాబకములు శాంతవాతావరణమును దమ కూజితములచే శబ్దమయ మొనర్చుచుండును. ఈ సుఖద

సమయయును గాంచి అందఱును నానందమగ్నులగుచుందురు. భగవానుఁడు లేవఁగూడదని వారందఱనుకొనుచుందురు. కాని భగవానుఁడు తన నియమములను జక్కఁగఁ బాటించును. ఆతని నెంతగా బలవంతమొనర్చినను బ్రాహ్మ ముహూర్తమున శయనింపఁడు. వెంటనే లేచి ముందుగాఁ దన అఱచేతిని దర్శించి, తరువాత చేతులను గాళ్ళను గడగికొని శీతల జలములచేఁ జక్షువులను గడిగికొనును. అంగవస్త్రముచేఁ జేతులను, కాళ్ళను, ముఖమును దుడుచుకొనును. అంతఁగూర్చుండి ప్రాతఃస్మరణమొనర్చును. పృథివినిగూర్చి యిట్లు ప్రార్థించును—

శ్లో॥ సముద్ర వసనే దేవి! పర్వత స్తన మండలే!
విష్ణు పత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే॥

ఓ విష్ణుపత్నీ! ఈ సముద్రమే నీయొక్క నీలవస్త్రము, పర్వతములే నీ స్తనమండలము. నేను నీకు నమస్కారమొనర్చుచున్నాను. నీమీఁద నేను గాళ్ళను బెట్టుచున్నాను. దానిని క్షమింపుము.”

ఈవిధముగఁ బ్రాతఃస్మరణమొనర్చి, సావధానుఁడై స్వస్థచిత్తముతోఁ దన మాయాతీతమును, నఖండమును, స్వయంప్రకాశమును, నద్వితీయమును, అవినాశియు, నిత్య, నిర్మల, జగత్కారణభూతమును, సర్వశక్తియుక్తమును, సదానందస్వరూపము నగు బ్రహ్మస్వరూపమును జింతించుచు.

అంత శౌచాదికర్మలను గావించి సుందర, స్వచ్ఛ, సుగంధ, శీతల సలిలముచే సుఖముగ స్నానమొర్చును. బహుమూల్యమగు బట్టుబట్టను గట్టుకొని సంధ్యావందనాదులొనరించును. తదనంతర మగ్నిహోత్ర మొనర్చి, మౌనియై వేదమాతయగు గాయత్రిని జపించును. ఇంతలో సూర్యోదయమగును. అప్పు డాతని కర్ఘ్య మొసంగును.''

శౌనకుఁ డిట్లడిగెను :- ''సూతా! సూర్యార్ఘ్యము సంధ్యావందనమున నీయఁబడును గదా! అగ్నిహోత్రమును, గాయత్రీజపమును జేసి సూర్యార్ఘ్య మొసంగు టేమిటి ?''

సూతుఁడిట్లనెను :- :'అవును, విధానమింతే. సంధ్యా సమయముననే ఉపస్థానార్ఘ్య, గాయత్రీ ఆవాహన జపాదు లొనరించెదరు. తదనంతర మగ్నిహోత్ర మొనర్చుచుందురు. కాని భగవానుఁడు కణ్వశాఖీయుఁడు. ఈ శాఖీయులు సూర్యోదయకాలమందే అర్ఘ్య మొసంగుట ఉత్తమమని భావించెదరు. అందువలన నగ్నిహోత్ర మొనర్చి భగవానుఁడు సూర్యోదయము వఱకును గాయత్రీజప మొనర్చును. సూర్యోదయము కాఁగానే అర్ఘ్యము నొసంగి ప్రాతఃకృత్యములను సమాప్తిగావించెదరు. అంతఁ దన కంశభూతులగు దేవ, పితృ, ఋషులకు విధిపూర్వకముగఁ దర్పణ మొన ర్చును. తరువాతఁ దన తల్లిదండ్రులకును, ఇతరు గురుజనములకును, బ్రాహ్మణులకును సవిధిగఁ బూజాదులొసర్చి వారికి

ప్రణామ మొనరించును. వృత్తి నేర్పఱుపఁబడిన బ్రాహ్మణులు రాఁగా వారికి వస్త్రాభూషణాదులచే నలంకరించి పట్టుబట్టలను, మృగచర్మములను, తిలమోదకములను, గోవులను దాన మొసంగును. ఆ గోవులు ముసలివి, గొడ్డుబోతువి, రోగయుక్తయులైనవి, బలహీనములైనవియు, బాడుచునవియు గాక, సాధువుగను నందముగను, రోగము లేనివియు, పాడివియు, వత్సలములతోఁగూడినవియు, స్వర్ణశృంగములును, రౌప్యఖురములును గలవియు, ముత్యాలహారములతో నలంకరింపఁబడినవియునై యుండెను. వాని వీపులమీఁదఁ జక్కని పట్టువస్త్రములచే నలంకరింపఁబడియుండెను. ఇట్టి కపిల గోవులను వద్యసంఖ్యగాఁ బ్రతిదినమును దాన మొసంగును.

శౌనకుఁడిట్లడిగెను :- "వద్యసంఖ్య అనఁగా నెంత?"

సూతుఁ డిట్లనెను :- "స్వామీ! పదునాలుగు లక్షలలో నూటయేడవ వంతునకొక వద్యమని పేరు. అనఁగా 13084 నకు వద్యమని పేరు. భగవానుఁ డిన్నిగోవులను బ్రతిదినమును దాన మొసంగును."

శౌనకుఁ డిట్లడిగెను :-"సూతా! ఇన్నిగోవులు నిత్యమెచ్చటనుండి రాఁగలవు? ఎచ్చట నుండఁగలవు. భగవానుడెన్నో రోజులు చేసియుండవచ్చునుగదా! ఇది ఆశ్చర్యముగ నున్నది."

సూతుఁడిట్లనెను :- "స్వామీ! ఇప్పుడు కలియుగము వచ్చినది కావున మనకాశ్చర్యమగుచున్నది. లేకున్న

నాశ్చర్యము పడవలసిన పనిలేదు. ఒక్కక్షణములో బ్రహ్మాం
డములను సృజించి నాశనమొనర్చువాని కీపని లెక్క
యేమి? ఒక్కసారిగనే భిన్నభిన్న గోత్రములు కల బ్రాహ్మ
ణులచే సంకల్పములొనర్పఁజేసి దానమొసంగెడువాఁడు
గోబ్రాహ్మణ హితము కొఱకేగదా ఆతని యవతారము.'

శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా! సత్యము. స
తరువాత చెప్పుము. తరువాత భగవానుఁ డేమిచేయును?

సూతుఁ డిట్లనెను :- "స్వామీ! గోదానమొనర్చి
తరువాత భగవానుఁడు గో, బ్రాహ్మణ, దేవత, కులవృద్ధ
గురుజనులకును, సమస్త ప్రాణులకును, శ్రద్ధాభక్తులతో
ప్రణామమొనరించును. తదనంతరము కపిల గోవును, ఇత
శుభములగు వస్తువులను స్పృశించును. పూజావస్త్రము
లను దీసివైచి, ధరింపఁదగిన రాజోచిత దివ్య నూతన వస్త్ర
ములను ధరించును. శరీరమంతటను సువర్ణ, మణిమయా
భరణములను ధరించును. అంత సుందర గోఘృతము
ముఖమును జూచుకొని, ఆ ఘృతమును దానమొసంగును
సేవకులెదుట నద్దమును బట్టఁగాఁ త్రిభువన మోహనమగు
శ్రీముఖమును జూచుకొనును. ధర్మస్వరూపమగు నాఁబోతును
గోవును, బ్రాహ్మణుని, దేవతలను మరల దర్శించి, తన
రాణుల అంతఃపురమునకుఁ బోవును. అచ్చటనుండు దాస
దాసీజనములకును, అన్యాన్య విద్యోపజీవులకు వారితో షిక

ముల నొసంగి సంతుష్టుల నొనర్చును. భోజనముచేసి, సుందర సుగంధ మాలలను ధరించును. భార్యలు సుందరములగు లవంగములు, ఏలికలు, జాజికాయ, జాపత్రి, కాచు, పచ్చ కర్పూరము, సున్నము పోఁక మొదలగువానితోఁ గూడిన తాంబూలము నేర్పఱచి చుట్టి సువర్ణపాత్రముతోఁ దేఁగా నా తాంబూలములను ముందుఁగా బ్రాహ్మణులకును మిత్రులకును, మంత్రులకును, ప్రియురాండ్రకును దన చేతులతో నొసంగి, తదనంతరము తాను స్వీకరించును. తాంబూల చర్వణమును గావించి కొంచెముసేపు ఎడమ ప్రక్కగాఁ బరుండును.

ఇంతలో దారకుడు సువర్ణ రథమును, గరుడధ్వజము పైన నెగురుచుండ శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకములను శ్వేతాశ్వములు పూన్పబడి తేగానే సారథివచ్చి భగవానునకుఁ బ్రణామము కావించును. సారథినిఁ జూడగనే భగవానుఁడు నవ్వి మంచము మీఁదనుండి లేచును. అప్పుడు సాత్యకి, ఉద్ధవాది రక్షకులును, ఆత్మసచివులును వచ్చెదరు అంత నవ్వుచు సారథిచేతిని దానుఁ బట్టుకొని, అటునిటుఁ జూచుచు రథము దగ్గఱకుఁ బోవును. దాసీలతో రాణు లాతని ద్వారము వఱకు బంపెదరు. స్త్రీ లాతనికి లజ్జా సహిత ప్రణయకటాక్షముల ద్వారా సతృష్ణ దృష్టితో జూచెదరు. రథము కనబడునంత వఱకు వారచ్చటనే

నిలుచుండి, రథము కనుమరుగునఁ బడఁగానే తిరిగి వచ్చె దరు. భగవానుఁడు వెడలి పోవునపుడు నవ్వీనవవ్వ ప్రియు రాంద్ర హృదయముల లోనికి జొచ్చుకొని పోయి మరల కృష్ణుఁడు తిరిగి వచ్చునంత వఱకును శ్యామసుందరుని స్మర ణమున నుంచును. యాదవు లందఱును సుధర్మ సభాద్వార మున నిలువఁబడి భగవానుని ప్రతీక్షించు చుందురు. భగ వానునిరథధ్వజమునుజూడఁగనే అందఱునుజయజయధ్వానము లొనర్చెదరు. అందఱి వైపునను కృపాభరిత దృష్టులతోఁ జూచుచు బంధు, బాంధవులతోడను యాదవులతోడను గూడుకొని సుధర్మసభలోనికిఁ ప్రవేశించును. అప్పు డాతని గాంచఁనే అందఱకును క్షుధా, పిపాస, శోక, మోహ, జరా, మృత్యువులను నీమ ధర్ములును బాధింపకుండును.

ఆ సభలో నందఱకును వేలు వేలాసనములు కలవు ఒక సుందర సుసజ్జిత మణిమయ రాజసింహాసనమున నుగ్ర సేనుడును, క్రింద భగవానుడును గూర్చుండెదరు. వారి చుట్టును జిన్నవారును బెద్దవారును గ్రమబద్ధముగ యాద వులు కూర్చుండి యుండెదరు. వీరందఱమధ్య చుక్కలలో జంద్రునివలె భగవానుడు శోభాయమానముగ ప్రకాశించు చుండెను. మొదట రాజకార్యములు జరుగును. తరువాత మనోరంజన కార్యములు జరుగును. సచివులును ఉపమంత్రి గణమును గొని వినోదవాక్యములను బలికెదరు. వారు హాస్య

రసపూర్ణములగు మాటలతోఁ గుశలతా పూర్వకముగా శ్యామసుందరు నుపాశించెదరు. సూత, మాగధ, వందీ జనములు వచ్చి స్తుతిపాఠము లొనరించెదరు. నట, నర్తకీ గణమువచ్చి మృదంగ, వీణ, మురజ, వేణు మొదలగు వాద్యములతో నాడి, పాడి, తమ కళలను ప్రదర్శించెదరు. అంత వేదజ్ఞులగు బ్రాహ్మణులుఁ ఋక్కులకును, సూత్రములకును వ్యాఖ్య నొనర్చి, ఇతిహాస పురాణ కథలను పూర్వ కాలమున పవిత్రకీర్తి కలవారును, పుణ్యశ్లోకులు నగు రాజుల చరిత్రములను విసును. ఈ విధముగ మధ్యాహ్నోత్తరము వఱకును సభా కార్యక్రమములు నడుచును.

సభ పూర్తి కాఁగానే భగవానుఁడు రథముపైఁ గూర్చుండి మరలఁ దన అంతఃపురము వైపునకు బోవును. మేడలపై కెక్కి రాణులు భగవానుని రాక కొఱకు ఎదురు చూచు చుందురు. గరుడ ధ్వజము కనఁబడగానే ముడుచుకొని పోయిన వారి హృదయ కమలములు స్వతః వికసించును. వా రుత్సాహముతోఁ గ్రిందకు దిగి భగవానునకుఁ స్వాగత మొసంగుటకై ముందునకుఁ బోయెదరు. రథముపై నుండగా నాతఁ డొక్కడుగనే యుండును. దిగఁగానే ఆతఁడందఱ యిండ్లకు నొక్కసారిగా నన్ని రూపులతోఁ బోవును. ఎవరికివారు భగవానుడు తన యింటికే వచ్చెనని అనుకొనుచుందురు, అచ్చట వారు మధురవాక్కులతోడను ప్రణయ

కటాక్షముల తోడను నాతనికి స్వాగతము నొసంగెదరు. భగ వానుఁ డింటిలోనికి బ్రవేశింపగనే ఆతనిరాణులాతని పాదము లను గడిగెదరు. భగవానుఁడు వస్త్రములను మార్చుకొని, కొంచెముగ నల్పాహారము గావించును. అందులో గొంత పిల్లల కొసంగును. అంత సాయంకాల కృత్యములను నెఱవేర్చుకొని స్నాన సంధ్యావంద నాదులను, సాయం కాలాగ్నిహోత్రము నొనర్చి, పూజాదులను గావించి భోజన మొనర్చును. 'భుక్త్వా శతపదం గచ్ఛేత్' అను శాస్త్ర ముండుటచే నటునిటు నూఱడుగులు నడుచును. కొంచెము సేపు ఇతిహాస పురాణములను వినును. భార్యలతో సరసము లాడును. అంతఁ దూర్పు తలాపిణో సుందర సుఖద శయ్యాపై శయనించును. నిద్రించునపుడు అగస్త్య, విష్ణు, ముచుకుంద, కపిల, ఆస్తీకముని ఈ యైదుగురను స్మరించును. ఏలననగా నీ యైదుగురును సుఖముగ నిద్రుంచువారు నిద్రించునపుడు చోరులు రాకుండుటకై యీ మంత్రమును బఠించి నిద్రిం చును.

శ్లో॥ తిస్రో భార్యాః కఫల్లస్య దాహినీ మోహినీ సతీ!
తాసాం స్మరణమాత్రేణ చోరో గచ్ఛతి నిష్ఫలః ॥
కఫల్లమ్ । కఫల్లమ్ ! కఫల్లమ్ ॥

అనఁగా చౌర్య విద్యకాచార్యుఁ డగు కఫల్లమునికి దాహినీ, మోహినీ, సతీ అను ముగ్గురు భార్యలు కలరు.

కఫల్లముని చౌర్యవిద్యాప్రచార మొనర్చెడువాఁడు. దొంగ తనమును జేయమని శిక్షణ నిచ్చెడువాఁడు. ఆతని భార్యల కీ పని యిష్టములేదు. వారు తమ భర్తతో మునివర్యా నిట్టి చోర విద్యను బ్రచారమొనర్చెదవేల యని ఆతనితో మాటిమాటికినిఁ జెప్పుచుండెడువారు.''

ముని యిట్లనెను :—'' నేను నీ విద్య కాచార్యుఁడను గదా !''

భార్య లిట్లనిరి :- ''మీ రాచార్యులైన నగుగాక, దొంగతనమును నేర్పి, ప్రజలను భయభీతుల నొనర్చుట ఉచితముకాదు.''

అప్పుడు ముని యిట్లనెను :- ''సరే, నేనొక నియమము నొనర్చుచున్నాను. నిద్రించునపుడెవఁడు మీ ముగ్గురిని స్మరించి, మూఁడుసార్లు కఫల్లమ్, కఫల్లమ్, కఫల్లమ్ అని యుచ్చరించునో, వాని కడకు చోరులు రానేరారు. ఒకవేళ వచ్చిరా, వారు నిష్ఫలులై తిరిగి పోయెదరు.''

భగవాఁడు కఫల్ల మునికి శిష్యుఁడే. వ్రజమందు వెన్న, పాలు, పెరుగు, మీఁగడలను దొంగిలించెడు వాఁడు. ఇప్పుడు ద్వారకకు రాఁగానే తన కడకు దొంగలు రాఁగలరేమోనను భయముచే నాతని ముగ్గురి భార్యలను, కఫల్లమ్ కఫల్లమ్ కఫల్లమ్మని మూఁడు సార్లుచ్చరించి నిద్రించును.

సూతుఁడిట్లనెను:–"మునులారా! ఈ విధముగ మన శ్యామసుందరుఁడు పదునాఱువేలమంది భార్యలతో సుఖ పూర్వకముగ గాలమును గడుపుచుండెను. బయట నుండి యెవరైన వచ్చినచో రాజసభలోనే కలియును. అంతః పురములోనికి రాణులును, ఘనిష్ట సంబంధము కలవారు మాత్రమే ప్రవేశింప వీలగును. భగవానుఁడు బ్రహ్మణ్య దేవుఁడు. శరణాగత వత్సలుఁడు. ఈఖ్యాతి సర్వత్ర వ్యాపిం చుటచే దీనులును, దుఃఖులును వచ్చి తమ దుఃఖమును జెప్పుకొనుచుందురు. సందేశములను బంపుచుందురు. నరకా సురుని కారాగారమునుండి విడిపించిన రాజకుమార్తెలను విడి పించి భగవానుఁడు వారినందఱను దనకు భార్యలుగ నొనర్చు కొనెను. ఇప్పుడు జరాసంధుని కారాగృహమున బంధింపఁ బడి తనకనన్యభక్తులగు రాజుల నెట్లు రక్షించినదియును జెప్పఁబోవుచున్నాను. మీరందఱును సమాహితచిత్తులరై శ్రవణమొనర్పుఁడు."

—

## జరాసంధునిచేబంధింపఁబడి నృపతులసందేశము

శ్లో॥ యోవై త్వయా ద్వినవ కృత్వ ఉదాత్తచక్ర
భగ్నో మృధే ఖలు భవంతమనంత వీర్యమ్।
జిత్వా నృలోక నిరతం సకృదూఢ దర్పో
యుష్మత్ప్రజా రుజతి నోఽజిత తద్విధేహి॥

శ్రీభాగ. ౧౦. స్కం. ౭౦అ. ౩౦ శ్లో॥

క॥ కదనంబున నీభుజావలి
కెదిరింపఁగ లేక పాఱఁడే విక్రమసం
పద చెడఁగ జరాసంధుఁడు
పదునెనిమిది మార్లు ధరణి పాలురు నవ్వన్॥

వ. ఇట్లు తలపడిన బన్నములం దలంపక సింహంబు సమద దంతావళంబుల నరికట్టి కారించు చందంబున మమ్ముం జెఱపట్టి బాధించుచున్న యప్పాపాత్ముని మర్దించి కారాగృహ, బద్ధులమగు మా నిర్బంధంబులు వాపుము.

—శ్రీమదాంధ్ర భాగవతము॥

పండిన చెట్టు కడకే పండ్లకొఱకై పోవుచుందురు. ఎచ్చట సహాయము కలుగునను నాశయుండునో అచ్చటికే సహాయమడుగఁబోవుదురు. ఏ బావిలో నీరుండునో దప్పిక గొన్నవాఁడచ్చటికే పోవును. ఎల్లప్పుడును బరదుఃఖమును హరించువాఁడును, పరోపకార మొనర్చువాఁడును నీశ్వరుఁడే. ఆప్తకాముఁడగు భగవానుఁడు పరోపకార మొనర్చుటకును, అభయ ప్రదాన మొనర్చుటకు నానావతారములను

ధరించును. భక్తుల కోరికలను నెఱవేర్చుటయును, ఆశ్రితుల దుఃఖములను దూరమొనర్చుటయును, బంధమునుండి శాశ్వతముగ విముక్తుల నొనర్చుటయును భగవంతుని వ్రతమై యున్నది. అవతారమెత్తి ఆతఁడీ కార్యములనే చేయు చుండును.

సూతుఁడిట్లనెను :–"మునులారా! నిత్యనియమానుసారముగ భగవానుఁడు సభలోనికి వచ్చి కూర్చుండెను బ్రాహ్మణులు వేదమంత్రముల కర్థమును జెప్పుచు, పురాణకాలమునఁ బవిత్రకీర్తిగల రాజుల చరిత్రలను, కీర్తిని వర్ణించుచుండు నంతలో ద్వారికుఁడు వచ్చి ప్రణామము కావించి యిట్లనెను :–"ప్రభూ! ఒక అపరిచితవ్యక్తి వచ్చి నాఁడు. వానివృత్తాంతము నడుగఁగా నాతఁడిట్లనెను :– "నేను భగవానుని తోడనే చెప్పెదను. మీరు నేను వచ్చినట్లు శ్యామసుందరునకుఁ దెల్పుఁడు. ఆతని యాజ్ఞయేమగునో కనుఁగొనుఁడు."

సర్వజ్ఞుఁడగు భగవానున కంతయును దెలియును. ఆతఁడిట్లనెను :–"మంచిది. ఆతని నిచ్చటికిఁ దీసికొని రమ్ము." ఇది విని ద్వారపాలకుఁడు ప్రణామమొనరించి వెడలిపోయి, యింకొక వ్యక్తిని వెంటబెట్టుకొని వచ్చెను.

ఆ వ్యక్తి వచ్చి భగవానునకుఁ బ్రణామమొనరించి రాజు నెడల సమ్మానమును బ్రదర్శించుచు నిట్లనెను :–

"స్వామీ! నేను మగధ దేశమునుండి వచ్చుచున్నాను. నే నొక గుప్తసందేశమును దీనికొనివచ్చితిని.

భగవానుఁడిట్లనెను :-"మంచిది, నీవు నీ సందేశమును జెప్పుము. ఇచ్చట నెవరు నితరులు లేరు."

దూత యిట్లనెను :-"ప్రభూ! మగధదేశపురాజగు జరాసంధుఁడు ఇరువది వేల యెనిమిదివందలమంది రాజులను బట్టుకొని బంధించినాఁడు. ఆ రాజులే నన్ను గుప్తదూతగ మీకడకు బంపిరి."

భగవానుఁ డిట్లనెను :- "వారు నాకు బంపిన సందేశమును నిర్భయుఁడవై చెప్పుము."

దూత యిట్లనెను :-"స్వామీ! బంధితులగు నృపతు లిట్లు నివేదించిరి :-"జరాసంధుఁడు దిగ్విజయమునకు బయలు దేరినపుడు చాలమంది రాజులాతని కధీనులై ఆతనికిఁ బాదాక్రాంతులైరి. రమారమి ఇరువదివేలమంది రాజులు మాతనికిఁ దలలువంచలేదు. అందువలన నాతఁడు బలవంతముగఁ బట్టుకొని గిరివ్రజమను గోటలో బంధించినాఁడు. ఈకోట నలువైపులను గొండలచేఁ జుట్టుకొనఁబడియున్నది. దీనిలోని కే శత్రువును బ్రవేశింపఁజాలఁడు. పర్వతముల మీఁద శతఘ్నులమర్పఁబడినవి. దీనికి చుట్టును పెద్ద అగడ్త కలదు. ఈ విధముగ మేము బంధితులమైనాము. మీరే యీ దుష్టునకు గర్వమును గలిగించితిరి."

"భగవానుఁ డిట్లనెను :-"ఏమయ్యా! వానిగర్వము నే నెట్లు కలిగించితిని ?"

దూత యిట్లనెను :-"స్వామీ! రాజులు దీనతతో నిట్లు నివేదించుకొనిరి :-"శరణాగత .భయ భంజనా! ఈ జరాసంధుఁడు మీాపైఁ బదునెనిమిది సారులు దండెత్తినాఁడు. మీారు పదునేడు సారులీతని నోడించితిరి. పదునెనిమిదవ సారి నరనాట్య మొనర్చుటకై మీారు మధురనుండి పాఱి పోయి ద్వారకలో నివసించు చుండిరి. దీనివలన నాతని గర్వము వృద్ధిపొందినది. నేనును కృష్ణునే ఓడింపఁగా లింక నన్నెవఁడేమి చేయఁగలఁడని యీా తుట్టెపురుగు తలఁచు చున్నాఁడు."

భగవానుఁ డిట్లడిగెను :- "వీరందఱును క్షత్రియులు కదా! వానిమీాఁద నేల దండెత్తఁగూడదు ?"

దూత యిట్లనెను :-"దండెత్తుటెట్లు ? ఆతఁడు మహా బలవంతుఁడు. వానికి పదివేల యేనుఁగుల బలము కలదు. మీారు తప్ప వాని నింకెవరును వశపఱచుకొనఁజాలరు. తనకు కృష్ణుఁడు భయపడి మధురను వీడి, ద్వారకకుఁ బాఱిపోయినాఁడను గర్వముతోఁ దానే విశ్వవిజయుఁడనను గర్వముతో నున్నాఁడు. ఆతని నెదిరింపఁగల రాజెవఁడును. లేఁడు అమేయాత్మా! రాజులుపరమబలవంతుఁ డవును, గాల స్వరూపుఁడవును, సర్వాంతర్యామియును నగు నీ పాదపద్మము

లకు పునఃపునః ప్రణామము లాచరించి యిట్లు నివేదించిరి:- "మీ అవతారము సత్పురుషుల రక్షణకొఱకును, దుష్టుల శిక్షణకొఱకునునై యున్నది. శరణు వేఁడుటకు నీకంటె బల వంతుఁ డీ ప్రపంచమున నింకొకఁడు లేఁడు. మీరుండఁగా నిట్టి కష్టములు మాకు కలుగుటకు గారణము దురూ హ్యముగా నున్నది. మే మెట్టివార మైనను మీ సేవకులము. మేము మిమ్మే మా సర్వస్వమని తలఁచినాము. ఇట్లైనను నాతఁడు మాకు దుఃఖములను గలిగించుట మాదౌర్భాగ్య మని చెప్పవలయును. ఆతఁడు మీ యిచ్ఛకు వ్యతిరేకముగ నడుచుచున్నాఁడు. సర్వసమర్థా! ఇది మాదౌర్భాగ్య మగుచో, దీనిని దుడిచివేయుము. జరాసంధుఁడే మీయాజ్ఞ నుల్లంఘించుచుండినచో వానిని దండించి, శరణాగతులమగు మమ్ము రక్షింపుము.

జగత్తును మిథ్య అనుకొని, అచ్చటనే నన్నుఁజింతించు చుండుఁడని మీరనవచ్చును. అది సత్యమేకాని ప్రభూ! మేము మీమాయలోఁబడి మోహమునఁ బడితిమి. ప్రారబ్ధ కర్మ మమ్ము వివశుల నొనర్చినది. స్వప్న సదృశములగు రాజసుఖముల ననుభవింపవలయునను కోరిక మాకింకను గలదు. ఇప్పుడు మాకింకను బంధువులను బాంధవులను, దారా పుత్రాదులను గలిసికొనవలయునను కోరికకలదు. కాని జరాసంధునకు బంధితులమగుటచే మాకది నెఱవేర

లేదు. మీరు శరణాగతుల దుఃఖములను దూరమొనర్చు వారు. కావున మీరీ జరాసంధునిఁ జంపి మమ్ము బంధము నుండి విడిపింపుఁడు."

సూతుఁడిట్లనెను :- మునులారా! ఇట్లు చెప్పి దూత చివరకు తానిట్లు ప్రార్థించును:- "ప్రభూ! నేను జరాసంధునిచే బంధింపఁబడిన రాజుల సందేశమును మీకు నివేదించితిని. వారు మీరాకకొఱకై యెదురు చూచుచుందురు. మీదర్శనమునకై నిరీక్షించుచున్నారు. మీ కెట్లు ఉచితమని తోచిన నట్లుచేయుఁడు. దీనదుఃఖితులగు వారి దుఃఖములను బోఁగొట్టుమని మీ శ్రీచరణములను బ్రార్థించుచున్నాను. వారిని దీనులనిభావించి, రక్షించి, దేవదుర్లభమగు దర్శనము నొసంగి కృతార్థులనొనర్పుఁడు."

ఈవిధముగఁ బ్రార్థించి దూత కూర్చుండు నంతలో 'రామ కృష్ణ హరి' యని గాన మొనర్చుచు, వీణానినాద మొనర్చుచు నారదుఁ డచ్చటికి వచ్చెను. అతఁడు రామ ముద్రాంకితవస్త్రమును ధరించి యుండెను. పింగళ వర్ణము గల ఆతనిజడ లటునిటు విఱియఁబడెను ముఖమండలమునఁ బరమతేజ ముండెను. ఆతఁడు సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. ఆకస్మికముగ నారదుని రాకను గాంచి అందఱకును బరమవిస్మయము కలిగెను. నానాలోకము లందలి విచిత్రవిషయములను వినవచ్చునని అందఱును గుతూహలపడుచుండిరి.

దేవర్షియగు నారదునిఁ గాంచఁగనే కృష్ణుఁడును, యాదవులందఱును లేచి నిలుచుండిరి. సభాసదు లందఱును, రాజ్యకర్మచారులును, అనుచరులును శిరములనువంచి దేవర్షి చరణములకు నమస్కరించిరి. కూర్చుండుటకై భగవానుఁ డొక సుందరసువర్ణాసనము నొసంగెను. అర్ఘ్య, ఆచమనాదులచే విధ్యుక్తముగఁ బూజించిన తరువాత భగవానుఁ డిట్లనెను :- "నారదా! ఎచ్చటినుండి వచ్చుచున్నారు? మీరు వచ్చి చాలదినములైనది. మే మందఱమును నీ రాకకై కని పెట్టుకొనియున్నాము."

నారదుఁ డిట్లనెను :- "స్వామీ! నాకును నెల్లప్పుడును మిమ్ములను దర్శింపవలయు ననియే యుండును. కాని అదృష్టము కలిగినపుడే దర్శనమగును."

నవ్వుచు భగవానుఁ డిట్లనెను :- "మాకు దర్శన లాభముండనే యున్నది మీరు వచ్చుటచే మాకు త్రిభువన సమాచారము సరళముగ సత్యముగ లభింపఁగలదు. మీకు సర్వత్ర అవ్యాహతగతి కలదు. మీరు త్రిలోకము లందును ఇచ్ఛాను సారముగఁ బర్యటించుచుందురు. త్రిలోకము లందును మీకు దెలియని విషయమేమియును లేదు. ఇప్పుడు మీరెచ్చటనుండి వచ్చుచున్నారో చెప్పుడు."

నారదుఁడు సరళముగ నిట్లనెను :-"స్వామీ! ఈసమయమున నేనింద్రప్రస్థమునుండి వచ్చుచున్నాను."

భగవానుఁ డానందమును బ్రకటించుచు నిట్లనెను :- "చాల సంతోషము. ఇంద్రప్రస్థ మందలి సమాచారమును వినుటకై మేముత్సహించుచున్నాము. మా వారగు పాండవులు క్షేమముగనున్నారా? ధర్మరాజు రాజ్యవ్యవస్థ ఉత్తమముగ నున్నదా? ఈ సమయమున వారేమి చేయఁదలఁచుచున్నారో చెప్పుము?"

ఇదివిని నవ్వుచు నారదుఁడిట్లనెను :- "ప్రభూ! ఇట్టి అమాయకమగు ప్రశ్నను మిమ్ములనెఱుఁగని అజ్ఞానికి వేయవలయును. నాకు మీకర్మములన్నియును దెలియును. అది మీకృపవలననే నాకు లభించినది. మీరు మహామాయావివైతిరి. ఎప్పుడే రూపము కావలసి యుండిన నారూపమును ధరించెదవు. ఒక్కసారి కాదు. నే ననేకసార్లు మీమాయను గాంచితిని. మీరు సర్వగతులరు. కాష్ఠమున నగ్ని యెట్లు వ్యాపించి యున్నదో అట్లంతటను వ్యాపించి యున్నావు. వాయువు ఆకాశము అన్నిట నెట్లు వ్యాపించినదో, అట్లు సర్వాంతర్యాములై యుండియును ఫలానిచోట నేమి జరుగుచున్నది, ఫలానివ్యక్తి యేమి చేయఁదలఁచినాఁడని ప్రశ్నించుట కేవలము నరనాట్యమును జూపించుటకే కాఁగలదు. ఇది మీకు క్రొత్తయేమియును కాదు. మీరు నిత్యమిట్టి యాటనే యాడుచుందురు."

భగవానుఁడిట్లనెను :- "మరేది మాటలాడినను పెద్ద భూమిక నేర్పాటు చేయుదువు. పాండవుల సమాచారము నెఱుఁగవలయునని నాకోరిక."

నవ్వి నారదుఁడిట్లనెను:- "స్వామి! మీరేమి చేయఁ దలఁచితివో యెవ్వరెఱుఁగఁ గలరు. మీరీ మిథ్యాప్రపంచ మును సత్యముగ భాసింపఁజేయుదువు. కావలయు ననిన నిమిషములో సృజించెదవు క్షణముతోఁ బ్రళయము గావించెదవు. నీ కన్నియును దెలియును. కాని మిమ్ము యథార్థ రూపమున నెవ్వరు నెఱుఁగరు. అట్టి అంచిత్య మూర్తియును సర్వేశ్వరుఁడవునగు నీకు నమస్కారము. జీవు లను ముక్తిఁబొందించుటకై నీవనేకావతారముల నెత్తితివి. అట్టి నీమహిమము నెవరు తెలిసికొనఁగలరు? జీవులకు దేహ గేహములం దాత్మబుద్ధికలదు. జీవుఁడనర్థ ప్రవర్తక మగు నీశరీరమునుండి ముక్తినొందు నుపాయయమునుగానక జనన మరణరూపమగు నీ సంసారమున భ్రమించు చున్నాఁడు. ఈతనికి ముక్తిమార్గము తెలియుటలేదు. నీవు అవతార మెత్తి విచిత్రములగు వివిధలీలల నొనర్చుచున్నావు. వాని సుయశము దిగ్దిగంతముల వ్యాప్తమై యున్నది. ఆ సుయశ రూపమగు దీపము నెవఁడు తీసికొనివినుచు నెవఁడు పోవునో వాఁడు మీదగ్గఱకు జేరుకొనును. నీ పాదపద్మములకు పునః పునః ప్రణామములు."

మీ రేదో క్రొత్తలీలలను జేయఁదలఁచి దానిని నా నోటినుండి చెప్పించుటకు జూచుచున్నారు. ప్రపంచములో మీకు దెలియని దేదియును లేదు. కాని యిప్పుడు మీరు నరనాట్య మొనర్చుచున్నారు. మానవలీల ననుకరించుచు, నన్నడుగుచున్నారు కావున నేను జెప్పెదను. ఇంద్రప్రస్థమున మీ మేనత్త కొడుకులు క్షేమముగనే యున్నారు. ధర్మరా జిప్పుడు మిక్కిలి చింతలోఁ బడినాఁడు."

ఉత్సాహమును ప్రకటించుచు భగవానుఁ డిట్లనెను: "ధర్మరాజున కిప్పుడేమి చింత కలిగినది? మునివరా! నీవు కుంతీనందనుఁ డగు ధర్మరాజు చింతనుగూర్చి చెప్పుము."

నారదుఁ డిట్లనెను:-"స్వామీ! ధర్మరాజునకు రాజసూయయాగ మొనర్చి వాసుదేవుని జయింపవలయునని కలదు. కాని దీనిలో నొక కష్టము కలదు."

భగవానుఁ డిట్లనెను :-"ఇందులోఁ గష్టమేమున్నది? రాజసూయ యాగమును జేయవచ్చును."

నారదుఁ డిట్లనెను :-"స్వామీ! మీ కృపయుండిన వారు చేయఁగలరు. కాని రాజసూయయాగమును సమస్త రాజులను జయించినవారే చేయవలసి యుండును. అతఁడు సార్వభౌముఁడై యుండవలయును. ధర్మరాజు నందఱును సార్వభౌమునిగా నంగీకరింపరు. జరాసంధాదులు తామే విశ్వవిజయులమనియుఁ జక్రవర్తుల మనియు భావించుచున్నారు. ఇట్టి

స్థితిలో మీ కృప లేనంతవఱకును, మీరు వారి సంకల్పము నను మోదింపనంతవఱకును రాజసూయయాగము జరుగదు. ముందుగా మీ రింద్రప్రస్థమునకు దయచేయవలయును.”

భగవానుఁడిట్లనెను:-“మునివరా! నేను వచ్చుటచే నచ్చట యేమికాఁగలదు?”

నారదుఁడు ప్రేమాశ్రువిమోచన మొనర్చుచు గద్గద వాక్కులతో నిట్లనెను :-“ప్రభూ! మీ రాకవలననే అంత యును నెఱవేరఁగలదు. మీరు లేకున్న నచ్చట జరుగన దేమియును లేదు: మీ రచ్చటికి వచ్చినచో మీ దర్శనము కొఱకు స్వర్గాదిలోకముల నుండి గొప్ప గొప్ప దేవతలును పృథివియందు మూల మూలలనుండి యశస్వులగు రాజన్యు లును ఇతర ప్రజలును, దేవర్షి, రాజర్షి, బ్రహ్మర్షులును రాఁగలరు కేవలము మీ నామసంకీర్తనము చేతనే, గుణాది శ్రవణము చేతనే చాండాల పర్యంతము పతితు లందఱును పావనము కాఁగలరు. సాక్షాత్తుగ మీ దర్శన, స్పర్శనములు లభించిన నింకఁ జెప్పవలసిన దేమి యుండఁగలదు? విభూ! మీ నిర్మలయశము త్రిభువనము లందును వ్యాపించినది. దశదిశలును మీ యశముచేఁ బరిపూర్ణమైనది. మీ అమల కమల చరణకమల ప్రక్షాళనజలము త్రిలోకములను బవిత్ర మొనర్చుచున్నది. అది స్వర్గమున మందాకినీ పేరుతోడను, పృథివియందు గంగయను నామముతోడను, పాతాళమున

భోగవతీ యను పేరుతోడను ప్రవహించుచుఁ ప్రాణులను బావన మొనరించు చున్నది. మీరాక చేతనే ధర్మరాజు యజ్ఞము పరిపూర్ణము కాఁగలదు. ఇందు సందేహ మేమి యును లేదు. కావున మీ రాలస్యముచేయక ఇంద్రప్రస్థము నకు ప్రస్థాన మొనర్పుఁడు.''

ఇది విని భగవానుఁ డిట్లనెను :- ''ఈ సమయమున మిక్కిలి ధర్మసంకటము వచ్చిపడిన దే. ఒకప్రక్క జరాసంధుఁడు బంధించిన రాజుల ప్రార్థనము కలదు. శరణాగతులను రక్షించుట ధర్మము. ఇంకొకప్రక్క పాండవులు నాకు సుహృదులు. సంబంధులు. మాననీయులు. వారికి సహాయ మొనర్చుట యును, వారి కోరికను నేరవేర్ప వలసిన పరీక్ష యున్నది. ఈ రెండుపనులలో నేను ముందేమి పని చేయవలెను ? నారదుఁడు ముందుగా నింద్రప్రస్థమునకు రమ్మని నారదుఁ డనుచున్నాఁడు. బంధితులగు రాజులు ముందుగా జరాసంధుని హతమార్చి వారిని బంధవిముక్తుల జేయవలయునని కోరుచుండిరి. ఇందులో ముందుగా నేకార్యమును నెఱవేర్పవలయును ?''

భగవానుని వాక్యములను విని ఆవేశమున యువకులగు యాదవులిట్లనిరి :- ''స్వామీ ! మునుముందుగా జరసంధునిపై దండెత్తవలయును. యుద్ధము అవసరమైనపుడు దానిని జారవిడుచుట క్షాత్ర ధర్మము కాదు. యుద్ధకుఁడు

తిచే మాచేశులు బాధపడుచున్నవి. శరణాగతులను రక్షించుట ప్రథమ ధర్మము. ఈ యజ్ఞయాగాదులు జరుగుచునే యుండును. మా అందఱ అభిప్రాయము ముందుగా మగధపై దండెత్తుటయే. జరాసంధుని ముందు జయింప వలెను.''

ఇది విని భగవానుఁడు గంభీరుఁడై నారదునితో నిట్లనెను :- 'నారదా! నీవేమి చెప్పెదవు?''

నారదుఁడిట్లనెను: ''స్వామీ! నేనేమి చెప్పఁగలను? మీరేమి చేయఁదలచితిరో దానినే చేయుదురు. మీరిట్లడిగి అందఱకును గౌరవమును గలిగించుచున్నారు. నేనిదివఱకే నివేదించితిని. భక్తుల కోరికను మొదట నెఱవేర్పవలయును. పాండవులు మీ కనన్య భక్తులు. వారికేకైకాశ్రయము మీరే వారి కోరికను నెఱవేర్చుట మీకు పరమ ధర్మము, ప్రథమ కర్తవ్యము. తరువాత మీ యిష్టము ''

ఇది విని భగవానుఁడు తనలోఁ దానిట్లనుకొనెను :- ''యాదవ యువకులందఱును యుద్ధమున కుత్సహించుచున్నారు. వారి పట్టుదల ముందుగా జరాసంధునిపై దండెత్త వలయునని. ముందుగా ధర్మరాజుని యజ్ఞమునకు వచ్చి, వారికి సహాయమొసర్పుమని నారదుఁడనుచున్నాఁడు. నా బుద్ధి పనిచేయుట లేదు. నేను చిక్కులోఁ బడితిని: నాకు ఉద్ధవుఁడు మంత్రి. అతఁడే నిర్ణయమొనర్చిన దానిని సభనమందఱమును వాద వివాదము లేకయే అంగీక

రింపవలయును.'' అని పలికి భగవానుఁడుద్ధవునితో నిట్లనెను :-''ఉద్ధవా! నీవు మాకు సుహృదుఁడవు, మంత్రివి, సర్వస్వమును నీవే. మేమిట్టి చిక్కులలోఁబడి మార్గము తప్పినప్పుడు నీవు జ్ఞానాలోకమును జూపించి మమ్ము సన్మార్గమునకు దీసికొని వచ్చుచుందువు. నీకు పదార్థములు యథార్థముగఁగనఁబడుచుండుటచే నీవు మాకు యథార్థమగు చక్షువవు. నీవు శుభసమ్మతి నొసంగుటలోఁ గుశలుఁడవు. ఇప్పుడు మేమేమి చేయవలయునో నీవే నిర్ణయింపుము. ముందుగా నింద్రప్రస్థమునకుఁ బోవలయునా లేక మగధ మీఁదకు దండెత్తి జరాసంధునిచే బంధింపఁబడిన రాజులను విడిపింపవలయునా? నీవే యభిప్రాయమును వెలువరించిన మేము నను నచయనిపలుకక దాని నంగీకరించెదము. నీవు నీనిర్ణయమును జెప్పుము. ఈసమయమున నీ సలహా తప్ప మాకు వేరుగతి లేదు. నీమీఁద నందఱకును విశ్వాసము కలదు. మా యాదవులందఱిలో నధికబుద్ధి మంతుఁడవు నీవే. కులము వారందఱును నిన్నాదరించుచుండెదరు. నారదుఁడును నీమాట కంగీకరించును. నీ నిర్ణయము సర్వసమ్మతము కాఁగలదు.''

సూతుఁడిట్లనెను :-''మునులారా! భగవానుని నోటనిట్టి ప్రశంసను విని ఉద్ధవుఁడత్యంత లజ్జితుఁడయ్యెను. సర్వజ్ఞుఁడగు భగవానుఁడు తెలియని బాలునివలెను, అజ్ఞుని

యునా ? లేక జరాసంధునిచే బంధింపఁబడిన రాజులను విడిపించుటకుఁ బోవలయునా అని అడుగగా నిరుపక్షములవారి వేఱువేఱు భావములను దెలిసికొని ఉద్ధవుఁడు కొంచెము సేపాలోచించెను ఆతఁడిట్లనుకొనెను:-"ఈ యాదవులుజరా సంధునితో యుద్ధమును జేయవలయు ననుచున్నారు. ఇది వీరికి పై ఆవేశమే తప్ప వేఱుకాదు. భావుకరావశయున వీరు పోరాడఁ గోరుచున్నారు. జరాసంధునితోఁ బోరాడిన, నప్పుడు వారి బలము బయట పడఁగలదు. నారదుఁడు చెప్పినది దూరమాలోచించి చెప్పుచున్నాఁడు. ఆతఁడు దూరమాలోచించును. వ్యర్థముగ నావేశమును జెందఁడు."

ఈవిధముగ నిరువైపులను బలాబలములను గాంచి యుద్ధవుఁడు చేతులను జోడించుకొని గంభీరముగ నిట్లనెను:- "స్వామీ ! మీరునన్నడిగినారు కావునఁ జెప్పుచున్నాను. మీరు నారదుఁడు చెప్పినట్లు రాజసూయ యాగమునకు మీ మేనత్త కొడుకులగు పాండవులకు సహాయమొనర్పఁ బొమ్ము.

భగవానుఁడిట్లనెను:-"ఉద్ధవా ! నీవెట్లు నిర్ణయించిన నట్లే చేసెదను. కాని శాస్త్రకారులు శరణాగత రక్షణము పరమ ధర్మమని చెప్పిరి. శక్తి యుండియును శరణాగతులను రక్షింపక, వారినిఁ బరిత్యజించినచో, నాతఁడు ఘోర కౌర వాది నరకములఁ బడునని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. అట్టి

యెడ నీవు యజ్ఞమునకు బోవ్మని యేల చెప్పుచున్నావు? యజ్ఞమింకను నారంభము కాలేదు. ఇది కేవలము ధర్మ రాజు ఆలోచనలోనే యున్నది. అది పదిరోజులైన తరువా తను జరుగవచ్చును. నీవు రాజులను విడిపించుటకు ప్రాథా న్యత యేల యీయలేదు?"

అంత నుద్ధవుఁడిట్లు నెను:-"స్వామీ! మీరు మనుష్య దృష్టిచే నన్నుఁ బ్రశ్నించితిరి. ఆదృష్టితోడనే నేను విచారణ చేయుచున్నాను. మీరు సర్వ సమర్థులరు. మీసంకల్ప మాత్రముచేతనే సమస్తమును జేయఁగలరు. శరణాగత రక్షణము పరమధర్మమని నేనంగీకరించెదను. కాని స్వామీ! జరాసంధుని దుర్గమునుండి రాజులను విడిపించుట గుటుక్కున మ్రింగుటకు బెల్లపులడ్డు కాదు. ఆతని జయించుట సింహము నోటిలోని దంతముల మధ్యనున్న నాలుకను లాగినట్లే చాల కష్టమైన కార్యము. ఈయాదవ యువకు లనుభవశూన్యులు. వీరావేశమునఁ బలుకుచున్నారు. యుద్ధము చేయవలయునని, ఆతనితో యుద్ధమొనర్చుట సామాన్యపు విషయము కాదు. ఒక్క జరాసంధునిలోనే పదివేల యేనుఁగుల బలముకలదు. వీని వద్ద నఖండ సైన్యము కలదు. వేలకొలఁది రాజులు కలిసి వచ్చినను వీనిని జయించుట చాలకష్టము. కావున నాతనితో యుద్ధమొనర్ప నుంకించుట తెలివి తక్కువ తనమే."

భగవానుఁ డిట్లనెను :—"అట్లైన శరణాగతరక్షణము జరుగదుగదా!"

ఉద్ధవుఁ డిట్లనెను :—"ఎందులకు జరుగదు స్వామీ! ఇంద్రప్రస్థమునకు బోయినచో రెండు పనులును గాఁగలవు. బంధితులగు రాజులును విడువఁబడెదరు, యజ్ఞకార్యమును నెఱవేరఁగలదు."

భగవానుఁ డిట్లనెను :—"అదెట్లు?"

ఉద్ధవుఁ డిట్లనెను :—"అదెట్లనఁగా రాజసూయయాగమును సామాన్యపు రాజు చేయఁజాలఁడు. చంద్రుఁడును, వరుణుఁడును, హరిశ్చంద్రుఁడును మాత్రమే యీయాగమును జేసినారఁట. దిగ్విజయము సల్పి, రాజులందఱను దనవశ మొనర్చుకొని, చక్రవర్తియై రాజసూయమును జేయవలయును. యజ్ఞమునకు ముందు సర్వక్షత్రియులను జయింపవలయును. అప్పుడు జరాసంధుని గూడ జయింపవలసియుండును. జరాసంధుని జయించిన బంధితులగు రాజులను సహజముగ విడిపింపవచ్చును. ఈ విధముగ యజ్ఞమునకుఁ బోవుటచే రెండు కార్యములును నొక్కసారిగా నెఱవేరఁగలవు. ఒక్కదానితో రెండుపనులును నెఱవేరవలయును. సర్పము చావవలయును, కఱ్ఱవిఱుఁగరాదు తర్పణమును జరుగవలయును, వృక్షమునకు నీరును నందవలయును."

అంత శౌనకుఁ డిట్లనెను :- "సూతా! తర్పణమును జరుగవలెను. వృక్షమునకును నీరందవలెననిన నేమి? దీని అర్థమును జెప్పవలయును."

సూతుఁ డిట్లనెను :-"స్వామీ! గయ సమీపమున నొకముని యుండెడువాఁడు. ఆతని ఆశ్రమము పెద్దది. మునికి వృక్షములను నాటు వ్యసనము కలదు. అతఁడు క్రొత్త క్రొత్త మామిడిచెట్లను వేసెను. వృక్షములకు నీరవసరము. సంధ్యాతర్పణములను జేయుటయును నవసరమే. మూఁడు వేళలందును నాతఁడు సంధ్యావందన మొనర్చును. అందు వలన నాతఁడు కుండనిండ నీటినిఁ దెచ్చి చెట్లబోదెలలోఁ గుళలచే జలమును జిలుకును, తర్పణమును జేయును. ఒక్క దానితో రెండు పను లగును. ఇదేవిధముగ నింద్రప్రస్థము నకుఁ బోవుటచే యజ్ఞకర్మయును జరుగును, శరణాగతరక్షణ మును జరుగునని ఉద్ధవుఁడు వచించెను."

శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! తరువాత నేమైనది?'

సూతుఁ డిట్లనెను :- "స్వామీ! ఉద్ధవుని వాక్యము లను విని భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! నీవు యుక్తి యుక్తముగఁ బలికితివి. కాని జరాసంధుని వద్ద గొప్ప సేన కలదనియు, యుద్ధములో నాతని నెవరును జయింపఁజాల రనియు నీ వంటివి. ఆతఁడు జయింపఁబడకుండిన యజ్ఞమును జరుగదు, శరణాగత రక్షణయును జరుగదుకదా! అట్టియెడ నింద్రప్రస్థమునకుఁ బోవుట వ్యర్థము కదా!"

ఉద్ధవుఁ డిట్లనెను:-"స్వామీ! దాని నిప్పుడును నేను జెప్పుచున్నాను. మీరు తలఁచుకొనిన నంతయును జేయఁ గలరు కాని మనుష్యదృష్టిచే వాని నెవరును బోరి జయింపఁ జాలరు. ఆతఁడు మోసముచే జయింపఁ బడును. ఆతని జయించుట కొక్కటే యుక్తి కలదు."

భగవానుఁ డిట్లడిగెను :-"అదేమి యుక్తి"

ఉద్ధవుఁ డిట్లనెను :-"నేను పెద్దలవలన జరాసంధుఁడు భీమసేనునిచేఁ జావఁగలఁడని నేను వినియుంటిని. భీమసేను నకును బదివేల యేనుఁగుల బలము కలదు; కాని కళాకౌశల మందును, బుద్ధిమత్త్వమునందును జరాసంధుఁడే భీమసేనుని కంటె గొప్పవాఁడు కావున భీమసేనుఁ డొంటరిగా జరా సంధుని జయింపఁజాలడు. మీ బుద్ధియును, భీమసేనుని బల మును గలిసినచో, వాఁడు నిమిషములో జయింపఁబడఁ గలఁడు. మీరు సేనను దీసికొని పోరాదు. మీ రొంటరిగాఁ బోయి కపటముగ నాతని ద్వంద్వ యుద్ధమున కాహ్వా నింపుఁడు."

భగవానుఁ డిట్లనెను :-"ఆతఁడు మాతో ద్వంద్వ యుద్ధ మొనర్ప నెట్లంగీకరింపఁగలఁడు?"

ఉద్ధవుఁడిట్లనెను:-"వాఁ డంగీకరించును. మీరు కప టముగ నడుగవలెను. మీరును, నర్జునుఁడుఁను. భీమసేనుఁ డును గపట బ్రాహ్మణవేషములను ధరించి ఆతని కడకు

బోవలయును. అతఁడు గొప్ప బ్రాహ్మణ భక్తుడు. బ్రాహ్మణుఁడేది అడిగిన దాని నొసంగును. భీమసేనుఁడు బ్రాహ్మణుఁడై యుద్ధ భిక్షనడుగవలయును. బ్రాహ్మణుఁ డగిన దాని నాతఁడు కాదనఁడు. ఆతఁడంగీకరించినచో, మీ సహాయముతో ద్వంద్వయుద్ధమందు వాని నవశ్యము చంపఁగలఁడు. ఇందు సందేహ మణుమాత్రమైన లేదు. మీరే యీ జగత్తునకు ప్రభువులరు. మీచేతినే యీ జగత్తు పుట్టినది. బ్రహ్మయును, శివుఁడును, కేవలము నిమిత్త మాత్రులే. వానినిఁ జంపిన మీరే చంపవలెను. ఇందులో భీమసేనుఁడు నిమిత్తమాత్రమే.

జరాసంధుఁడు చావఁగానే రాజులందఱును బంధ విముక్తులు కాఁగలరు. నీ యశము దిగ్దిగంతముల వ్యాపింప గలదు. రాజులు విడుదలై తమ తమ నగరములకు బోఁగానే వారిస్త్రీలు తమ పిల్లలతో నిట్లనఁగలరు:-"మీ తండ్రిని భగవానుఁడు రక్షించినాఁడు. ఆతఁడే వీరిని బంధనమునుండి విడిపించినాఁడు. కాకున్న మనమందఱము ననాథలమయ్యెడు వారమే. దుష్టుఁడగు జరాసంధుఁడు మీతండ్రినిఁ బట్టుకొని పోయినాఁడు. భక్త భయహారియగు భగవానుఁడా దుష్టునిఁ జంపి, ఆతని కారాగృహమునుండి అందఱను విడిపించి నాఁడు."

ఈ విధముగ వ్రజమండల మందువలె సర్వత్ర నీగుణ గానము జరుగఁగలదు. వ్రజమందు నీ వనేక సమయము

లందు రక్షించితివి. శంఖచూడుఁడను దైత్యుఁడు గోపికలను దీసికొని పోయినాఁడు. ఆ దుష్టదైత్యుని నీవు చంపి వారని రక్షించితివి. గజరాజును మకరి పట్టినప్పుడది ప్రార్థింపఁగా హరిరూపమున నీవువచ్చి, ఆ మొసలి తలనుద్రుంచి రక్షించితివి. సీతను రావణాసురుఁడు హరింపఁగా రామావతారమందు లంకకుఁబోయి, రాక్షసులను జంపి, నీ వా జానకిని రక్షించితివి. యాదవులమందఱును గంసుని అత్యాచారములచే, నత్యంత దుఃఖమును జెందఁగా దేవకీ వసుదేవు లత్యంత వ్యాకులమును జెందిరి. అప్పుడు మీరు వ్రజమునకు వచ్చి, కంసునిఁ జంపి మమ్ముల నందఱను రక్షించితివి. ఈ విషయముల నన్నిటిని ఋషులును, మునులును, విజ్ఞజనులునుగానముచేయునట్లును కథావాచకగణ మీ ప్రసంగ కథలను జెప్పునట్లును జరాసంధుఁడు చంపఁబడఁగా రాజులకు జరిగిన ముక్తి కథ ఇంటింటను వ్యాపింపఁగలదు. సర్వత్ర యశోగానము జరుగును. ఒక్క జరాసంధుఁడు చచ్చినచో, మీ శరణాగత రక్షణయును జరుగఁగలదు. యుధిష్ఠిరుని అభిలాషయును దీరును. రాజసూయ యజ్ఞ మహోత్సవమును జరుగఁగలదు. మీ యశో విస్తారమును గాఁగలదు. లోకులు మీ గుణగానమొనర్చి వాక్కును పవిత్ర మొనర్చుకొందురు. వినువారి శ్రోత్రములు పవిత్రములు కాఁగలవు దేవతలకు హవిస్సులభింపఁగలదు.

ఈ విధముగ ననేక లాభములు కలుగును. ముందుగా వీ
రింద్రప్రస్థమునకుఁ బోవలయునని నాముఖ్యమగు నభిలాష.
ధర్మరాజును సంతోషపెట్టుము. శరణాగత రక్షణము
యజ్ఞమునకు ముందే జరుగఁగూడదు?

సూతుఁ డిట్లనెను :-"మునులారా! తర్కపూర్ణములును, యుక్తియుక్తములు నగు నుద్ధవుని మాటలను దేవర్షియగు నారదుఁడును, ఉగ్రసేనుఁడును, వసుదేవుఁడును, అక్రూరుఁడును, వయోవృద్ధులగు నితర యాదవులును హృదయపూర్వకముగ సమర్థించిరి. అందఱ కిష్టమగుటచే భగవానుఁడు పెద్దలకడను, వృద్ధులకడను, గురుజనులకడను ననుమతినిఁ దీసికొని, ఇంద్రప్రస్థమునకుఁ బోవుటకై సిద్ధపడవలసినదని సేవకుల నాజ్ఞాపించెను. ఆతఁడెట్లు ఇంద్రప్రస్థమునకుఁబోయినది చెప్పెద నాలకింపుఁడు."



## ఇంద్రప్రస్థమునకు గృష్ణుని ప్రస్థానము.

శ్లో॥ అథో మునిర్యదుపతినా సభాజితః
ప్రణమ్య తం హృది విదధద్విహాయసా ।
నిశమ్య తద్వ్యవసిత మాహృతార్హణో
ముకుంద సందర్శన నిర్వృతేంద్రియః॥

శ్రీభాగ. ౧౦స్కం ౭౧అ. ౧౯శ్లో.

క॥ నారదముని మాధవుఁడు స
త్కారంబున వీడుకొలుప నతఁడును హృదయాం
భోరుహమునఁ గృష్ణునకును
వారక మ్రొక్కుచును వెస దివంబున కరిగెన్॥

క॥ నరవరుల దూతయును ముర
హరుచే నభయ ప్రదాన మంది ధరిత్రీ
వరుల కడ కేగి పద్మో
దరు వచనము సెప్పి సమ్మదంబునఁ దేల్చెన్॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

ధ్యాన చింతనము లేకాంతమున నేకాకిగా నుండి చేయుట చేతనే సుఖములభించును. ప్రేమాలాపము ఇద్ద ఱతో జరుగును. అప్పుడు హృదయమును దెఱచియే ప్రేమా గాపము నొనర్చెదరు. యాత్ర మిక్కిలి అనుకూలురగు నుచరులతో సుఖప్రదముగ నుండును. వెంట ననుకూలు గు ననుచరులుండి, యాత్రకు సంబంధించిన వస్తువులన్నియు ండి, సవ్వులాటకు సంబంధించిన నేర్పాటు లన్నియునుండి చో, యాత్రమిక్కిలి సుఖప్రదముగ నుండును. అట్టి యాత్రయొక్క మధురస్మృతి శాశ్వతముగ హృదయమున ంకితమగును అట్టియాత్రలో నసౌకర్యములుండినను సుఖ ములుగనే యుండును. తన యింటి యందలి పిల్లలును, స్త్రీలును, ఇతర దాసదాసీజనములును వెంటనుండినచో

నప్పుడా యాత్ర మిక్కిలి సరసముగ నైపోవును. ఇట్టియాత్ర భాగ్యశాలురకే ప్రాప్తించును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! దేవర్షియగు నారదుఁడు భగవానుఁ డింద్రప్రస్థమునకుఁ బోవుచున్నాఁడను సంకల్పమును దెలిసికొని సంతోషముతో వెడలిపోఁగా, బంధితులగు రాజుల దూతయును భగవదాజ్ఞచే మగధ దేశమునకుఁబోయెను. అప్పుడు భగవానుఁడు రాజసభనుండి అంతఃపురమునకు వచ్చెను. భగవానుఁ డింద్రప్రస్థమునకుఁ బోవుచున్నాఁడని రుక్మిణీదేవి విని యిట్లడిగెను :- "స్వామీ! ఇంద్రప్రస్థమున కెప్పుడు వెడలెదరు ? సత్యభామ వెంట వచ్చునా ?"

భగవానుఁడిట్లనెను :- "సత్యభామ వచ్చుచున్నదా! అనుచున్నావు. నీవు రావా యేమి?"

కపట శిష్టాచారముతో రుక్మిణి యిట్లనెను :- "నాథా! నన్నెవరు రమ్మందురు ? మీరు యుద్ధమునకుఁ బోవునపుడును నెవతెను దీసికొని పోవుటను మఱవలేదో, స్వర్గమునకును నెవతెను దీసికొని పోయితిరో, ఎవతె యింటిలోఁ గల్పవృక్షమును నాటితిరో, ఆమెయే యింద్రప్రస్థమునకు రాఁగలదు. నాకొఱకామె దగ్గఱ ననుమతినిఁ బడసితిరా? "

ఇది విని భగవానుఁడు పకపక నవ్వి యిట్లనెను :- "తగాదాలతో నీకేమిపని. నీవందఱికంటె పెద్దరాణివి. పట్టపు

రాణివికదా! ప్రధానమైన కార్యములకు నిన్నే తీసికొనిపోవు చుందును. ఏదైనా యజ్ఞయాగాదు లొనర్చినఁ గేవలము మనమిద్దరమే కొంగులను ముడివైచుకొని కూర్చుండ వల యును. ఇతర రాణులకీయధికార మెక్కడిది? ఇంద్రప్రస్థమున నీవు లేకపని జరుగనే జరుగదు. అచ్చటఁ జూడవలసిన దంత యును నీవే. తాళపుచేతులగుత్తిని బొడ్డులో దోపుకొని అటు నిటు దిరుగుటయును, అచ్చట ఆజ్ఞల నొసంగుటయును నీవే. అందఱును నిన్నడిగియే పనులను జేసెదరు ?

తన ఆనందమును లోలోన నింపుకొనుచు రుక్మిణి యిట్లనెను :- "కానిండు. బులి బుచ్చికములు ముఖప్రీతి మాటలు పలుకుట మీకు బాగుగాఁ దెలియును."

భగవానుఁడు గంభీరముగ నిట్లనెను :- "నవ్వు మాటలు కాదు. ఇంద్రప్రస్థమునకు నీవు వచ్చి తీర వలసినదే".

ఇంకేమున్నది. గ్రుడ్డికి గావలసినది రెండు కన్నులే కదా! రుక్మిణీదేవి దీనినే కోరుకొనుచుండెను. ఆమె వెంటనే లోపలికిఁపోయినది. దాసీలను గసరచుఁ దొందఱచేయుచుఁ గ్రొత్తక్రొత్త వస్త్రములను బెట్టెలనిండి నింపుచుండెను. ఆభరణములను జిన్నపెట్టెలలోఁ బెట్టుచుండెను. సింధూరపు డబ్బి, కాటుక బరిణ, బొట్టుబరిణ, వాసన తలనూనె, పెద వుల గోళ్ళరంగు, దువ్వెన, అగరు మొదలగునవి, చందన

ద్రవ్యములు, నలుగు దినుసులు, సవరము, అంగరాగము, వేయేల సౌభాగ్యకరములగు వస్తువులెన్నికలవో, వాని నన్నిటినిఁ బెట్టెలలోఁ బెట్టుకొనెను. ఈ సమాచార మంత యును సర్వత్ర వ్యాపించెను. సత్యభామ, జాంబవతి, కాళిందీ, నాగ్నజితి మొదలగు వారడుగ నారంభించిరి :- "నాథా! పెద్దరాణులేనా యింద్రప్రస్థమునకుఁ బ్రయాణము? చిన్నరాణులకును కలదా ?"

భగవానుఁ డిట్లనెను :- "చిన్నేమి పెద్దేమి. చేతి లోని వ్రేళ్ళన్నియును ముఖ్యములే. చూచుటకుఁ జిన్నయేమి పెద్దయేమి ? అడుగు లెందులకు ? బయలు దేరుఁడు."

ఇది విని అందఱును సిద్ధపడుచుండిరి.

అష్టమహిషలు సిద్ధపడుటను గాంచి పదునాఱువేల నూఱుగురును నిట్లనిరి :- "స్వామీ ! యజ్ఞమునకు రావలసి నది రాణులేనా లేక దాసీలుకూడానా ?"

భగవానుఁ డిట్లనెను:- "మీకెందఱు దాసీలు కలరో వారినందఱను వెంటఁదీసికొనిరండు."

వారందఱిట్లనిరి :- "స్వామీ ! మేమందఱమును దాసీలమే మాకును యజ్ఞమును గాంచు భాగ్యము సంభ వించినచో నది మా అదృష్టము."

భగవానుఁ డిట్లనెను:-"మీరు సర్వశ్రేష్ఠలగు రాణులు. సపరివారముగను వైభవముగను బయలు దేఱుఁడు."

ఇంకేమున్నది? సర్వత్ర యాత్రావృత్తాంతమే. పల్లకీల తోడను, రథములతోడను ద్వార ప్రదేశమంతయును నిండి పోయెను. పెద్ద పెద్ద పిల్లలు రథములమీఁదఁ గూర్చుండిరి. వారివెంట వారి సంరక్షకులును, సేవకులు గూర్చుండిరి. పాలు త్రాగు చిన్న చిన్న పిల్లలు తమ తల్లులతో, బాలకీలలోఁ గూర్చుండిరి. రక్షకులచేఁ బరివేష్టింపఁబడినఁ బాలకీలను, పిల్లలరథములను సేనాసహితముగ ముందు నడువవలసినదని కృష్ణుఁడాజ్ఞాపించెను. అందఱును బయలుదేరఁగా భగవానుఁడు తన ప్రయాణమునకు స్వస్త్యయనము గావింపఁ జేసెను. ఇంతలోనే గరుడధ్వజముగల రథము నలంకరించుకొని దారుకుఁడు తెచ్చెను. భగవానుఁడు వృద్ధబ్రాహ్మణులకుఁ బ్రణామమును కావించి తన తండ్రియగు వసుదేవుని కడను, బలరాముని దగ్గఱను, ఇతర వృద్ధయాదవులదగ్గఱను నాజ్ఞను దీసికొని భగవానుఁడు రథముపై గూర్చుండెను. నలువైపులను మృదంగ, భేరీ, ఆనక, పణవ, శంఖ, ఘంటా గోముఖాది మంగళ వాద్యముల ధ్వని చెలరేగెను. వాద్యముల యొక్క సుమధుర ధ్వనిచే దశదిశలు ప్రతిధ్వనించుచుండెను. రథ, గజ, తురగ, పదాతిసైన్యముచే శ్యామసుందరుఁడు పరివేష్టింపఁబడెను. ముందునకుఁబోయి సేనాపతి సేననాపి, పాలకీలను మార్గమున కొక ప్రక్కకు నుంపించెను.

ముందు శ్యామసుందరుఁడు పోవలయును, తరువాత పాలకీలును, సైనికులును బోవలయునని ఆజ్ఞాపించెను.

అందఱును పంక్తిబద్ధముగ నిలుచుండుటను గాంచి దారుకుఁడు రథము నస్నిటికంటె ముందునకుఁ బెట్టెను. భగవానుని రథము ముందుపోవుచుండెను. దానికి నలు వైపులను బెద్దగానుండి బలిసిన గుఱ్ఱములపై నెక్కి అశ్వ సైనికులు బల్లెములను, బింఉీవాలములను దీసికొని పోవు చుండిరి. భగవానుని వెనుక తమ బిడ్డలను వెంటఁబెట్టుకొని సువర్ణమండిత శిబికలయందు గూర్చుండి వస్త్రాభూషణ, చందన, సుగంధమాలలచే నలంకృతలై పతివ్రతలగు భగ వానుని పత్నులు వచ్చుచుండిరి. ఆ శిబికలకు నలువైపులను డాలును, ఖడ్గములను ధరించిన సైనికులు నడచుచుండిరి.

వారి వెనుక సూత, మాగధ, వంది, నట, నర్త కాదులు సపరివారముగ నడుచుచుండిరి. దాసదాసీజనములు తమ సామానులను బండ్లపై వేసికొని వెడలుచుండరి. సేవకుల యొక్క గొంగళ్ళను, బొంతలును, బాత్రలను బండ్లలో వైచిరి. నట, నర్తకాదులయొక్క వాద్యాదులును వెంట వచ్చుచుండెను. వారి భార్యలు ముక్కులకు ముక్కెరలను ధరించి యెద్దు బండ్లలోఁ బాడుచుఁ బోవుచుండిరి. పెద్దవా రును, వృద్ధులును గొందఱు ఒంటెలమీఁద నెక్కిరి. నౌబత్తు, నగారాది వాద్యములు ఒంటెలమీఁదను, గుఱ్ఱములమీఁదను

▲

బోవుచుండెను. కొంత సామాను గాడిదెలమీఁదను, కంచర గాడిదలమీఁదను, ఒంటెలమీఁదను బోవుచుండెను. సైనికు లుత్సాహముతోడ గుఱ్ఱములనాడించుచును, రథములను బరువెత్తించుచును బోవుచుండిరి. ధ్వజపతాకాదులను, అస్త్రశస్త్రములను, ఛత్రచామరములనుబట్టుకొని రాజకుమారులా సేనకు శోభను గలిగించుచుండిరి. తుపాను వచ్చినపుడు సముద్రము రంగుల రంగుల మత్స్య, మకరాది జలజంతువులచే శోభించునట్లు ఆభూషణ, కిరీట, ముకుట, కవచ, ఉత్తమాస్త్రశస్త్రములచే సుశోభితులై సేనాసమూహము శోభించుచుండెను.

భగవానుఁడింద్రప్రస్థమునకుఁ బోవుటనుగాంచి బంధితులగు రాజులదూత గబగబ పరువిడి భగవానుని కడకు వచ్చి, చేతులను జోడించుకొని యిట్లనెను :- "ప్రభూ! నేనాబంధితులగు రాజులకేమని చెప్పుదును? మీరింద్రప్రస్థమునకుఁ బోవుచున్నారుకదా!"

ఇదివిని భగవానుఁ డిట్లనెను :- "ఓయీ! నీతోఁ జెప్పితిని కదా! ఇంద్రప్రస్థమునకుఁ బోవుటయును వారి కార్యము కొఱకే. వారిని భయపడవలదని చెప్పుము. నిర్భయులై యుండవచ్చును. ఇంతవఱకు దుఃఖముతో దినములు గడపిరి. ఇంకఁ గొన్నిదినములు గడుపుఁడని చెప్పుము. నేనవిలంబముగ జరాసంధుని హతమార్పించి, వారినిబంధము

నుండి విడిపించెదను. సమయము రాఁగానే నే నంతయును జేసెదను. కార్యములన్నియును గాలము వచ్చినగాని నెఱవేఱవు. అసమయమునఁ బనులు నెఱవేఱవు."

దూత యిట్లనెను :- "సరేస్వామీ! మీయాజ్ఞప్రకారమే చేయుదును. దానినే నేను బోయి వారందఱకును జెప్పెదను."

ఇట్లుపలికి ఆతఁడు మరల ప్రభు పాదపద్మములకుఁ బ్రణామమును గావించి మగధదేశమునకుఁ బోయెను. అచ్చటికిఁబోయి అతఁడు రహస్యముగ నేకాంతమున రాజులందఱకును నిట్లుచెప్పెను :- "భగవానుఁడు మీ వృత్తాంతమునంతను దెలిసికొనినాఁడు. ఆతఁడిట్లుచెప్పెను:-"నేనుశీఘ్రముగనే వచ్చి జరాసంధునిఁ జంపి, మిమ్ములను బంధమునుండి విడిపించెదను. మీ దుఃఖమును బోఁగొట్టెదను. మీరందఱును నిశ్చింతులైయుండుఁడు."

భగవానుని సందేశమును బొంది అందఱును బంధితులగు నృపతిగణము పరమ ప్రముదితులైరి. వారత్యంతోత్కంఠతతో బంధవిముక్తులు కావలయునను గోరికతోడను తమ జీవితములను ధన్యములొనర్చుకొను కోరికతోడను భగవదాగమనమునకుఁ బ్రతీక్షించుచుండిరి.

సూతుఁడిట్లనెను :-"మునులారా! ఇచ్చట భగవానుఁ డచ్చటచ్చట విశ్రాంతినిఁ దీసికొనుచు నింద్రప్రస్థము

నకుఁ బోవుచుండెను. ఎచ్చటనిలిచినను నచ్చటి రాజులు వచ్చి భగవానునకు స్వాగత సత్కారముల నొనరించుచుండిరి. భగవానునిఁ బూజించుచుండిరి. ఆతనిఁ దమరాజధానికి రమ్మని ప్రార్థించుచుండిరి. రాజధాని దగ్గఱగనుండినచో నచ్చటికిబోయి వారి నానందపఱచుచుండెను. దూరమైనచో మరల వచ్చెదనని వారి నాశ్వాసించి పోవుచుండెను. ఈ విధముగ నాతఁడానర్త సౌవీర, మరుప్రదేశ, మత్స్య, పాంచాల, కురుక్షేత్రాది సమృద్ధిగల దేశములను నద, నదీ, పర్వత, పుర, గ్రామ, వ్రజ, ఖేట, ఖర్వట, వనాదులను దాటుచు సరస్వతీ నదిని దాటి ఇంద్రప్రస్థ సమీపమునకుఁ జేరుకొనెను. ఇప్పుడిఁక, పాండవులు పరమాత్మ కెట్లు స్వాగతసత్కారము లొనర్చినదియు మీకుఁ జెప్పెదను. సావధానులరై శ్రవణమొనర్పుఁడు.”

---

## పాండవులు వాసుదేవుని సత్కరించుట

శ్లో॥ దోర్భ్యాం పరిష్వజ్య రమామలాలయమ్
మకుంద గాత్రం నృపతిర్హతాశుభః
లేభే పరాం నిర్వృతి మశ్రులోచనో
హృష్యత్తనుర్విస్మృత లోక విభ్రమః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౭౧ అ. ౨౬ శ్లో॥

వ॥ "రాజా! ధర్మరాజు లక్ష్మీదేవికి పరమాశ్రయమగు శ్రీకృష్ణుని జగన్మోహన మంగళమయ విగ్రహమును దన రెండు భుజములచే నాలింగన మొనర్చుకొనెను. భగవానుని ఆలింగనమున నాతని సమస్తాశుభములు నశించెను, పరమానంద ప్రాప్తియును గలిగెను. ఆతని కన్నులయం దశ్రువులు నిండెను. శరీరము పులకించెను. ఆతఁడానందముచే సమస్త ప్రపంచమును మఱచెను."

—శ్రీమదాంధ్ర భాగవతము॥

మనకు ప్రియమైన వాఁడు వచ్చినచో మనకు శరీరమంతయును బులకరించును. హృదయమునకు విచిత్ర స్థితి కలుగును. కన్నులాతని జూచనమొనర్తుమా యని కోరుకొనును. నాలుక ఆతనిఁ జప్పరింతమా యనుకొనును. హృదయమాతనిఁ దనలోఁ గలుపుకొందమనుకొనును. ఆతనిఁ గాంచఁగనే యింద్రియములు శిథిలములగును. మనస్సు స్థితి విచిత్రముగనుండును. ప్రేమియొక్క ఆగమన వార్తను వినఁగానే, ఆతనిఁ జూడఁగానే, ఆతనిఁగలిసికొనఁగానే హృదయమున కేదశకలుగునో, అది చెప్పుటకు వీలైన విషయము కాదు. హృదయహీనులగు వారు దానినిఁ దెలిసికొనఁ జాలరు. కేవలము సహృదయులే దానిననుభవింపఁగలరు. వ్యక్తమొనర్చు సామర్థ్యము వారిలోను నుండదు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవానుఁడనేక దేశములను దాటుచు, నెన్నో నదులను దాటుచు నింద్ర ప్రస్థము దగ్గఱకు జేరుకొనెను. ధర్మరాజిదివఱకే నగరము నకు బయట సేవకుల నుంచెను. వారు వచ్చి శ్రీకృష్ణుఁడు పరివార సహితముగఁ జతురంగ సేనలతో నగరము వెలు పలకు వచ్చి విడిసి యున్నాఁడని చెప్పిరి.

జగన్మోహనుఁడగు భగవానుని దర్శనము దురాత్ము లకు దుర్లభము. ఆనందకందుఁడగు శ్రీకృష్ణచంద్రుని ఆగమన శుభసమాచారమును విని, అజాత శత్రువగు యుధిష్ఠిరుఁడత్యంతానందమును జెందెను. వెంటనే ఆతఁడు స్వాగత సత్కారములకు గావలసిన సుందర సామాగ్రులను, బురోహిత పురస్సరముగ, బంధుబాంధవులతో భగవాను నకు స్వాగతమొసంగుటకు బయలు దేరెను ముందు వీణా, పణవ, భేర్యాది మంగళవాద్యములు మ్రోగుచుండెను. వేదజ్ఞులగు బ్రాహ్మణులు వేద ఘోష నొనర్చుచుండిరి. వారి హృదయము ప్రేమచే నుప్పొంగి పోవుచుండెను. వారికి శ్యామసుందరునిఁ గలిసికొనుటకు తహతహ కలుగుచుండెను. ముఖ్యమగు ప్రాణము రాఁగానే ఇంద్రియము లెట్లు చైతన్య వంతములగునో, అట్లే అండఱును నానందమగ్నులై శ్యామ సుందరునిఁ జూచుటకై ఆవైపునకుఁ బోవుచుండిరి.

దూరమున నుండఁగనే గరుడధ్వజముగల సువర్ణ మండితరథము వచ్చుచుండుటను ధర్మరాజు కాంచెను. అందు

శ్యామసుందరుఁడు పీతాంబరమును ధరించి, చంద్రుని రథముపై మెఱుఁగు తీగెతోఁ గూడిన జలధరమువలెఁ బ్రకాశించుచుండెను. ఆతని దర్శన మాత్రముననే ధర్మరాజు అధీరుఁడయ్యెను. ఆతని చిత్తము గద్గదికమయ్యెను. ఆతఁడు శ్యామసుందరునిఁ గలిసికొనుటకు వ్యగ్రుఁడై రథమునుండి దుమికి ఉపాధ్యాయుని వెనుక పాదరక్షలు లేకయే బయలు దేరెను.

దూరమున నుండియే ధర్మరాజు కాలినడకను వచ్చుచున్నట్లు శ్యామసుందరుఁడు చూచెను. వెంటనే రథమునుండి దుమికి గట్టిగాఁ బరువిడెను. శ్యామసుందరుఁడు తనవైపునకుఁ బరువిడుచుండుటను గాంచఁగనే ధర్మరాజు నేత్రముల నుండి అవిరళముగ నశ్రుధారలు ప్రవహించుచుండెను. ఇంతలోనే ఘనశ్యాముఁడు చేరుకొనెను. ఆతఁడు పరువిడివచ్చి ధర్మరాజు పాదములపైఁ బడునంతలో ధర్మరాజు భగవానునిఁ బట్టుకొని గట్టిగాఁ గౌఁగిలించుకొనెను.

ఏ హృదయమున లక్ష్మీదేవి యెల్లప్పుడును నివసించుచుండునో, ఏ హృదయమున కౌస్తుభమణి ప్రకాశించుచుండునో, శ్రీవత్సచిహ్నమెచ్చట నున్నదో, అట్టిహృదయమును దనహృదయముతోఁ గౌఁగిలించుకొని, చేతులతో గట్టిగా బిగించి ధర్మరాజు విహ్వలుఁడయ్యెను. భగవానుని ఆలింగనమువలనఁ దన యశుభములన్నియును నాశనమైన

వని ఆతఁడు తలఁచెను. హృదయమున నిముడునంతగా నపూర్వానంద మాతనికిఁ గలిగెను. వాక్కు గద్గదికమై మాట రాకుండెను. కన్నులనుండి అశ్రుధారలు ప్రవహించుచుండెను. శరీరము రోమాంచ మయ్యెను. ఆతనికి భావ సమాధికలిగెను. ఆతఁడు బాహ్య జగత్తును బూర్తిగా మఱచిపోయెను. ఇంతేకాదు. ఆతఁడు తననే మఱచి పోయెను. ఏదోవిధముగ నాతఁడు తన బాహుపాశముల నుండి విడిపించుకొనెను. అంతఁ బ్రేమార్ద్రహృదయముతో వృకోదరుఁడగు భీమసేనుడు శ్యామసుందరునిఁ గౌఁగిలించు కొనెను. అర్జునుఁడొక వృక్షము క్రిందఁ గూర్చుండి ముఖ ముపైగుడ్డకప్పుకొని దుఃఖించుచుండెను. భగవానుఁడచ్చటికి బోయి, ఆతనిఁ గాగిలించుకొని, ప్రేమాశ్రువులచే నాతని కరీటము క్రిందనుండిన వెండ్రుకలను దడిపివైచెను. అంత నకుల సహదేవులు రోదనము చేయుచు వచ్చి భగవానుని పాదముల మీఁదఁబడిరి. భగవానుఁడు వారిని లేవఁదీసి గట్టిగాఁ గౌగిలించుకొని, వారిపైనున్న దుమ్మును దులిపి, ప్రేమించెను.

భగవానుఁ డింద్రప్రస్థమునుండి వచ్చిన వేదజ్ఞులగు బ్రాహ్మణులకును,కులవృద్ధులకును బ్రణామమునుగావించెను. అనంతరము కురుసృంజయ కేకయాది, దేశాధిపతులును, రాజవంశీయులును భగవానునియెడల సమ్మానమును బ్రక

టించిరి. భగవానుఁడు వారినందఱ నాదరించెను. వారి కుశల మడిగెను. ఈ విధముగ నందఱను కుశల ప్రశ్నలడిగిన తరువాత భగవానుని వాహనము నగరమువైపు నకుఁబోయెను. సూత, మాగధ, గాంధర్వ, వందీజనములును, ఉపాసకులును భగవానుని యశమును గానమొనర్చుచు ముందు నడుచుచుండిరి. విప్రగణము వేదఘోష నొనర్చుచుచు భగవానునకు స్వాగత మొసఁగుచుండిరి. శంఖ, పణవ, వీణా, వేణు, మృదంగ, గోముఖాది వాద్యము లొక్క తాళస్వరమున ప్రయోగించి, ఒక విచిత్ర స్వర తరంగములను సృజించుచుండెను. అందఱును గానమొనర్చుచు, నాట్యము జేయుచు వివిధ వాద్యములను వాయించుచు, వాసుదేవుని బిరుదావళులను బలుకుచుండిరి.

మెల్లమెల్లగా వాహనము ఇంద్రప్రస్థమువైపునకుఁ బోయెను. నగరమందలి సమస్త వీథులును బాగుగాఁ జిమ్మఁబడి స్వచ్ఛమొనర్పఁబడెను. ఆవీథులలో సుగంధజలములను జల్లిరి. కాని మదపుటేనుఁగులు మదజలములచే నావీథులన్నియును బురదగ నయ్యెను. మార్గమున కటు నిటు రంగులరంగుల పతాకములమర్పఁబడెను. ధ్వజ పతాకాదులచేఁ బెద్దపెద్ద భవనములు సుశోభితములై యుండెను. స్నానమొనర్చి సుగంధ చందన మలఁదుకొని, మాలలను, స్వచ్ఛ వస్త్రములను, ఉత్తమాభరణములను ధరించి అత్యంతోత్సా

హముతో నగర నివాసులటునిటుఁ దిరుగుచుండిరి. స్త్రీలు మేడల మీఁదనెక్కి శ్యామసుందరుని దర్శనము కొఱకు వ్యాకులపడుచు విశాల నేత్రములతోఁ గాంచుచుండిరి. ఆ పుణ్య పథమునుండియే ప్రభువు నగరములోనికిఁ బ్రవేశించెను.

ప్రభువు వచ్చుటచే నగర నివాసులు దీపావళీ పండుగను జేసికొనిరి. అన్ని భవనములందును దీపములు మిక్కిలి కాంతితో వెలుఁగుచుండెను. ఇండ్లకిటికీలనుండియును గవాక్షముల నుండియును కర్పూరాగరు ధూపములు బయలు వెడలి వాయుమండలమునంతను సువాసితమొనర్చుచుండెను. భవనములమీఁదనుండి మెఱయుచుండిన సువర్ణకలశములుతమదగ్గఱనేయుండిన నుచ్ఛ్రితా న్యూనతా పతాకములవైపుచూచుచుండెను. శ్యామసుందరుని రాకచే నేఁడు నగరమున నింటింట కోలహాలముగ నుండెను. పిల్లలిల్లు పట్టుటయే లేదు. వారభిభావుకులతో బయటకుఁ బోవనుంకించుచుండిరి. స్త్రీలు నేఁడు తమ గృహకార్యములను మఱచియే పోయిరి. వంట చేయుచుండి దానినట్లే వదలి మిద్దెపైకెక్కిన వారు కొందఱు భర్తకు విడియము నిచ్చుచు, ఆతని నట్లే వదలి మిద్దెపై కెక్కినవారుకొందఱు అందఱ చిత్తములను జంచలములయ్యెను. అందఱును వాసుదేవుని దర్శనమునకు వ్యగ్రులై యుండిరి. కొందఱలో వారి కేశపాశము లూడిపోయెను.

వేణులలోఁ దుఱిమిన పూలు రాలిపోవుచుండెను. వస్త్రబంధ నము వదులయ్యెను. వారి నూపుర, కంకణాది ఆభరణము కదలుచుండెను. దూరమున నొక ఏనుగుపై జండా ఎగురు చుండెను. అందఱి కన్నులచ్చట లగ్నమయ్యెను. ఇంతలోన రథము మీఁద గూర్చుండిన శ్యామసుందరుఁడు కనఁబడెను. ఆతనికి నలువైపులను అశ్వదళము పంక్తి బద్ధులై నడుచు చుండిరి. వెనుక ఆతని పదునాఱువేల నూటయెనిమిదిమంది రాణుల శిబికలు వచ్చుచుండెను. శిబికల ద్వారము కు నత్యంత క్షీణ వస్త్రము వేయఁబడియుండెను. ఆ యులిపి వస్త్రముకుండా నగరమందలి వింతల నన్నిటినిఁజూడవచ్చును శిబికలకు వెనుక పెద్ద యేనుఁగులు నడుచుచుండెను. దాని కిని రథములకును గొలుసులతోఁ గట్టబడి యుండెను.

శ్యామసుందరుని మనోహర మూర్తినిఁగాంచి మేడల నెక్కి నగరమందలి స్త్రీలత్యంత ప్రసన్నులైరి. వారు భగ వానుని మీఁదఁ బుష్పవర్షమును గుఱిపించు చుండిరి. వారు చల్లిన పుష్పములచేఁ గృష్ణుఁడు మునిఁగిపోయి నట్లయ్యెను. భగవానుని మనోమయ మూర్తిని మానసికముగ నాలింగన మొనర్చుకొని వారు పరమానంద సుఖము ననుభవించిరి. వారు మాటి మాటికినిఁ దమ ఉత్కృష్ట మనోహర మంద హాసములచే మాధవునకు స్వాగత మొసఁగుచుండిరి.

కృష్ణుని పత్నులు తమ విశాలనేత్రములతో శిబికా రంధ్రముల ద్వారా మేడలమీఁద నుండిన నగర నారీమణు లను జూచుచుండిరి. ఆమేడలపై నుండిన స్త్రీలకన్నులు వెలుఁగులో మెఱయుచుఁ జుక్కలవలె నుండెను. ఒక్కొక్క ప్పుడు వారి మనోహర ముఖములును గనఁబడు చుండెను. చంద్రుఁడు ముందు బోవుచుండినఁ దారలు వెన్నాడినట్టు శ్యామసుందరుని వెనుక ఆతని భార్యలు వచ్చుచుండిరి.

శ్రీకృష్ణుని షోడశ సహస్రపత్నుల సౌభాగ్యమును గాంచి నగరనారీమణులు పరస్పర మిట్లను కొనుచుండిరి:- "సఖులారా! స్త్రీ జన్మ మెత్తినందులకు శ్రీకృష్ణ పత్ను లగుటయే వారిభాగ్యము. ఈస్త్రీలందఱును నెట్టి మహాధర్మ పుణ్యకార్యముల నొనర్చిరో కదా! ఆ ఫలస్వరూపమున వీరికి పురుషోత్తముఁడు పతియైనాఁడు. వీరికాతఁడు నిత్య మును దన ఉదార హాస్యమున మోహన మధుర లీలామయ స్వరూప మాత్రముచే వారి ఉత్ఫుల్ల నళినీ సదృశములగు గన్నుల కనవరత మానందప్రదాన మొనర్చుచుండును.

నగర స్త్రీలిట్లు ప్రభుపత్నుల భాగ్యమును ప్రశం సించు చుండ శ్యామసుందరుఁడు విని నవ్వుకొను చుండును. చాలమంది ఆతనికి హారతు లొసంగుచుండిరి. కొందఱాతని రథమును నిలిపి, ఆతని కుపహారముల నర్పించు చుందురు. ఛందన, పుష్ప, మాలాది సామగ్రులచే నాతనికి స్వాగత

సత్కారము లొనర్చుచుండిరి. ఈ విధముగ మెల్లమెల్లఁగా రథము రాజభవనము దగ్గఱకు జేరుకొనెను. అచ్చట నచ్యుతుఁడు రథము మీఁద నుండి దిగెను. అతఁడు పాండవ సమేతుఁడై ముందుగా గుంతిని దర్శించుటకు బయలుదేరెను. వాద్యముల ధ్వనిని విని కుంతి ద్రౌపదితోఁ గూడుకొని ద్వారమున నిలిచియుండెను. భగవానుఁడు ముందునకుఁబోయి తన అత్త పాదముల నంటెను. తన యన్నయగు వసుదేవుని పుత్రుఁడగు వాసుదేవుఁడు తన పాదము లంటుటను గాంచఁగనే కుంతికి ఆనంద ముప్పొంగెను. ఆమె ప్రేమభరిత హృదయముతోఁ గృష్ణుని లేవదీసి, కౌగిఁలించుకొని, ప్రేమ పూర్వకముగ శిరస్సును మూర్కొనెను. ద్రౌపదీ సుభద్ర లిద్దరును వచ్చి భగవానునకుఁ బ్రణామమును గావించిరి. ఇద్దరి శిరస్సులమీఁద భగవానుఁడు తన వరద హస్తము నుంచి యిట్లనెను:-"బాగున్నారా? ఇది వినఁగానే యిద్దరి నేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహించెను.

లోపలికిఁ బోఁగానే ధర్మరాజు దామోదరునిఁ బూజించెను. అతఁడు ప్రేమోద్రేకమున విహ్వలుడైఁ పూజా క్రమమును గూడ మఱచిపోయెను. భగవానుఁ డంతఃపుర మందలి పెద్దవారగు విప్రపత్నులకు నమస్కరించెను. రాణుల శిబికలు బయటనుండెను. కుంతికి ఇంతలోనే పాలకీలు కనఁబడెను. ఆమె ద్రౌపదీ సుభద్రలతో నిట్లనెను:-"అమ్మలారా!

మీరిచ్చట నిలుచుండి యేమిచేయుచున్నారు ? మీ వదినె లను దింపి లోనికిఁ దీసికొనిరండు.'' నవ్వి సుభద్రయిట్లనెను:- ''అత్తా ! మావదినెలు ఒక్కరు ఇద్దరు కాదు. మనయిండ్లలో బట్టనంతమంది యున్నారు. మొత్తము పదునాలువేల నూట యెనిమిది మంది.''

ప్రేమతోఁ గుంతి యిట్లనెను .- ''ఏమైతేనేమి ? ఇది మన అదృష్టము. అచ్చట నంతఃపురములలో నుండియుం దురు. ఇచ్చట బయట నుండఁగలరు. అచ్చట ఛప్పన్నాలు పిండివంటలు తినియుందురు. ఇచ్చట పచ్చడిమెతుకులు తినఁ గలరు. మీరుపోయి వారి కర్ఘ్యముల నిండు. శిబికలనుండి దింపుఁడు.''

ఇది విని ద్రౌపదీ సుభద్రలు పోయి పాలకీల దగ్గ ఱకుఁ బోయి యిట్లనిరి:-'వదినెలారా! ఇఁక దిగుఁడు. ఇచ్చట యెవరును బురుషులు లేరు. ముసుఁగులు తీయుఁడు.'

ఇది విని రుక్మిణీ మొదలగు రాణులంగఱును దిగిరి. వారు తమ మఱదండ్లను గలిసికొనిరి.

రుక్మిణీదేవి సుభద్రతో నిట్లనెను :- 'వదినా ! నీవు చాల చిక్కిపోతివమ్మా. ఇచ్చట కష్టమేమియును లేదు గదా !'

సుభద్ర అశ్రువులను దుడిచికొనుచు నిట్లనెను :— ఇచ్చట నాకు వదినెలు లేరు. ఇదియే యిచ్చట కష్టము.

ఇప్పటి కింతగాఁ బ్రేమించు వదినెలు వచ్చినారు. ఇప్పుడిఁక ద్వరగా బలిసిపోఁగలను.' ఈ విధముగఁ బరస్పరము స్నేహ ప్రేమ సంభాషణము జరుగుచుండెను. అంత ద్రౌపది'' రుక్మిణీ సత్యభామ, భద్రా, జాంబవతీ, కాళిందీ, మిత్రవిందా, లక్ష్మణా, సత్య మొదలగు కృష్ణపత్నుల నందఱను దీసికొని తన అత్తదగ్గఱకుఁ బోయెను. అందఱును బోయి కుంతి పాద ముల నంటిరి. కుంతి యిట్లనెను :– 'బిడ్డలారా! మీరు మీ పతికిఁ బ్రియురాండ్రు. మీరెట్లు వేలకొలఁదిగ నున్నారో, మీ కట్లే వేలకొలఁదిగఁ బుత్రులు కలుఁగుగాక !'

ఇది వినఁగానే పాండవులును ఇతరులును నవ్వనారం భించిరి. అర్జునుఁ డిట్లనెను :– 'అమ్మా! ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్క గ్రామము నీయవలయును. లేకున్న నింతమంది యెచ్చట నివసింపఁగలరు ?'

కుంతి యిట్లనెను:–'నాయనా! ఎవరి అదృష్టము వారి దగ్గఱనే ఉండును.' అని పలికి కుంతి ద్రౌపదికిఁ సైగఁ జేసెను. ద్రౌపది, సుభద్రాదుల సహాయమున భగవానుని పత్ను లందఱకును వస్త్ర, మాలాభరణాదుల నొసంగి పూజించిరి. అందఱకును యథాయోగ్యముగ స్వాగత సత్కారము లొనర్చి వారుండుటకు వసతినిఁ జూపించిరి.

ధర్మరాజు భగవానునియొక్క సైనిక, సేవక, సచి వాదులకును అనుచరులకును విడిదులను జూపించెను. వారం

దఱు నింద్రప్రస్థమున సుఖముగ స్వర్గమున దేవతలవలె నుండిరి. కృష్ణుఁడును నింద్రప్రస్థమునకు వచ్చి మిక్కిలి సంతోషమును జెందెను. ఇచ్చట సంతోషమునకు ముఖ్యకారణము అరునుని సహవాసము. కృష్ణుఁ డర్జునునిఁ బ్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించును. ఆతఁ డీతని వెంటబెట్టుకొని చాల దూరమువఱకు వేఁటకుఁబోవును. నానాప్రకార క్రీడల నొనర్చును.

భగవానుని యొక్క ఆ పదునాఱువేల భార్యలు నిత్యమును నూతన వస్త్రాభరణాదులను ధరించుచు నటునిటు దిరుగుచుందురు. ధర్మరాజ, భీమసేనులు వచ్చినపుడు వారు ముసుఁగులను సవరించుకొందురు. అర్జునునిఁ గాంచియును వారు ముసుఁగులను సవరించుకొనుచుండ నొక దినమున నాతఁడిట్లనెను :–'ముసుఁగు పెద్దలకడ వేసికొందురు. నేను శ్రీకృష్ణునికంటెఁ జిన్నవాఁడను. నేనువచ్చిన ముసుఁగు సవరించుకొను టెందులకు ?'

అంత ధర్మరాజు నవ్వి యిట్లనెను :–'సోదరా! మేము సింహావ్యాఘ్రములమా ? వలదనిన మేము లోపలికి రానేరాము. వాస్తవమున కృష్ణుఁడు జగత్పతి. సౌభాగ్యశాలినులగు నీ దేవు లెవరు వచ్చినను ముసుఁగు వేయఁగూడదు. అందఱును వీరికి సంతానమే.'

సూతుఁ డిట్లనెను :– "మునులారా! ఈ విధముగఁ దన పత్నులతోఁ గూడ భగవానుఁ డింద్రప్రస్థమున నుండి

నిత్యనూతన సత్కారములను బొందుచు, సుఖముగ నివసించుచుండెను. చాల నెలలవఱకు ధర్మరాజు రాజసూయ యాగ చర్చను జేయలేదు. కొన్నిదినములైన తరువాత అతఁడొక దినమున సమయమును గనిపెట్టి మిక్కిలి సంకోచముతో రాజసూయ యాగమును గూర్చి భగవానునితోఁ బ్రస్తావించెను. దీనినిఁగూర్చి నేను వర్ణింపఁబోవుచున్నాను. వినుడు.

---

## రాజసూయ యజ్ఞప్రస్తావము

శ్లో॥ క్రతు రాజేన గోవింద రాజసూయేన పావనీః।
యక్ష్యే విభూతీర్భవత స్తత్సంపాదయ నః ప్రభో॥
—శ్రీ భాగ. ౧౦ స్కం. ౭౨ అ. ౩ శ్లో॥

తే॥ అనఘ చారిత్ర రాజసూయాధ్వరంబు
నెమ్మి గావించు వేడుక నెమ్మనమున
నెనయుచున్నది యది నిర్వహింప నీవ
కాక నాకాత్మ బంధువుల్ గలరె యొరులు.
—శ్రీ మహాంధ్ర భాగవతము.

తన స్వామి అనుకూలుఁడగుటను గాంచగనే తన హృదయమందలి కోరికను వ్యక్తమొనర్చు కోరిక జనించును. వినయముతో నాతని చరణములకు నివేదించును. మనకోరిక

నాతఁడును మన్నించినచో మనకత్యంతానందము కలుగును. అప్పుడు మనకోరిక పూర్ణమైనట్లే యుండును. మన సంకల్పము మూర్తిమంతమై మన యెదుట నుండును. స్వామి అనుకూలమైనపుడు నెరవేరని కోరిక యేమియుండును ?

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఇంద్రప్రస్థములో నుండి భగవానుఁ డందఱకానందమును గలుగఁజేయుచుండెను. ఒకరోజున సభ జరిగెను. సభలో గొప్పగొప్ప ఋషులును, మునులును, విద్వాంసులగు బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును, పురోహితులును, కులవృద్ధులును బంచ పాండవులును గూర్చుండి యుండిరి. రాజ్యసింహాసనమున ధర్మరాజు కూర్చుండి యుండెను. ఆతని సమీపముననే సుందర సువర్ణ సింహాసనమున శ్యామసుందరుఁడు సుఖముగఁ గూర్చుండెను. భగవానుఁడు నేఁడత్యంత ప్రసన్నుఁడై యుండెను. ఆతఁడత్యంత ప్రేమతో నవ్వుచు మాటలాడుచుండెను. భగవానుఁ డనుకూలుఁడుగ నున్నాఁడని తెలిసికొని ధర్మరాజు నేఁడేమో చెప్పఁగోనఁదలఁచెను. ఆతఁడందఱు ముందర అందఱును వినునట్లుగ భగవానునితో నిట్లనెను :- "ప్రభూ! నేనొక్క నివేదనమొనర్పఁదలఁచినాను. ఆజ్ఞయైనచోఁ జెప్పెదను."

భగవానుఁ డిట్లనెను :- "మహారాజా! నీవేమి మాటలాడుచున్నావు ? నేను మీ సేవకుఁడను. ఆజ్ఞాపింపుఁడు."

కన్నుల నీరునింపుచు ధర్మరాజిట్లనెను :- "ఏలకావు ప్రభూ ! నీవు నీ ఆశ్రితుల కధీనుఁడవు. వారికోరిక లన్నిటిని నెఱవేర్చుచుందువు. నాకొక కోరిక కలదు. నీ కంశభూతు లగు ఇంద్ర, వరుణ, కుబేరాది దేవతలను యజ్ఞములన్నిటిలో శ్రేష్ఠమైనదగు రాజసూయ యజ్ఞముద్వారా యజన మొనర్పఁదలఁచు చున్నాను. నా యీ చిరకాలాభిలాషను బూర్ణమొనరించు భారము నీపైనున్నది."

అత్యంతానందమును బ్రకటించుచుఁ గృష్ణుఁడిట్లనెను:- "శత్రుకర్షణా ! పాండునందనా ! నీవు రాజసూయ యాగము చేయుట ఏమంత గొప్పపని ? నీయాలోచనము చాల ఉత్తమ మైనది. నీవు రాజసూయ యాగమును దప్పక చేయవలెను. దీనివలన నీమంగళమయమగు కీర్తి సమస్తలోకములందును వ్యాపింపఁగలదు."

గద్గద కంఠముతో ధర్మరాజిట్లనెను :- "ప్రభూ! నేను యంత్రమును. నీవు యంత్రివి. కొయ్య బొమ్మల నాడించు వానిది కీర్తి. బొమ్మలకు రాదుకీర్తి. మేము నీభక్తులము. అనురక్తులము. నీ పరమపావన చరణపాదుక లను సేవించువారము. పాపనాశినియుఁ, బుణ్యప్రదమునగు నీకథలను నిరంతరము వినువారము. నీయొక్క మనోహర మధురమూర్తిని నిరంతరమును ధ్యానించువారము. దానిలో నేశ్రేయమున్నను అది నీకే ప్రాప్తించును. నేనే చేయించు

వాఁడనగుచో మీచేతఁ జేయించుచుంటినందులకని నీవడుగ వచ్చును. యదునందనా! ఈ యజ్ఞమును మాచేతఁ జేయించుటచే లోకమున కొక ఆదర్శము నేర్పఱచుచున్నావు. నీవు నీ యాశ్రితుల కోరికలనన్నిటిని నెఱవేర్చెదవనియు, నిన్నాశ్రయించినవారు భోగములను గోరినచో వారికుత్తమోత్తమ భోగములను బ్రసాదించుటయేకాదు, వారికి మోక్షమునైనఁ బ్రసాదించెదవని కురు, సంజయాది రాజవంశీయులందఱును దెలిసికొనఁగలరు. నీవు మాచే రాజసూయ యాగమును జేయించుటచే, నీచరణకమలముల సేవాప్రభావమువలన నేమగునో దానిని జూపెదవనియు, నీసేవ చేయనివారికేమి జరుగునో దానిని లోకమునకు జూపెదవు.

నవ్వి కృష్ణుడిట్లనెను :-"మహారాజా! నాకెవ్వరును శత్రువులులేరు, మిత్రులునులేరు. కౌరవులడిగిన నేను వారికిని సహాయమొనర్చెదను. మీ రడిగిన మీకు సేవచేసెదను. నాకందఱును సుహృదులే. అందఱును సమానముగ సంబంధులె."

శీఘ్రముగ ధర్మరాజిట్లనెను:-"కాదుకాదు స్వామీ! మీరు మాకు బ్రియులనియు, ఇంకొకరు మీకు శత్రువులనియు మాకు బ్రియమొనర్చి, ఇతరుల కనిష్టమును గలుగఁజేతువని నా అభిప్రాయముకాదు. నీవు సమదర్శివి, సర్వా

త్ముఁడవు, సర్వేశ్వరుఁడవు, ఆత్మానుభవ స్వరూపుఁడవగు పరబ్రహ్మవు. ఇది నాది, ఇది నాదికాదను భేదభావము నీకులేదు. నీవు లేక యుండిన నేదైన నున్నచో నీకు పరాయి వస్తువుండును. అన్నిటిలోను నీ మాయావైభవము కలదు. అట్టియెడ స్వపర భేద మెచ్చటినుండి రాఁగలదు! అయినను ప్రభూ! గంగ అందఱకును సులభమైనదే. దాని కడ కెవరైనను వచ్చి స్నానమొనర్చినను, త్రాగినను గాదనదు. అయినను అందఱును దాని దగ్గఱకు రాఁజాలరు, రారు ఎవరువచ్చిన వారు యథేష్టముగ జలపాన, స్నానములను జేయుదురు, పాపములను బోఁగొట్టుకొందురు. అగ్ని దగ్గఱకెవరు వచ్చిన వారికి చలిపోయి తీరును. అది అందఱకును సులభమైనదే! కల్పవృక్షము కడకెవరు వచ్చినను వారికోరికలన్నియును నెఱవేరును. అట్లే నీ కందఱును సమానులైనను, సర్వభూతములకును నీవు సఖుఁడవును, సుహృదుఁడవు నైనను గల్పవృక్షమును సేవించిన వారికిని, సేవింపని వారికిని న్యూనాధిక ఫలములు లభించినటుల భక్తులకును, అభక్తులకును, వారి భావనాను సారముగ న్యూనాధిక ఫలములు లభించును. దీనివలన మీ సమదర్శిత్వములో భేదమేమియు నుండదు. దీనిలో మీ భేదభావమేమియు నుండదు.''

ఇది విని భగవాండిట్లనెను :-"రాజా! నీ ఆలోచన అత్యుత్తమమైనది. రాజసూయ యాగమున నంతయును మేలే. ఈ యజ్ఞ మన్ని యజ్ఞములలో శ్రేష్ఠమైనది. ఈ ఈయజ్ఞమందు దేవతాపూజ యుండును, పితరులకు శ్రాద్ధ తర్పణములుండును. ఋషులకును మునులకును స్వాగత సత్కారములుండును. బ్రాహ్మణులకు విపులదక్షిణ లభించును. రాజసమాగమము జరుగును మాబోటి పరివారము నకు కమ్మని తిండ్లు లభించును. ఇందులో నందఱకును గళ్యాణమేకలదు."

ధర్మరాజిట్లనెను :-"అయితే యదునందనా? ఈ యజ్ఞము జరుగుటెట్లు ?"

భగవానుఁడు దానిని బలపఱచుచు నిట్లనెను :- "ఇందులోఁ గాకుండుట కేమున్నది? నీ నల్గురు తమ్ములును బలవంతులు, శూరవీరులు, గుణజ్ఞులు, ఆజ్ఞాకారులు. నీ యందు భక్తి కలవారు. వీరిని దిగ్విజయము కొఱకు నల్దిక్కులకును బంపుము. భూమండలమందలి రాజుల నందఱను జయించి సముద్రాంతము వఱకు పృథివిని వశమొనర్చు కొనుము. అనంతరము యజ్ఞసామగ్రుల నన్నిటినిఁ బ్రోవు చేయుము. తర్వాత స్వాహాకారములతో హోమాదులు జరుగును. ఇదెంతటి కార్యము ?"

ధర్మరాజిట్లనెను :- "కేశవా! భూమండలమునందు గల రాజుల నందఱను జయించుట చాల కష్టము."

నవ్వి భగవానుఁడిట్లనెను :-"కఠిన మేమున్నది రాజా! నీవు నన్ను జయించిన నీతుచ్ఛరాజులను జయించుటేమి

లెక్క ? నీ యీ నల్గురు తమ్ములును లోకపాలుర అంశ ములం బుట్టినవారు. నీవు ధర్మస్వరూపుఁడవే, మీరందఱును తేజస్వులు, మనస్వులు, కావున మీరు నన్ను జయించితిరి. ఇంద్రియములను మనస్సును జయించినవారికి నేనువశమయ్యె దను. అజితేంద్రియులును, ఇంద్రియాధీనులును నన్ను జయింపఁజాలరు. నా భక్తులకు ప్రపంచమున దుర్లభమేమి యును లేదు. గొప్పగొప్ప సర్వసమర్థులగు చక్రవర్తులును, దేవతలును నాభక్తులను తేజ, యశ, లక్ష్మి, విభూతుల ద్వారా తిరస్కార మొనరింపఁ దలఁచినచో నట్లు చేయఁ జాలరు. ఇఁక నీరాజులమాటయేల ? కావున నీవు నిర్భయుఁ డవై రాజసూయ యాగమునకు సిద్ధపడుము. నీ సోదరులను దిగ్విజయమునకై పంపుము.''

సూతుఁ డిట్లనెను :-''మునులారా ! భగవానుని యీ మాటలను వినఁగానే ధర్మరాజునకు మిక్కిలి సంతో షము కలిగెను. సంతోషముచే నాతని ముఖారవిందము వికసించెను ఆతఁడు తన సోదరులతో నిట్లనెను :-''సోదరు లారా! మీ అభిప్రాయ మేమి ?''

అన్నదమ్ములు నల్వురు నిట్లనిరి:-' 'మహారాజా ! మేము మీకధీనులము. మాకు మీరేమి ఆజ్ఞనొసంగిన నట్లు చేయుదుము. మీరు సామ్రాట్టుగా నుండ సర్వధా యోగ్యులు మేము నలుగురమును మీకు సేవకులము. మనకందఱకును రక్షకుఁడును, పాలకుఁడును, సర్వస్వమును సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడే. ఇంక మన కేమి భయముకలదు? మీకు మాకు

దిగ్విజయ మొనర్ప నాజ్ఞ నొసంగుఁడు. మేమందఱమును శ్రీకృష్ణుని తేజః ప్రభావము చేత సమస్తమును జేయ సమర్థులము.''

తనసోదరులు మాటలాడిన నిట్టి యుత్సాహవర్ధక వాక్యములను వినఁగానే ధర్మరాజు హర్షమునకు మేఱ లేకుండెను. ఆతఁడు భగవానుని తేజముతో నిండిన దన సోదరులను నల్వురను నాలు దిక్కులకు దిగ్విజయార్థము పంపెను. భీమసేనుని భద్రదేశీయ వీరులతోఁ గూడ పూర్వ దిక్కును జయింపఁబంపెను. పశ్చిమ దిక్కునకు మత్స్య దేశీయరాజులతో నకులునిఁ బంపెను. ఉత్తరమునకుఁ గేకయ దేశీయ రాజులతో నర్జునుని, దక్షిణమునకు సృంజయ దేశవీరులతో సహదేవునిఁ బంపెను. వీరందఱును సైన్యమును గూర్చుకొని రాజులనందఱను వశమొనర్చు కొనుటకై బయలుదేరిరి. అందఱును శూరవీరులే. బలవంతులే. ఉత్సాహవంతులే. వారు సమస్త దేశాధీశులను దమ బాహు బలముచే జయించిరి. వారినుండి యజ్ఞము కొఱకై చాల ధనమును దెచ్చిరి. వారందఱును దెచ్చిన ధనమును ధర్మరాజున కొసంగిరి.

అందఱును వచ్చి తమతమ దిక్కులందు జయింపఁబడిన రాజులను బేర్కొని, ఆ రాజులను గెలిచి వశపఱచు కొంటిమనియు వారినుండి ధనమును దెచ్చితిమనియుఁ జెప్పిరి. అట్టి సమయమున భీమసేనుఁడు వచ్చి యిట్లనెను :—''మహారాజా! నేనందఱ రాజులను జయించితిని గాని యింకను

జరాసంధుని జయింపలేదు. ఆతని బలమమేయము. శిశు పాలుఁడాతనికి సేనాపతి, ఇంక నెందఱో రాజులాతని సేవలో నిరంతరము సంలగ్నులై యుందురు. కావున నాతని జయిం చుట చాల కష్టము.''

ఇది విని ధర్మరాజు జిజ్ఞాస భరిత దృష్టితో శ్యామ సుందరుని జూచెను. ధర్మరాజుని అభిప్రాయములను గ్రహించి వాసుదేవుఁడిట్లనెను :-''నే నిదివఱకే మన రాజు సూయ యాగమునకుఁ గంటకుఁడొక్క జరాసంధుఁడేనని చెప్పియుంటని. శిశుపాలుఁడువానికి సేనాపతి యైనాడు. దంత వక్త్ర, మేఘవాహన, కరభాదులును నాతని కనుయాయులు. పౌండ్రక వాసుదేవుని నేను జంపియుంటిని. కంసుఁడును మామ యగుటచేత నాతని నభిమానించెడు వాఁడు. వానిని గూడ నేను జంపివైచితిని. వానికి హంస డింభకులను నిద్దరు రాజులు వానికి ప్రధాన సహాయకులును, సేనాపతులునై యున్నారు. వీరిద్దరకును బ్రహ్మ వరము కలదు. వారిద్దర్రిని నేను మోసమున యమునలో ముంచి పరలోకమునకుఁ బంపితిని. ఇప్పుడు వీఁడొక్కఁడే మిగిలినాఁడు. వీఁడు సేన ద్వారా జయింపఁబడఁడనియు, వానినిఁజంపుటకొక ఉపాయ మున్నదనియు నుద్ధవుఁడు చెప్పినాఁడు''.

ఉత్సాహముతో ధర్మరాజిట్లనెను :- ''ఆ యుపాయ మేది ? కృష్ణా !''

కృష్ణుఁడిట్లనెను :- "నీవు భీమార్జుననను నాకొసంగుము. పని అంతయును నెఱవేరఁగలదు. మేము ముగ్గురమును బోయి వానిని జయించి వచ్చెదము."

కన్నుల నీరు నింపుచు ధర్మరాజిట్లనెను :- "వాసుదేవా ! నీవేమి మాటలు పలుకుచున్నావు. నా రాజ్యము, పరివారము, సోదరులందఱును నా శరీరమును నీదే. మా జీవితములన్నియును నీ యధీనమున నున్నవి. నీవేది చేయఁదలఁచిన దాని నొనర్పుము. ఇచ్చుటేమిటి ? మేమందఱము నీయంత్రములము. ఎట్లుపయోగించుకొనఁ దలఁచిన నట్లుపయోగించుకొనుము. కాని మీరు ముగ్గురును బోయి ఆతని నెట్లు జయింపఁగలరో యెఱుఁగఁ గోరుచున్నాను. మీరు మీ వెంట సేననేల దీసికొని పోరు ?"

భగవానుఁడిట్లనెను :- "వందల సంవత్సరముల వఱకు యుద్ధము చేసినను తరుగనంత సేన వానికడనున్నది. మేమును వాని భయముననే మధురాపురమును వదలి ద్వారకకు పాఱిపోయివచ్చితిమి. కావున సేనను దీసికొని పోవుట వ్యర్థము. వానిని మేము ఛలమునజయించెదము. ఇవన్నియు మీకు జెప్పుటెందులకు ? ఏవిధముగ వీలైన నట్లు చంపగలము."

అశ్రువులను దుడిచికొనుచు ధర్మరాజిట్లనెను :- 'శ్యామసుందరా ? భీమార్జునులు నాకు రెండు కనుఁ

వంటివారు. నీవంతఃకరుణమవు. నీకేదైన ననిష్టము జరిగి నదా నేను జీవింపఁజాలను. వాని భయమున మథురను వదలి పాఱిపోయితినని మీరనుచున్నారు. అట్లైన వానిని జయించుట సందహామే కాఁగలదు. సందేహా కరమగు పనినిఁ జేయనేల ? నిన్ను సందేహామునఁ బడవైచి నేను సామ్రాట్టునుగా నిష్టము లేదు. రాజసూయ యాగమును మానివైచి నే నింకొక క్షత్రియోచిత యజ్ఞమును జేయు దును."

భగవానుఁడు తన మాటను సమర్థించుకొనుచు నిట్లనెను :- "రాజా ! నీవు నన్ను విశ్వసింపుము. సందే హింపవలసిన పని లేదు. నీవు భ్రమార్జునులను నావెంటఁ బంపుము. ఎట్లైనను వానిని దప్పక చంపి బంధితులగు రాజులను బంధమునుండి విడిపించెదము. వారందఱును నీ యజ్ఞమునకు వివిధములగు గానుకలను దేఁగలరు ?"

ఇది విని గద్గద వాక్కులతో ధర్మరాజిట్లనెను :- "ప్రభూ ! నీ విట్లాజ్ఞాపించుచుండిన నాకు సందేహామెట్లు కలుగఁగలదు ? నీ వేది యుచితమనుకొనిన దానినిఁ జేయ వచ్చును."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ధర్మరాజు అను మతినిఁబొంది కృష్ణుఁడు పరమ ప్రసన్నుడయ్యెను. ఆతఁడు భీమార్జునులతో నిట్లనెను :- "ఇఁక మన మాలస్య మొనర్ప

రాదు. మీరు వెంటనే జరాసంధుని రాజధానియగు మగధ దేశమునకు బయలుదేరుఁడు. అచ్చట నుండి మనము వానినిఁ జంపినగాని రాఁగూడదు.'' భగవానుని ఆజ్ఞను బొంది భీమార్జును లిద్దరును వెంటనే సిద్ధపడిరి. బ్రాహ్మణులు ముగ్గురకును స్వస్త్యయనమును గావించిరి. వారు ముగ్గురును మగధదేశమునకుఁ బోయిరి. ఇప్పుడు వారచ్చటికిఁ బోయి యే విధముగఁ గపట వ్యవహార మొనర్చిరో ఆ వృత్తాంతమును జెప్పెదను వినుఁడు.''

---

## భీమార్జునులతోఁ గృష్ణుఁడు మగధకుఁ బోవుట

శ్లో॥ భీమసేనోఽర్జునః కృష్ణో బ్రహ్మలింగ ధరాస్త్రయః।
జగ్ముర్గిరి వ్రజం తాత బృహద్రథ సుతో యతః॥

—శ్రీ భాగ. ౧౦స్కం. ౭౧అ. ౧౬శ్లో.

చ॥ విను మగధేశ్వరుండెపుడు విప్రజనావలియందు భక్తి యున్, వినయముఁగల్గి యెద్దియును వేఁడినచో వృథ సేయ కిచ్చుఁగా, పురందర నర్జునుండు పవనోద్భవుఁ డేనును బ్రాహ్మణాకృతిం, జని రణభిక్ష వేఁడిన వంశ వశుఁడై యతఁడిచ్చుఁ గోరికల్॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచములోని కార్యములన్నియును కేవలము బలము చేతనే జరుగవు. బలముండి, బుద్ధి నీతి లేకున్నచో నాబలమువలన విశేషలాభముండదు. నీతిజ్ఞులగువారు బల శాలిని బుద్ధిబలముచే వశమొనర్చుకొనఁగలరు. మానవులు తమ నీతిచేతనే గొప్పగొప్ప సింహములను, బాగుగా మందిచిన నేనుఁగులను దమవశములోఁ బెట్టుకొనుచున్నారు. నీతిజ్ఞులగువారు బలముచే నన్నియును జేయఁగలరు. కాని కేవలము నీతి బలములచేతనే ముఖమున 'జయ' మును వ్రాయునంతవఱకు పని నెఱవేరదు. దుర్యోధనుఁడు బలవంతుఁడు, నీతిజ్ఞుఁడు. కాని ఆతని నొసట జయము వ్రాయఁబడలేదు. ఎచ్చటికిఁ బోయినను బరాజయమే, గంధర్వులాతనిఁ బట్టుకొని పోఁగా ధర్మరాజతని విడిపించెను. విరాట్ నగరమునకు గోగ్రహణమునకు భీష్మ, ద్రోణ, కర్ణాదులను దీసికొని పోఁగా, బృహన్నలగా నుండిన నర్జునునిచేఁ బరాజితుఁడై తిరిగివచ్చెను. మహాభారత యుద్ధమున దుర్యోధనుని దగ్గఱ పదునొకండు అక్షౌహిణీల సైన్యము కలదు. విశ్వ విజయులగు భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యాది విఖ్యాతవీరులు సేనాపతులుగ నుండిరి. కాని వాని నొసట జయము వ్రాయబడియుండక పోవుటచే వానికిఁ బరాజయము కలిగెను. దీనికి విపరీతముగ నర్జునుని అదృష్టమున జయమున్నది. ఆతఁ డెచ్చటికిఁ బోయినను విజయమును బొందివచ్చును. నివాత

కవచులను నింద్రుఁడును జయింపఁజాలక పోయెను. అట్టివారి నైనను నర్జునుఁడొక్కఁడే జయించెను. ఇదంతయును భగవత్కృప. భీమసేనునికో నఖండ బలమున్నది కాని బుద్ధి నీతి లోటుగానుండెను. తిండిపోతునకు సాధారణముగ బుద్ధి బలముండదు మన కృష్ణునకెంతో బలమున్నది. కాని నీతి, నిపుణతలలోను నాతని మించినవాఁడు లేఁడు. ఆతఁడెట్టివానినైనను జెవులు కోయును, ఛలకపటము లొనర్చుటలో నీప్రపంచమున నీతని మించిన సిద్ధహస్తుఁడెంతగా వెదకినను దొరకఁడు. అందఱకును మించిన మాయావి. వేలకొలఁది బలవంతులు చేయఁజాలని పనిని యుక్తిచేఁ బామును జావకుండ, బడితయును విఱుగకుండ చేయును. పనిచేయును కాని ఆతని మీఁదకొక మాటైన రానీయఁడు. జలంధరుని కపటముగ జంపించెను. కాలయవనుని యుక్తిచే భస్మమగు నట్లు చేసెను. భస్మాసురుని మాయచేఁ దనచేతనే తాను భస్మమగునట్లొనర్చెను. మహాభారత యుద్ధ మందీతఁడడుగడుగునకును ఛలకపటము లొనర్చెను ఏ విధముగను యుద్ధములోఁ జావని భీష్మ, ద్రోణ, కర్ణాదుల నేదో మాయచేఁ జంపించెను. కావునఁ బ్రపంచమున నీతని మించిన గపటి, కూట నీతిజ్ఞుఁడు లేనే లేఁడు. జరాసంధుఁడు కేవలము బలము చేతను జావఁడు. కేవలము మోసము చేతను జావఁడు. ఆతని కొఱకు ఛల, బల, విజయము కావలయును. పాండవు

లలో బలవంతుఁడును గలఁడు, విజయుఁడును గలఁడు కాని నీతి లోపము కలదు. దీనికొఱకు మాయాబండారమును, జారచోర శిఖామణియునగు శ్రీకృష్ణుఁడు వచ్చెను. ఈ ముగ్గురు నొక్క స్థానమునఁ జేరిన బనినెరవేరుటలో సందేహ మేముండును."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ధర్మరాజాను మతినిఁ బొంది వాసుదేవుఁడు భీమార్జునులను వెంటఁబెట్టుకొని మగధదేశమునకుఁ బోయెను. వారు తమవద్ద అస్త్రశస్త్ర ముల నుంచుకొని పోలేదు. ముగ్గురును బ్రాహ్మణ వేషము లను ధరించిరి. ముగ్గురును జక్కఁగాఁ దిలకములను దిద్దుకొని, రామనామ వస్త్రములను ధరించి భిక్షుక బ్రాహ్మణవలెఁ బోయిరి. మునులారా! ఈ బ్రాహ్మణ వేషమున నన్నిటి సమావేశముండును. అస్త్రశస్త్రములు కుంఠితమైనపుడీ వేష మునఁ బనిని సాధింపవచ్చును. అసురరాజగు బలి యెవ్వరి చేతను జయింపఁబడక పోఁగా, భగవానుఁడు మఱుగుజ్జు వేషమును ధరించిపోయెను. భగవానుఁడెప్పుడు కావలసి నను నప్పుడు వృద్ధ బ్రాహ్మణ రూపమును ధరించి బయలు దేరును. ఇదివఱకొంతఁడే అయ్యెడువాఁడు. ఇప్పుడు భీమార్జు నులను గూడా బ్రాహ్మణాల నొనర్చును. ముగ్గురును కురు జాంగల దేశముల కుండాపోయి గంగా, యమునా, సరయూ శోణ మొదలగు పవిత్ర నదులను దాటి పాంచాల, కాన్య

కుబ్జ, మత్స్య, కోసల, కరుష, కాశీ, మిథిలాది రాజ్యముల కుండా మగధరాజ్య సీమకు జేరుకొనిరి. అచ్చటవారు గోరఖమును నొక చిన్న పర్వతమును గాంచిరి. అది మగధ దేశము లోనికిని జొచ్చుకొని యుండెను. అచ్చటికెక్కిన తరువాతఁ గృష్ణుఁడు భీమార్జునులకు నానావృక్షములచే సుశోభితమై, ఫలవృక్షములతోఁగూడిన మగధ రాజధానినిఁ గాంచిరి.

మగధ దేశము బహు జలపూర్ణమును, సమృద్ధశాలియునగు దేశము. దానిలో ధాన్యము బాగుగా పండును. ఎత్తుననుండి చూచినచో భూమికి ఆకుపచ్చ రంగు వేసినట్లు పొలములుండును. గిరివ్రజము నైదుకొండలచేఁ జుట్టుకొని యుండెను. వానిమీఁద నాటవిక పొదలును, లతలును వ్యాపించియుండెను. ఈ దేశము శత్రువులనుండి సదా సురక్షితము. ఈ సమృద్ధశాలియగు దేశమందే జరాసంధుఁడు రాజ్య మొనర్చుచుండెను. అట్లు పర్వతపరివృతమైన దుర్గమునందే ఆతఁడు రాజులను బంధించియుండెను.

భీమార్జున వాసుదేవులు ముగ్గురును బర్వతముపై నెక్కి మగధదేశము రాజధానియొక్క శోభను నయనాభిరామముగఁ గాంచుచుండిరి. దానిలో శీతల జలస్రోతలును, ఉష్ణజల స్రోతలు నుండెను. కృష్ణుఁడు భీమార్జునులతో నిట్లనెను :- "మన జరాసంధునికడకు శత్రుభావముతోఁ బోవు

చున్నాము. మిత్రభావముతోఁ బోయినచోఁ బ్రధాన ద్వారమునఁ బోవలసియుండును. శత్రువు ముఖ ద్వారమునఁ బోరాదు. దుర్గమును బడగొట్టి విపరీత మార్గమునఁబోవలయును.''

భీమార్జును నిట్లనిరి :- 'నీ యాజ్ఞ ప్రకారమే. మేము మీ కధీనులము. ఇది విని కృష్ణుఁడా సోదరులతో వెనుక కుండ చైత్యక పర్వతము మీఁద కెక్కిరి. దానిమీఁద మూఁడు పెద్దపెద్ద నగారీ లుంచఁబడెను. జరాసంధుని తండ్రి బృహద్రథుఁడు వృషాసురుఁడను నసురునిఁ జంపి, వాని చర్మముతో దానిని నిర్మించెను. ఆ నగారాలు శుభములుగ నెంచఁబడును. వానిని జరాసంధుఁడు పూజించును. వీరు ముగ్గురును నా నగారాలను బగులఁగొట్టిరి. అంతవారు పర్వతముపైన నున్న పరకోటను బగులఁగొట్టి, ఆ మార్గమున నగరమునఁ బ్రవేశించిరి. దౌర్భాగ్యము చేతనో, సౌభాగ్యము చేతనో వారి కొక మాలలమ్మువాఁడు కనఁబడెను. ఏవైనను లాగుకొనుట శ్యామసుందరున కలవాటే. వాని వద్దనుండి బలవంతముగ వానిని లాగుకొని ముగ్గురును ధరించిరి. ఈ విధముగ సుందర మాలలను ధరించి, అస్త్రశస్త్రములు లేకయే బ్రాహ్మణవేషములను ధరించి వారు ముగ్గురును జరాసంధుని సమీపమునకుఁ బోయిరి. ద్వారపాలురు బ్రాహ్మణులనుకొని వీరి నడ్డగింపలేదు. వీరు సరిగా భోజన సమయమునకు జరాసంధుని సమీపమునకు జేరుకొనిరి.

జరాసంధుఁడు గొప్ప బ్రాహ్మణభక్తుఁడు. తేజస్వులగు నీ ముగ్గురు బ్రాహ్మణులు వచ్చుటను గాంచి ఆతఁడు లేచి నిలుచుండెను. ఆతఁడు విధ్యుక్తముగ ముగ్గురకును మధు మొసంగి, అతిథిసత్కార మొనర్చెను. కాని వీ రాతిథ్య సత్కారము కొఱకై వచ్చినవారు కారు. వీరు పోరాడ వచ్చిరి. మోస మొనర్ప వచ్చిరి. వీరికి నాయకుఁడు మహా మాయావి శ్రీకృష్ణుఁడు. కృష్ణుఁ డిదివఱకే మీ రొక్క మాటైన మాటలాడరాదని వారిని శాసించెను. అన్నిటిని తానే మాటలాడెద ననెను. వీరిద్దరును భగవానుఁడు చెప్పినట్లు వినువారు. అందువలన మెదలక కూర్చుండిరి. జరాసంధుని పూజకు వారేమియును మాటలాడలేదు. జరాసంధుఁడు వీరిని కుశలప్రశ్నలు చేయఁగా నప్పుడును నీ కృష్ణుఁడే యిట్లనెను :—"ఈ యిద్దరును స్నాతన బ్రహ్మచారులు. మౌనులు. అర్ధరాత్రికి వీరి మౌనము పూర్తి కాఁగలదు. అప్పుడు వీరు మీతో మాట్లాడగలరు."

జరాసంధుఁ డిట్లనెను :–'మంచిది. మీరు మా అగ్నిహోత్రశాలలో సుఖముగ నివసింపుడు. ఈ సమయమున మీరేమి భోజన మొనరించెదరు ?'

కృష్ణుఁ డిట్లనెను :– 'ఈ సమయమున మేము భోజన మొనర్పము, రాత్రియందే అన్నియును జరుగఁగలవు.'

ఇదివిని ఆతఁడా ముగ్గురకును ఉండుటకై యజ్ఞశాల సమీపమున నతిథిశాలయం దేర్పాటు కావించెను. ఏర్పా

ట్లన్నియును గావించి ఆతఁడు అంతఃపురములోనికిఁ బోయెను. ఆతని కీ ముగ్గురు బ్రాహ్మణుల వ్యవహారమున నాశ్చర్యము కలుగుచుండెను. సందేహమును గలుగుచుండెను. ఆతఁడు బ్రాహ్మణభక్తుఁడు కదా! అర్ధరాత్రివేళ కాతఁడు వీరిఁ గలిసికొనుటకు వచ్చెను.

రాజు వచ్చుచుండుటను గాంచి ఛద్మవేషధారు లగు నీ ముగ్గురును లేచి నిలుచుండిరి. రాజు వీరికిఁ బ్రణామము కావింపఁగా, వీరును నాతని నాశీర్వదించిరి. సుఖముగఁ గూర్చుండిన తరువాత జరాసంధుఁడిట్లడిగెను:–'మీ రెవరు! ఎచ్చటినుండి వచ్చినారు. మీ కేమి కావలయును ?'

ఇది విని కృష్ణుఁ డిట్లనెను :– 'రాజా! నీకు మంగళ మగుగాక! కల్యాణ మగుగాక! మేము మీ కతిథులము. మేము చాలదూరమునుండి మీ దానప్రశంసను విని మాకు కావలసిన వస్తువు నిచ్చెదరను నాశతో వచ్చితిమి.'

జరాసంధుఁ డిట్లనెను :–'ముందుగా మీ కేమి కావలయునో చెప్పినచో, నా వస్తు వీయదగునో, కాదో విచారించెదను.'

ఇది విని కృష్ణుఁడు పకపక నవ్వుచు నిట్లనెను :— 'రాజా! మేము మీ దానమును గూర్చియు, మీ సాహసమును గూర్చియు నెంతో వినియున్నాము. దాత దాన మిచ్చునపుడు వెనుకముందులను జూడఁడు. ఆతఁడు సమ్ము

ఖమునకు వచ్చిన యాచకులకు సమస్త కోర్కెలను నెఱవే ర్చును. ఆతని దానమానములచేఁ బూర్ణముగ సంతోష పడుచును. తితిక్షు వెట్లు సమస్త దుఃఖములను సదా సహిం చుటకు తత్పరుఁడగునో, ఏ విధముగఁ బాపియు, దుష్టుఁడు నగువాఁడు సమస్త పాపములను వెనుకముందు లాడక యొనర్చునో, అ దేవిధముగ నుదార పురుషుఁడు తన సర్వస్వ మును సమర్పించుటలో నెన్నటికిని వెనుకాడఁడు ముందుగా విని, ఆలోచించి, తరువాత చెప్పుటయును, హాని లాభము లను జూచుకొని ప్రత్యుత్తర మొసంగుటయును వ్యాపారి యొక్క లక్షణము. శత్రువులుందురు, మిత్రులుందురు. అన్నిటిని బాగుగాఁ దెలిసికొని వ్యవహార మొనర్పవలయు ననుట వ్యాపార లక్షణమే కాఁగలదు.'

జరాసంధుఁ డిట్లనెను :-"నీవు చెప్పునది నిజమే. అయినను నేను రాజును. నాకు పుత్రులును పౌత్రులును, మంత్రులును, పురోహితులును, గలరు. శత్రువులు మిత్రు లుందురు. అన్నిటినిఁ దెలిసికొని వర్తింపవలసియుండును."

భగవానుఁడు వ్యంగ్యముగ నవ్వుచు నిట్లనెను :- "రాజా! మీరేమి మాటలు మాటలాడుచున్నారు. నరేంద్రా! సమదర్శియును, దాతయును ఉదారుఁడును, స్వపర భేదములనెంచఁడు. అట్టివానికి వసుధ అంతయును దన కుటుంబమే. రాజా! ఈ శరీరము నశ్వరమైనది. సుయు

శము అవినాశియైనది. నశ్వరమగు నీశరీరముచే, సత్పురుషులచే గాన మొనర్పఁబడు విశుద్ధకీర్తిని సంపాదించుకొనకుండినచో నట్టివాని మానవజన్మము వ్యర్థము. రాజ్య, ధనవైభవముల నెవఁడైన వెంటఁగొనిపోవునా ? అవన్నియు నిచ్చటనే యుండపోవును. కీర్త్యపకీర్తులు మాత్రముండును. రాత్రింబవళ్ళు ఇతరుల రక్తమాంసములను బీల్చి పీల్చి, తన మాంసమును బెంచుకొనినవాఁడు బలిసిన తన శరీరమును దన వెంటఁ గొనిపోవునా ? వాని అపయశస్సు మాత్రము మిగులును. పరోపకార మొనర్చుచు శరీరమును శుష్కింపఁ జేసినచో, నాతని శరీరమును నిచ్చటనే నిలిచిపోవును, కాని వానికీర్తి శాశ్వతముగ నుండును. చూడుఁడు, హరిశ్చంద్ర చక్రవర్తి దానమొసంగి అజరామరుఁడైనాఁడు."

అంత జరాసంధుఁ డిట్లడిగెను :-"బ్రాహ్మణదేవా ! హరిశ్చంద్రునియొక్క కీర్తి యిప్పటివఱకే పుణ్యప్రభావమున నున్నది ?"

భగవానుఁ డిట్లనెను :-"రాజా ! విశ్వామిత్రుఁ డడుగఁగా సూర్యవంశ దీపకుఁడగు హరిశ్చంద్రుఁడు తన సర్వస్వమును దానమొనర్చెను. ఆతఁడొంటి వస్త్రముతోఁ దన భార్యతోడను, బుత్రునితోడను నిలువెడలెను. విశ్వామిత్రుఁ డాతని దానములు సాంగముగ నొసఁగుమనికోరెను. అందువలన నాతఁడు తన భార్యను పిల్లవానిని అమ్మెను,

తాను చండాలున కమ్ముడు పోయెను. ఆతని యీదాన నిష్ఠచే బ్రహ్మేంద్ర ధర్మాది దేవతలు ప్రసన్నులైరి. ఆతఁడు తన ప్రజల నందఱను స్వర్గమునకుఁ గొనిపోయెను. దాన ప్రభావముచేతనే ఆతని కీర్తి నేఁటికిని జగమున నిలిచి యున్నది. ఇదే విధముగ రంతిదేవుఁడును అతిథి సత్కార మొనర్చి సమస్త పుణ్యలోకములను జయించెను. ప్రపంచ మంతయును నాతనికీర్తి నిప్పటికిని గానమొనర్చెదరు.''

జరాసంధుఁ డిట్లనెను :-''రంతిదేవుఁ డెవరి కాతిథ్య మొసఁగినాఁడు, ఆతనికీర్తి యిప్పటికి నేల కలదు ?''

భగవానుఁ డిట్లనెను :- ''రాజా! చంద్రవంశజుఁడగు రంతిదేవుని అన్నగురువు రాజైయుండెను. ఆతఁడాతనికి నియమిత వృత్తినొసంగెడువాఁడు. ఇంకెవరి నడుగకయే దానితోడనే గడుపుకొను చుండెడువాఁడు. ఒకసారి నలువది యెనిమిది దినముల వఱకును రాజున కేమియును లభింపలేదు. నలుబది తొమ్మిదవ దినమున ఘృతయుక్తమగు పాయసమును, హల్వా మొదలగునవి లభింపఁగా వానినిఁ బరివారముతోఁ దినఁబోఁగాఁ త్రిమూర్తులు వారి భార్యలతో బ్రాహ్మణ, శూద్ర, చండాల రూపములను ధరించి వచ్చిరి. ఆతఁడు మూఁడు సారులు తనవద్దనుండిన వస్తువుల నన్నిటినిఁ దాను తినక సంతోషముతో వారికొసంగెను. ఆతని కొక్క జలబిందువైనను దొఱకలేదు. అతఁడు తన

యీ అమోఘ దాన ప్రభావముచే నజరామరుఁడయ్యెను. ఆతని విమలకీర్తి ప్రపంచమున వ్యాపించెను. ఇదేవిధముగ నొక శిలోంఛవృత్తికల ముద్గల మహామునియును అన్న దానముయొక్క ప్రభావముచే స్వర్గమందలి దేవతలకును బూజనీయుఁడయ్యెను.''

జరాసంధుఁ డిట్లడిగెను :-''విప్రవరా! ముద్గలముని యెవరికెంత అన్నము నొసఁగినాఁడు ? ప్రపంచమున నింతటి ఖ్యాతి ఆతని కెట్లు కలిగినది ?''

భగవానుఁ డిట్లనెను :-''రాజా! కురుక్షేత్రమందు ముద్గలుఁడను నొకముని యుండెడివాఁడు. ఆతఁడు పక్షుల వలెఁ బొలములందు రాలిన గింజలనేరుకొని వచ్చెడువాఁడు. ఆతఁడు రోజును బ్రోవుచేసి పదునైదు దినములు ధాన్యమును బ్రోవుచేసెడువాఁడు. ఈ పదునైదు దినములును బ్రోవుచేసిన దానిని మిగిలిన పదునైదుదినములలో నతిథి పూజయును, శ్రాద్ధాదులకును, బరివారము నకును వినియోగించెడువాఁడు. ఆపక్షములో తగ్గినచో నుపవాసముండెడు వాఁడు.

ఒకసారి ఆతఁడు పదునైదు దినముల అన్నమును బ్రోవుచేయఁగా, నాదినముననే ఉన్మత్తవేషమున దుర్వాస మహాముని ఆతని కతిథిగా వచ్చెను. ముద్గల మహాముని ప్రేమ పూర్వకముగ నాతనికి స్వాగతమొసంగెను. భోజనమును జేయించెను. ఆతనికడ నెంతటి అన్నము కలదో దానినంతను

దుర్వాసుఁడు తినివైచెను. ఆతఁడొక పక్షముపవాసముండెను. మరల రెండవ పక్షమునఁ దినఁబోవుచుండఁగా మరల దుర్వాసుఁడు వచ్చి అంతయును మ్రింగివైచెను. ఈవిధముగ నాలుసార్లు వచ్చి దుర్వాసుఁడు తినిపోవుచుండెడువాఁడు. అయినను నాతని మనస్సులో నేవిధమగు నుద్వేగమును గలుగలేదు. ఆతఁడు పూర్వరీతిని స్వాగతమొసంగుచునే యుండెను. ఈ దానము వలన నాతని కీర్తి గౌరవములు ప్రపంచమున వ్యాపించుటయే కాక మృత్యువునుగూడ జయించెను. శిబిచక్రవర్తి కపోతమైన ధర్మముకొఱకు తన శరీరమాంసమును గోసియిచ్చెను. విరోచన పుత్రుఁడగు బలిచక్రవర్తి తెలిసి తెలిసి వామనుఁడైన భగవంతునకు దన సర్వస్వము నొసంగెను. దాని నింద్రునకొసంగెను. వీరందఱును మానవులు, రాజులు. పక్షియయ్యును గపోత మొకటి అతిథియైన వ్యాధునకు శరీరమునొసంగి అమరమై, వ్యాధునిగూడ అమరు నొనర్చెను.

జరాసంధుఁ డిట్లడిగెను :- ''విప్రవరా ! కపోతము తన శరీరము నేలయిచ్చెను. వ్యాధుఁడేల అమరుఁడైనాఁడు?''

ఇది విని భగవానుఁడిట్లనెను :- ''రాజా ! ఆతిథ్యము యొక్క సర్వోత్కృష్టమగు నుదాహరణము నొసంగెదను వినుము. ఒక వేటగాఁడు చలికాలమునఁ బక్షులను బట్టు కొనుటకు అడవికిఁ బోయెను. ఆ దినమునఁ జాల చలివైచెను.

ఆతఁడు చలికి వణఁకుచు నొక చెట్టుక్రిందకుఁ బోయెను. అచ్చట చలిచే వణకు కపోతమొకటి యుండెను. దాని నాతఁడు పట్టుకొని పంజరమునఁ బడవైచెను. సాయంకాల మయ్యెను. ఆతఁడదే వృక్షముక్రిందఁ బరుండెను. ఆ చెట్టు మీఁదనే యీ కపోతముయొక్క భర్త అనఁగా మగది యుండెను. అది పంజరమున నుండిన ప్రియురాలిని గుర్తించెను. ఇద్దరు నేడ్చుచుండిరి. వ్యాధుఁడు లేచి చలికి వణఁకుచుండెను. కపోత మిట్లనుకొనెను :- "ఈతఁడు నా అతిథి. ఈతని సేవనొనర్పవలయును. అదెగిరిపోయి కమ్మరివాని కొలిమిలోనుండి వెలుఁగుచుండిన నొక కొరివిని దెచ్చెను. ఎండు పుల్లలు లేవు. అది తన ముక్కుతో నెండుపుల్లలను విఱిచి క్రిందఁబడవైచెను. వ్యాధుఁడు పుల్లలువైచి అగ్నిని ప్రజ్వలింపఁజేసెను. ఆతఁడు శరీరమును గాచుకొనుటచేఁ జలి పాఱిపోయెను. ఆతనికి బాగుఁగా నాఁకలివైచెను. ఆతఁడు కపోతముతో నిట్లనెను :- "నాకు బాగుగా నాఁకలి వైచుచున్నది. తినుటకేమైన నిచ్చెదవా ?"

కపోతఁ మిట్లనెను :- "మేము వనవాసులము. అన్న సంగ్రహమొనర్పము. గింజలనేరుకొని తినెదము. అపరిగ్రహులమై వృక్షమున నివసించెదము. నావద్ద నీకొసంగుట కేమియును లేదు." ఇది వినఁగానే వ్యాధుఁడు నిరాశుఁడయ్యెను.

ఇప్పుడు కపోతమునకు తానొసంగిన మాటమీఁద దుఃఖముకలిగెను :- "అయ్యో! నేనీ యతిథికేల మాట యిచ్చితిని. మాట తప్పితినికదా! నాశరీరమున్నదికదా! ఈ క్షణభంగుర శరీరమువలన నెవరికైన నుపకారము కలిగి నచో నింతకుమించిన సదుపయోగమేమియుండును?" అని యాలోచించుకొని మండుచుండిన నాయగ్నియందు పడి యిట్లనెను :- "నాశరీర మిదిగో. దీనినిఁ దిని నీ యాకలిని దీర్చుకొనుము."

కపోత మగ్నిలోఁబడి చచ్చిపోయెను. దాని యీ యనుపమ త్యాగముచే వ్యాధునకు మిక్కిలి వైరాగ్యము కలిగెను. ఆతఁడిట్లనుకొనెను :- "అయ్యో! నేనెంతటి పాపిని. పక్షి యయ్యు నిది పరోపకారముకొఱకు తన శరీరము నగ్ని కర్పించినది. ఈ పాపపు పొట్టకై నిరంతరము పాపమునే చేయుచుంటిని. ఇప్పుడు నేనును మంటలోఁబడి యిట్టి గతినే పొందెదనుగాక!" అని యాలోచించి ఆతఁడు వలను, పంజర మును, కత్తిని, సమస్తవస్తువులను దానిలోఁ బారవైచెను. కపోతమును దినలేదు. ఆడపావురమును వదలివైచి, వనము నకుఁబోయి ఘోరతపస్సును జేసి స్వర్గమునకుఁబోయెను. ఇచ్చట నాడుపావురమును మగపావురముతో బాటు అగ్నిలో బడి మరణించెను. కావున రాజా! పక్షియైన పావురమే శరీరము నతిథికొఱకు కాల్చివేసికొనఁగా నీవు రాజువయ్యును,

పైఁగాఁ జక్రవర్తివై అతిథిసత్కారమునకు వెనకాడెదవేల!
"మీరేది అడిగిన దాని నొసంగెదనని హృదయమును విప్పి
చెప్పివేయుము."

ఇఁది వినగాఁనే జరాసంధున కుత్సాహము పెరిగెను,
ఆతఁ డిట్లనెను:-"అయ్యా! నీవు విద్వాంసుఁడవును, నీతిజ్ఞు
డవునై యున్నావు. కాని నీబ్రాహ్మణత్వమునుగూర్చి నాకు
సందేహముకలుగుఁచున్నది. పైగాఁమీముగ్గురి ఆకృతులును
నాకు బరిచితములుగఁ గోచరించుచున్నవి. మీ చేతులలో
ధనుర్బాణములను బట్టినట్లు గుర్తులును గనబడుచున్నవి. మీ
శరీరములును బ్రాహ్మణుల శరీరములవలె లేవు. మీ శరీర
ములు క్షత్రియుల శరీరములవలె గండరములతో మెలి తిరిగి
యున్నవి. ఈ కారణములను బట్టి మీరు క్షత్రియులను
అనుమానము కలుగుచున్నది. మీరు భయముచేతనో,
లోభవశముననో బ్రాహ్మణులవలె వేషములను వేసికొనినా
రని తోచుచున్నది. మీరు మీయథార్థ వృత్తాంతములను
జెప్పుఁడు."

భగవానుఁ డిట్లనెను :-"మే మెవరమును గాము;
మీ యెదుటకు యాచకులమై వచ్చితిమి కదా! మీఁరీయఁ
దలచిన నీయఁడు లేకున్న లేదనుఁడు. మేము నిరాశులమై
తిరిగి పోయెదము, మేము నిన్నుఁ బలవంత మొనర్పము
'అవును' లేక 'కాదు' ఈ రెంటిలో నేదియో చెప్పుము."

ఇది విని జరాసంధుఁ డిట్లనుకొనెను :-''నేను వీరితో గాదనినచో నాకీర్తి అంతయును నశింపఁ గలదు. ప్రపంచమున నాకపయశము వ్యాపింపఁ గలదు. వారెవరైనఁ గానిండు. నావద్దకు బ్రాహ్మణ రూపమున యాచనకు వచ్చినారు. వీరి కోరికను నేను నెఱవేర్చి తీరవలయును. అసుర రాజగు బలిచక్రవర్తి కడకాతని రాజ్యమును హరించుటకై విష్ణువు బ్రాహ్మణవేషముతో బోయినాడు. తన కులగురువగు శుక్రాచార్యులాతఁడు మాఱువేషమున నుండిన విష్ణువని చెప్పియుండెను. అయినను నాతని గురువుమాట వినఁ లేదు. వామనుఁడు మాయచే నాతని వైభవము నంతను బాగుకొనినాడు. ఆతని రాజ్యము పోయినది కాని, ఆతని నిర్మలకీర్తి నేఁటికిని దశదిశల యందు వ్యాపించి యున్నది. ఈ ఆకాశమండల మంతయును యశస్సుచే వ్యాపించి యున్నది. ధనవైభవములు వెంటరానేరావు. కీర్త్యపకీర్తులే నిలుచును. క్షత్రియులకు ముఖ్యమగు ధర్మము బ్రాహ్మణులను సంతోష పెట్టుట. బ్రాహ్మణుని సంతోష పెట్టని క్షత్రియుని జన్మ కాల్పనా ? క్షణ భంగుర మగు నీ శరీరముండియు యశమును సంపాదించుకొనక యుండినచో నట్టివాడు శరీరమును ధరించుట వ్యర్థము. వీరు బ్రాహ్మణులగుగాక, క్షత్రియులగు గాక, వైశ్యులగు గాక, శూద్రులగుగాక ఎవరైన గానిండు వీరు నాకడకు భిక్షుకులై వచ్చినారు కావున

వీరు వృథాగాఁ బోరాదు. వీరేమి యడిగిన దాని నీయవల యును.'' ఇట్లాలోచించుకొని జరాసంధుఁడు ముగ్గురు కపట బ్రాహ్మణులతో నిట్లనెను :-''విప్రులారా! మంచిది. మీ కేమి కావలయునో సంకోచములేక అడుగుఁడు. మీ కోర్కను నెఱవేర్ప గలనను పూర్తి చేసెదను.''

భగవానుఁడు వాని మాటను గట్టి చేయుటకై యిట్లనెను :-''రాజా! బాగుగా నాలోచించుకొనుము. తరుఁ వాత బశ్చాత్తాపడిన బాగుండదు.''

దృఢతా స్వరమున జరాసంధుఁ డిట్లనెను :-''ద్విజ వరా! మీరేమి మాటలు మాటలాడుచున్నారు? కన్యా దానము నొకసారియే యెట్లు చెయబడునో అట్లే సజ్జనుఁ లొక్కసారియే మాట నిచ్చెదరు. మీరు నా రాజ్యమును, సర్వస్వమును, అంతేకాదు నాశిరము నడిగినను మీకొసంగె దను.''

ఇది విని భగవానుఁ డిట్లనెను :-''రాజా! మేము నిన్ను ద్వంద్వయుద్ధమును యాచింపుఁ చున్నాము.''

ఆశ్చర్యముతో జరాసంధుఁ డిట్లనెను:-''బ్రాహ్మణు లతోఁ దెలిసి తెలిసి యెవరు యుద్ధమును జేయఁ గలరు! బ్రాహ్మణుల పని యుద్ధమును జేయుట కాదు. వారికి క్షమయే అస్త్రము. యుద్ధమును సమ్మానమును, ఐశ్వర్య మును, రాజ్యమునుగోరు క్షత్రియు లొనర్తురు.''

భగవానుఁ డిట్లనెను :-"రాజా! నీవు మమ్ములను క్షత్రియులుగా దెలిసికొనుము. మేము నిజమునకు భిక్ష నడుగుటకు వచ్చిన బ్రాహ్మణులము కాము."

ఉలికిపడి జరాసంధుఁ డిట్లనెను :- "మీరే క్షత్రియులు? ఈ భూమండలమున నాచే జయింపఁబడిన క్షత్రియు లెవరును లేరు. యెదుట యుద్ధమున నిలువఁగల వారెవరు? మీను యథార్థ విషయమును జెప్పుఁడు"

ఇది విని భగవానుఁడిట్లనెను :- "రాజా! ఈతఁడు పాండురాజు పుత్రుఁడగు భీమసేనుఁడు. ఈతఁడీతని తమ్ముఁడును గాండీవ ధనుర్ధారియగు నర్జునుఁడు".

జరాసంధుఁడిట్లనెను :- "ఇంత సేపటి నుండియును బిచ్చికివాని వలెనుండి యుక్తిగ మాటలాడు నీవెవరు ?"

భగవానుఁడిట్లనెను :- "రాజా! నీవు నన్ను మఱచినావా యేమి ? నీవు నన్ను మఱచినను నేనుమాత్రము నిన్ను మఱవఁజాలను. నీవు మామాను మామవుకావా ? నీకును నాకును బదునేడు సారులు యుద్ధము జరిగినది. నేను వీరి మామకుమారుఁడనగు వాసుదేవుఁడను. నన్నుఁగృష్ణుఁ డందురు నీకు పాత విరోధిని".

ఇది వినఁగానే బిగ్గఱగ నేల చఱచి నవ్వనారంభించెను. నవ్వుచు నవ్వుచు నిట్లనెను :- "ఓరీ పోరుబోతా! ఎట్టి వేషమును వేసికొనివచ్చినావురా? నోటిలోనేమి పెట్టుకొని

వచ్చినావు? వాక్కు కూడ మారిపోయినదే. నీవెంత దాగినను నీ యాకృతి దాగదు. నేనెచ్చటనో వీనిని చూచితినే మెవఁడా యాతఁడను కొనుచున్నాను. మోసగాఁడా? మాయలమారి మాధవా! నీకు నాతోఁ బోరాడ సాహస మున్నదా?"

నవ్వి కృష్ణుఁడిట్లనెను :- "సాహసమే లేకుండిన— శత్రువుయొక్క గృహమునకు— కోటను బగులఁగొట్టి యెట్లు రాఁగలము? మా ముగ్గురిలో నీవెవరితోనైనను యుద్ధమొనర్పవచ్చును. ఇప్పుడే నీవు మాకు మాట నిచ్చితివి. దానిని నీవు తప్పకూడదు".

జరాసంధుఁడు నవ్వి యిట్లనెను :- "మాట తప్ప వలసిన పనియేమున్నదయ్యా? నేను యుద్ధమునకు సిద్ధముగఁ గూర్చుండి యుందును. అయితే నాకు నాతో యుద్ధమును జేయఁగలవాఁడు దొఱకవలెను".

భగవానుఁడిట్లనెను :- "మేము ముగ్గురము నిన్ను సవాలు చేయుచున్నాము."

జరాసంధుఁడు నవ్వి యిట్లనెను :- "నిర్లబలుఁడ వగు నీతోఁబోరి నే నపయశము పాలు కాఁబలఁచలేను. బుద్ధిమంతుఁడగు వాఁడు తనకంటెఁ జిన్నవానితో యుద్ధము నొనర్పరాదు. చిన్నవాని మీఁద గెలిచిన నది ప్రశంసనీయ మగు విషయము కాదు. ఓడిపోయినచో మిక్కిలి అపయ

శస్సు రాఁగలదు. ఇప్పుడు నీవు నపుంసకుఁడవు. నీతో నేమి పోరుదును. నీవు పారుబోతువు, పిఱికివాఁడవు. నీవు నా భయముచే నీజన్మభూమిని వదలిపెట్టి సముద్రమధ్యమున దాఁగియున్నావు. మీ పైతృక రాజధానిలో నుండు సాహసమును నీకు లేకపోయినది. నీవు భీరువు. అస్థిరచిత్తము కలవాఁడవు. నిన్ను నేనోడించితిని, ఇప్పుడు నేను నీతో మాత్రము యుద్ధము చేయను''

నవ్వి భగవానుఁడిట్లనెను :- ''పోనిమ్ము నాతో బోరాడవలదు, అర్జునితోఁ బోరాడుము. ఈతని నీవెన్నఁడును నోడింపలేదు కాదా ?''

అవహేళనా స్వరమున జరాసంధుఁ డిట్లనెను :- ''ఈ కుఱ్ఱవానితో నేనేమని ద్వంద్వయుద్ధమొనర్తును? ఈతని ప్రంశంసను వినియుంటిని. ఈతఁడు మూఁడు విండ్లతో బాణములను సంధింపఁగలఁడట. లక్ష్యవేధలో నీతఁడు గొప్పనిపుణుఁడే కాని యీతనిలో నా సరిసమానమగు బలమెక్కడిది? వయస్సుది లెక్కలేదు. పది, పండ్రెండు సంవత్సరముల తేడా సమానవయస్సుగానే యెన్నఁబడును. కాని బలముసమానముగ నుండినచే జోడు ప్రశంసనీయముగ నుండును. కావున నీతడుఁను నాకు జోడు కాడు.''

భగవానుఁ డిట్లనెను :-అట్లైన భీమసేనునితో బోరాడుము.''

కొంచెమాగి యాగి జరాసంధుఁ డిట్లనెను:-"అవును. నే నీతని ప్రశంసను విని యుంటిని. ఈతనికి పదివేల యేను గుల బలమున్నదని విని యుంటిని. నాకువలె నీతని శరీర మును బలముగను, హృష్ట పుష్టముగను నున్నది. వీనితో నేనుబోరాడెదను. నాకును నీతనికిని జోడు ఉచితముగ నుం డును."

భగవానుఁ డిట్లనెను :-"మంచిది. ఈతని తోడనే పోరాడుము. నీవెవరితోనైనను సరియే యుద్ధమునకు సిద్ధఁ పడుము. ఎవరితోఁ బోరాడినను నిన్నుఁ జంపికాని యిచ్చట నుండి పోము. నీవు చాలమంది రాజులను బందీలుగా నొన ర్చితివి. రాజుల నవమానించుటచే నీవు వధ్యుఁడ వైతివి."

జరాసంధుఁ డిట్లనెను :- "నన్నుఁ జంపెదరో మీరే చచ్చెదరో కాలము తెలుపఁగలదు. ఊరక వాగిన నేమి లాభము ? ఇంక నెక్కువగ మాటలాడిన నేమిలాభము ? ఇంక నెక్కువగ మాటలాడవలసిన పనిలేదు. రేపు నాకును భీమునకును ద్వంద్వయుద్ధము జరుగఁగలదు."

భగవానుఁ డిట్లనెను:- "నీవు ధర్మాత్ముఁడవు. మేము పనినెరవేర్చుకొన వచ్చినవారము. నీవు నీబంధువులను బాంధవులను గలిసికొని చెప్పుకొని రమ్ము."

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! ఇది విని జరా సంధుఁడు లేచి వెడలిపోయెను. కృష్ణుఁడు భీమార్జునులతో

నవ్వుచు మాటలాడుచుండెను. ఇప్పుడు జరాసంధ భీమ సేనుల కెట్లు యుద్ధము జరిగినదియు వర్ణించెదను వినుఁడు."



## జరాసంధ భీముల ద్వంద్వ యుద్ధము

శ్లో॥ తతః సమే ఖలేవీరౌ సంయుక్తావితరేతరౌ।
జఘ్నతు ర్వజ్ర కల్పాభ్యాం గదాభ్యాం రణదుర్మదౌ॥
—శ్రీ.భా.౧౦ స్కం. ౭౨ అ. ౩౮ శ్లో॥

క॥ కరువలి సుతునకు నొక భీ
కర గద నిప్పించి యొక్క గదఁ దన కేలన్
ధరియించి నలువురును గ్రచ్చఱఁ
బురి వెలికేగి యచట సమతల భూమిన్॥
—శ్రీమదాంధ్ర భాగవతము.

ద్వంద్వయుద్ధమున నత్యంత సుందరమగు కళ కలదు. దీనిలో యుద్ధమొనర్చువారికిని ఆనందము కలుగును. దర్శకులకును మనోరంజనము కలుగును. ఇద్దరును బలవంతులగుచోఁ జేతులు కాళ్ళతోనైనను యుద్ధమొనర్చెదరు. కఱ్ఱ, కత్తి, గదాదులచేనైన యుద్ధమొనర్చెదరు. ఇందులో మూఁడవ వాఁడు మధ్యలో రాఁడు. మల్లు లిద్దరును బోరాడుకొందురు. ప్రాచీనకాలమున మల్లయుద్ధ మెక్కువగఁ బ్రచారములో

నుండెడిది. బలము తగ్గిపోవుటచే నీవిద్య ఇప్పుడు నష్టప్రాయ మైనది. ప్రజలకు శుద్ధమగు నాహారము దొఱకుటలేదు. శరీరముందును వెనకటి వలె బలోత్సాహములు లేవు. అట్టి యెడఁ బోరాడుఁటెట్లు ?

సూతుఁ డిట్లనెను :- "మునులారా! భీమ జరాసంధు లకు ద్వంద్వయుద్ధము జరుగునట్లు నిశ్చయమయ్యెను. జరా సంధుఁడీ ముగ్గురితో అత్యంత మిత్రతాపూర్ణ వ్యవహార మొనర్చెను. ఆతఁడాతని మంత్రులతో నిట్లనెను :- "నేఁడు నగరమునకు బయట సుందర యుద్ధభూమిని నిర్మింపుఁడు. నాకును భీమసేనునకును జరుగు ద్వంద్వయుద్ధమును నాల్గు వర్ణములవారును జూడఁగలుగునట్లేర్పాటు చేయుఁడు."

మంత్రులు రాజాజ్ఞను వెంటనే పాలించిరి. ఒక సమ భూభాగమున యుద్ధస్థలి యేర్పఱుపఁబడెను. దానికి చుట్టును సోపానపద్ధతిలో జనులందఱును జూడఁగలుగునట్లు స్థలము నేర్పరచిరి. నియత సమయమునకు శ్రీకృష్ణచంద్రుఁడును, భీమార్జునులును, రథముపై నెక్కి జరాసంధుఁడును యుద్ధ భూమికిఁ జేరుకొనిరి. వారు ముందుగాఁ యుద్ధస్థలిని నిరీ క్షించిరి. జరాసంధుఁడు ముందుగాఁ దన పురోహితుని సమీపమునకుఁబోయెను. పురోహితుఁడాతనికి స్వస్త్యయ నము గావించి, మూర్ఛరాకుండ జేయు నోషధులను వాసన చూపించి, యింకను మంగళక్రియలొనర్చెను. ఇచ్చట

కృష్ణుఁడును భీమునకు స్వస్త్యయనమును గావించెను. అంత నవ్వుచు జరాసంధుఁడు రెండు గొప్ప గదలను దెచ్చియుంచి యిట్లనెను :- "భీమా! నీవీ గదలలో నొకదాని నెన్ను కొనుము. తరువాత బక్షపాతమొనర్చితినని అనగూడదు."

నవ్వి భీముఁ డిట్లనెను :-'రాజా! మాకు నీయందు విశ్వాసమున్నది. నీవే ఏదో ఒక గద నొసంగుము.'

ఇది విని జరాసంధుఁ డిట్లనెను:-'ఈ రెండు గదలొకే మాదిరిగ నున్నవి. ఇదిగో దీనిని నీవు తీసికొనుము. ఇదిగో దీనిని నేను తీసికొందును. మన కిద్దరకును యుద్ధము సంభవించుట ఇది అదృష్టవిషయము. నీతో యుద్ధమొనర్పవలయునని నా కెన్నాళ్ళనుండియో కలదు.' అని పలికి ఆతఁడొక గదను భీమసేనుని కొసంగి, తానొకటి దీసికొనెను ఆతఁడు బహుమూల్యములగు దన వస్త్రములను దీసివైసి, శిరమున నుండిన గిరీటమును దీసి, లంగోటినిగట్టి, దానిమీఁద చెడ్డీని ధరించి సింహమువలె యుద్ధస్థలమునకు వచ్చెను. ఇచ్చట భీమసేనుఁడును లంగోటిని ధరించి కృష్ణార్జునులకు గలిసికొని ఆతని ముందునకు వచ్చెను. ప్రథమమున వారిద్దరును నొకరి నొకరు పాదములను బట్టుకొని చేతులను గలుపుకొనిరి. గోదాములోని మృత్తికను శిరస్సుని ధరించి, యుద్ధమును బోరనారంభించిరి. ఇద్దర హృదయములును నుత్సాహభరితములై యుండెను. ఇద్దరును బరమ బలవంతులు. ఇద్దరును

వజ్రకఠోరములగు తమ గదలచేఁ బరస్పరము బాదుకొను చుండిరి. ఇద్దరును గుడి యెడమలకు దిరుగుచు ననేకములగు మల్లయుద్ధ కౌశలములను బ్రదర్శించుచుండిరి. ఇద్దరు లంగోటాలను, వానిపైన నెఱ్ఱని చెడ్డీలను ధరించి నటులవలె పేచీలను బ్రదర్శించుచుండిరి. ఇద్దరి గదలును సుదృఢములుగ నుండెను ఒకరినొకరు దెబ్బకొట్టుటకు గదలను విసరుచుండిరి. ఇద్దరును దమ ప్రతిద్వంది ప్రహారములను దప్పించుకొను చుండిరి. ఇద్దరును దమ తమ శత్రువుల నోడించుటకు పేచీలను బ్రదర్శించుచుండిరి. ఇద్దరి గదలును బరస్పరము తగులు నపుడు విపరీతముగు శబ్దమొనర్చు చుండెను. వా రిద్దరును మదగజముల వలెను, సింహములవలెను, ఆఁబోతుల వలెను బోరుచుండిరి. ఇద్దరును గ్రోధమునఁ బండ్లు పటపట కొఱుకు చుండ ఉరుము లురుముచున్న ట్లుండెను. వారు నిర్దయులై ఒకరిపై నొకరు గదలతోఁ గొట్టుకొనుచుండిరి. ఇద్దరి శరీరములును వజ్రములవలె నుండెను. వారు పరస్పరము భుజములు, నడుము, చరణములు, హస్తములు, పిక్కలు, మొదలగు వానియందుఁ గొట్టుకొనుచుండిరి. పరస్పరము లోహములతోఁ గొట్టిన నెట్లు రవ్వలు రేగునో, అదేవిధముగ వారు పరస్పరమును గొట్టుకొను గదాప్రహారములచే రవ్వలు రేగుచుండెను. ఆఁబోతులు పోరాడుకొనిన దారిలో నుండిన చెట్లెట్లు ముక్కలు ముక్కలగునో అట్లే ఆ గదలును ముక్కలు ముక్కలయ్యెను.

గదలు చూర్ణము కాగా వా రిద్దరు నిప్పుడు బాహు యుద్ధమునకు దిగిరి. మల్లయుద్ధమున జరాసంధుఁడు మిక్కిలి నిపుణుఁడు. భీమసేనుఁడును దక్కువవాఁడు కాడు. వారు పరస్పరము కవ్వించుకొనుచుండిరి. తాళములు చరుచుచుండిరి. ఆ తాళశబ్దము లాకాశమండలమంతయును నిండిపోయెను. వారొకరిపై నొకరెగిరి ప్రహారము లొనర్చుకొనుచుండ భూమి కంపించుచుండెను. ఒక్కొక్కప్పుడు కొట్టుకొనుచుండుదురు. ఒక్కొక్కప్పుడు గట్టిగాఁ బట్టుకొని వత్తుకొనుచుందురు. పిడికళ్ళను బట్టుకొనుటయు, సమమును భుజములతోఁ బట్టి బిగించుటయును, బరస్పరము బాహుపాశమును మెలివేయుటయును, క్రిందకుఁ బడవైచుటయును, మీఁదఁ గూర్చుండి నలుపుటయును, ఇట్లెన్నోరీతులఁ బోరాడుచుండిరి. ఇద్దరును సమరవిజయులే, శిక్షితులే, మల్లవిద్యానిష్ణాతులే. కొంచెము సేపటిలో వారు పర్వతాకారు లగుదురు. అవసరము వచ్చినపుడు వారు వారి శరీరములను ముడుచుకొందురు. వారి యుద్ధపేచీలను, చాతురిని గాంచి దర్శకులు మిక్కిలి యానందమును జెందుచుండిరి. సాధు సాధు అని చప్పట్లు చఱచుచుండిరి. ఒకరినొకరు నుత్సాహపరచుచుండిరి. శ్రీకృష్ణుఁడు మాటిమాటి కిట్లనుచుండెను :– 'భీమా ! ఈ రాజును బ్రదుకనీయవలదు. ధన్యుఁడవు. అద్భుతమైన పేచీని బ్రదర్శించితివి.' ఈ మాటలవలన భీమసేనుని యుత్సా

హాము పెరుగుచుండెను. ఆతఁడింక నెక్కుడుత్సాహముతోఁ బోరుచుండెను.

ఇద్దరును యుద్ధమున నుత్సాహముగ నుండిరి. పరస్పరము బరాజితు నొనర్పఁ దలఁచుచుండిరి. శిక్షణ, బలోత్సాహములయం దిద్దరును సమానులే. తమ ప్రతిద్వంద్వినిఁ బరాజితు నొనర్చుటకు నడుము కట్టుకొని యుండిరి. కాని యిరువురును బరాజితులగుట లేదు. భువన భాస్కరుఁ డస్తాచలమునకుఁ బ్రస్థానము కావించెను. భగవానుఁడిట్లనెను:- "ఇప్పుడు సూర్యాస్తమానమైనది. యుద్ధమునాపుఁడు. ఇది వినఁగానే యిద్దరును యుద్ధమునాపి పరస్పరము కౌఁగలించుకొనిరి. ఆదినము యుద్ధము పూర్తి యయ్యెను.

అందఱును నవ్వుచు మాటలాడుకొనుచు రాజభవనమునకు వచ్చిరి. అందఱును బరస్పరము మిత్రభావముతో నొకరి నొకరు కుశలము నడుగుకొనిరి. చుట్టాలవలె వెంబడి కూర్చుండి భోజనమొనర్చి హాయిగ నిద్రించిరి. ప్రాతఃకాలమున నిత్యకర్మలను బూర్తి కావించుకొని యుద్ధ స్థలమునకు వచ్చి యిద్దరును బోర నారంభించిరి. ఈవిధముగ వారిద్దరును నిరువదేడు రోజులు పోరిరి. ఎవ్వరు నింకొకరినిఁ బరాజితు నొనర్పలేదు. పగలంతయును నేమియును దినకయే శత్రుభావమున యుద్ధ మొనర్తురు. రాత్రి సమయమున మిత్రభావముతో నుందురు. ఆడుచుఁబాడుచు, నవ్వుచుఁ బ్రేలుచు నొకేసారి నిద్రించు చుందురు.

ఒక దినమున రాత్రియందు భీమసేనుఁడు నిరాశా స్వరమునఁ గృష్ణునితో నిట్లనెను:-"కృష్ణా! నేను వీనిని రణమున జయింపలేనేమోనని తోఁచుచున్నది. రాజు మిక్కిలి బలవంతుఁడు. నా యుత్సాహము తగ్గినది."

ఇది విని భగవానుఁడు నవ్వి, భీమసేనున కుత్సాహమును గల్పించుచు నిట్లనెను:-'భీమా! నీవు బలవంతుఁడవని నేను వినియుంటిని. తిండిపోతువుగాఁ దేలినావే. తిండిపోతులవలన నేపనియును గాదు తినుటలో నైదుగురతిండిని దినెదవు. పోరవలసి వచ్చినఁ బిరికివిగఁ గనఁబడుచున్నావు."

లజ్జితుఁడై భీముఁడిట్లనెను:-"ఏమి చెప్పుదును వాసుదేవా! నాకీమగధేశ్వరుని బలమంతు చిక్కుటలేదు. వీఁడెట్లు చావఁగలఁడు?"

నవ్వి భగవానుఁ డిట్లనెను:-"బలముతో వీని నెవరును జయింపఁజాలరు. ఈతఁడు యుక్తిచేతనే చావఁగలఁడు."

భీమసేనుఁ డిట్లనెను:-"యదునందనా! నీవు యుక్తిసాగరుడవు. వీనినిఁ జంపు యుక్తినిఁజెప్పుము. ఆయుక్తిచే వీనినిఁ జంపెదను."

కృష్ణుఁడిట్లనెను:- "ముందుగా నీతని జన్మకథను గూర్చి వినుము. అనంతరము నేనాతనినిఁ జంపు నుపాయమును జెప్పెదను. ఈజరాసంధుని తండ్రి బృహద్రథుఁడు గొప్ప ధర్మాత్ముఁడును, సత్యవాదియునై యుండెను. ఆతఁడీ

మగధదేశమున కపర దేవేంద్రునివలె నుండెను. కాశీరాజున కిద్దరు కవలపిల్లలు కలరు. సౌందర్యమున నిద్దరు నొక్కటిగ నుండిరి. వీరిద్దరియెడల సమాన భావమున నుండెదను, భేద భావమెంచనని అతఁడా కాశీరాజునకు మాటనిచ్చుటచే నాతఁడు సంతసించిఁ సహర్షముగఁ దన కుమార్తెల నిద్దఱ నిచ్చి పెండ్లిచేసెను. మగధేశ్వరుఁడా ప్రతిజ్ఞను జీవితాంతము వఱకును నిర్వహించెను. అతఁడా యిద్దరియందు నేవిధమగు భేదభావము నెంచలేదు.

ఆయిద్దరు రాణులతో సుఖభోగము లనుభవించు చుండ రాజునకు యౌవనము దాటిపోయెను. అతఁడు వృద్ధుఁ డయ్యెను. ఆయిద్దరకును సంతానము కలుగలేదు. అందు వలన రాజు, రాణులును దుఃఖితులైరి. వారికిఁ బ్రపంచ మంతయును శూన్యముగ నయ్యెను.

కక్షీవాన్ గౌతముని సుతుఁడును, బరమ తపస్వియు నగుఁ జండ కౌశికుఁడు తననగరము బయటకు వచ్చినట్లొక నాఁడు రాజువినెను. రాజు మంత్రి పురోహితులను, సచివు లను దీసికొని పూజాసామగ్రితో ముని సమీపమునకుఁ బోయెను. ఆయన ఒక మామిడిచెట్టు క్రింద నానంద పూర్వ కముగఁ గూర్చుండెను. రాజుపోయి మునికి సాష్టాంగ ప్రణామమొనరించెను. విధ్యుక్తముగ నాతనిఁ బూజించి కుశలమడిగెను. మునియును రాజుచేసిన పూజలను స్వీకరించి, కుశలము నడిగి వరమును గోరుకొనుమనెను.

రాజు ఖిన్నమనస్కుఁడై యిట్లనెను :-"మునివరా! యిప్పుడు నేను వరమడిగి యేమి చేయుదును. ఇప్పుడు నేను వృద్ధుఁడనైతిని. నాకు సంతానము లేదు. అందు వలన రాజ్యమును వీడి వనమునకుఁ బోవలయు ననుకొను చున్నాను."

ఇది వినఁగానే రాజుయొక్క దయనీయ స్థితినిగూర్చి వినఁగానే మునికి జాలి కలిగెను. రాజునకుఁ బుత్రునీయవలయు ననుకొనెను. ఆతఁడిట్లను కొనుచుండఁగనే మామిడిచెట్టు క్రిందఁ గూర్చుండెను గావున నాచెట్టుమీఁదనుండి ఒక ఫల మాతని వడిలోఁబడెను. ముని అది శుభ శకునమనుకొనెను. ఆ ఫలము నాతఁడు మంత్రములద్వారా అభిమంత్రించి రాజున కొసంగి యిట్లనెను :-రాజా! దీనిని మీరాణికొసంగ వలయును. దీనినిఁ దినుటచే నీకు బుత్రుఁడు కలుగఁగలఁడు." మునికిఁ బ్రణామమొనరించి రాజు అంతఃపురమునకువచ్చెను. ఆతఁడా ఫలమును సరిగా సగముగఁగోసి యిద్దరకు చెరి సగ మొసంగెను. ఫలమును దినఁగానే యిద్దరును గర్భవతు లైరి. పదవమాసమున నిద్దరును రెండు సగము శరీరములను బ్రసవించిరి. రెండును బ్రదికియుండెను రాణులీ రెండు సగము శరీరములు దేనికిఁ బనికివచ్చునని వానినిఁ బాఱ వైచి రమ్మని దాసీలకుఁజెప్పిరి. దాసి ఆరెంటి నొకపాత్రలో బెట్టుకొని, వస్త్రముచేఁ గప్పిబయటకుఁ దీసికొని పోయెను.

అచ్చట జరయను నొక రాక్షసి మానవస్త్రీ రూపమును ధరించి తిరుగుచుండెను. ఆమె ఆరెండు భాగముల నొక్క టిగ నతికించెను. కలిసికొనఁగానే ఆ పిల్లవాఁడేడ్వ నారంభించెను. ఆ రెండుభాగములు వానికవియే కలిసికొనెను. బాలకుని రోదనమును వినఁగానే దాసదాసీ జనములును, రాజు, రాణులును బయలుదేరి అచ్చటికి వచ్చిరి. జీవితుఁడగు బాలకునిఁ గాంచఁగనే రాజునకు విస్మయమును హర్షమును గలిగెను. అతఁడా జరా రాక్షసి పేరుతోడనే అతనికి జరాసంధుఁడనుపేరు పెట్టెను. ఆతఁడు పెద్దవాఁడు కాఁగానే బృహద్రథ మహారాజు రాజ్యమును బుత్రున కొసంగి తపస్సు చేసికొనుట కరణ్యమునకుఁ బోయెను.''

కృష్ణుఁడు భీమసేనునితో నిట్లనెను :–''వృకోదరా! ఈతఁడే ఆ జరయను రాక్షసివలనఁ గలుపఁబడిన జరాసంధుఁడు. విఱిగిన వస్తువు నెంతగా నతికించినను, అతికించిన స్థానము నిర్బలముగనే యుండును. ఈరాజుయొక్క అంగము లన్నియు సుదృఢములు. అవి విఱిగిపోఁజాలవు. కాని లోపల నివి అతుకఁబడినవి. నీవు వీని కాళ్ళను బట్టుకొని చీల్చి వైచినచో వీఁడు రెండుచీలికలు కాఁగలఁడు. ఈమార్గమున తప్ప యీతఁడు చావఁడు.''

భీమసేనుఁడిది విని అత్యంతానందమును బొందెను. ఆతఁ డిట్లనెను :–''యదునందనా! ఇఁక నీ వేచింతయును

జెందవలయు. జరాసంధుఁడిఁక జచ్చినాఁడని భావింపవలయును. రేపు నేనీ యుపాయముచే వానిని జంపెదను. వానిని మధ్యగాఁ జీల్చివైచెదను.''

సూతుఁ డిట్లనెను :–''మునులారా! ఈవిధముగ నిశ్చయ మొనర్చి అందఱును సుఖముగ నిద్రించిరి. ప్రాతః కాలమునఁ గాలకృత్యములను దీర్చుకొని నియమానుసారముగఁ బోరాడఁబోయిరి. ఇప్పుడిఁక భీమసేనుఁ డే విధముగ జరాసంధునిఁ జంపినదియు జెప్పెదను వినుఁడు.''



# జ రా సం ధ వ ధ

శ్లో. ఏకం పాదం పదాక్రమ్య దోర్భ్యామన్యం ప్రగృహ్య సః॥
గుదతః పాటయామాస శాఖామివ మహాగజః॥

శ్రీభాగ. ౧౦. స్కం౭౨ అ. ౪౪ శ్లో.

వ. ......అవక్ర పరాక్రముండైన మాగధుం బడద్రోచి వాని పదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబుఁ గదలకుండం బట్టి మస్తక పర్యంతంబుఁ బెళ పెళ యను చప్పుఁ ళ్ళుప్పతిల్ల మత్త దంతావళంబు తాళ వృక్షంబు చీరు చందంబు సబాదజానుజంఘోరు కటిమధ్యోదరాంసకర్ణనయనంబులు వేఱువేఱు భాగంబులుగా వ్రయ్యలు వాలె.

—శ్రీమదాంధ్రభాగవతము.

ప్రతి ప్రాణికిని కొంచెముగనో గొప్పగనో దుర్బలత యుండును. ఇతరుల దుర్బలతలను నన్యులెఱుగ కుండిన నెఱుగఁ కుండును గాక. భగవానునకన్నియును దెలియును. ఆతనికి దెలియని దేమియు నుండదు. భగవానుఁ డెవని దుర్బలతను దన సమ్ముఖమునకు దీసికొని వచ్చునో, అట్టి వాఁడీ సంసార బంధమునుండి శాశ్వతముగ ముక్తుఁడు కాఁ గలడు. జన్మ, మరణ, జరా, వ్యాధులు మొదలైన వన్ని యును దుర్బల సంస్కారముల పరిణామమే. ఎవని సంస్కారములు ప్రబలములుగ నుండునో, వారు సమస్త బంధముల నుండి విడివడి పోయెదరు. భగవానుఁ డెవరి భవబంధన మును విడిపింపఁ దలఁచినాఁడో, ఆతని యింటికి స్వయముగ బోయి బంధనమును విడిపించెదరు.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! భగవానుని వలన జరాసంధుని జన్మ కథను విని భీమసేనుఁడు నిద్రించెను. ప్రాతఃకాలమున లేచి నిత్య నియమానుసారముగఁ మరల నిద్దరకును యుద్ధము ప్రారంభఁ మయ్యెను. ఈ దిన మున జరాసంధుఁడు తన యుద్ధకౌశలము నంతను జూపించుచు నెట్లైన భీమసేనునిఁ బరాజితు నొనర్చుటకు జాలగఁ బ్రయత్నించు చుండెను. కాని ఆతఁడాతని యుద్ధగౌశలము నంతన వమ్ము చేయుచుండెను. ఆ సందడిలో భగవానుడు చెప్పిన ఉపాయమును భీమసేనుఁడు మఱచి పోయెను. సాయం

కాలము కావచ్చెను. అప్పుడు భగవాను డాతఁడు మఱచి పోయిన సంగతిని దెలిసికొనెను. అందు వలన నచ్చుటనుం డియే ఆతఁడు ప్రోత్సహించుచు నిట్లనెను :_"భీమా! నీలో బదివేల యేనుగుల బలమున్నది. వాయువేగ మున్నది. ఇవి దేనికి పనికి వచ్చును. నీవింత బలహీనుఁడ వేల కావలసి వచ్చినది. వీరత్వముతోఁ బోరాడుము." భగవానుడు భీమ సేనుని ధ్యానము నాకర్షించుటకై యీ మాటలను జెప్పెను. నోటితో నిట్టి వీరతాపూర్ణములగు మాటలను జెప్పు చుం డెను. చేతితో నొక వృక్షశాఖను దీసికొని చీల్చుఁ చుం డెను.

శాఖను జీల్చుటను జూడగనే వృకోదరునకు రాత్రి చెప్పిన మాట జ్ఞాపకమునకు వచ్చెను. వెంటనే ఆతఁడు మిక్కిలి బలముతో జరాసంధుని పైకెత్తి, నలువైపులను ద్రిప్పి, నేలమీదకు బడగొట్టెను. ఆతడు పడిపోఁగానే నేల కంపించెను. సంబాళించుకొని ఆతడు లేవఁబోవు, నంతలో, దుమికి, ప్రహార మొనర్చుటలో శ్రేష్ఠుడగు పాండునందనుఁ డగు భీముఁడు వానియొక్క పాదమును దన రెండు కాళ్ళతో గట్టిగాఁ దొక్కి పట్టి, రెండవ కాలినిం బట్టుకొని ఆతఁడు వస్త్రవిక్రేత వస్త్రమును జించునట్లు చించెను. ఉర్వారుకము (దోసకాయ)ను మధ్యకు జీల్చునట్లు చించెను. ఆ సమయ మున నాతడు దశదిశలును దద్దరిల్లునట్లు పెద్దగ గేకలు

వైచెను. సగము సగముగ నెట్లు పుట్టినవో అట్లే వానినిఁ జీల్చి విసరి పారవైచెను. అందఱును జూచుచుండ మగధే శ్వరుని సుందర సువృత్తశరీరము ఒక్కొక్క చరణము, జంఘ, కోశము, పొట్ట, స్తనము, స్కంధము, భుజము, నేత్రము, కర్ణము, ముక్కు, దంతములు, ఓష్ఠము, భ్రుకుటి, మస్తకము ఇవన్నియును సగముగా జీలెను.

జరాసంధుఁడు చావఁగనే అచ్చట హాహాకారములు చెలరేగెను. కొందఱు 'చెడిన' దనియు, కొందఱు 'మంచిది' జరిగినదనియు ననుచుండిరి. మగధేశ్వరుని శరీర మటు నిటుఁ బడెను. పరువిడిపోయి కృష్ణార్జును లిద్దరును భీమసేనునిఁ గాఁగిలించుకొనిరి. అట్లే కౌఁగిలించుకొని ఆతని బలమును గూర్చి భూరి భూరి ప్రశంసలొనర్చిరి. జరాసంధుఁడు చావఁ గనే, ఆతని పుత్రుఁడు వచ్చి యేడ్చుచు వాసుదేవుని పాదారవిందములపైఁ బడెను. కృష్ణుఁడాతని లేవఁదీసి కౌఁగి లించుకొని యిట్లనెను :- "వత్సా! శోకింపవలసిన పనిలేదు. నీ తండ్రి వేలకొలఁది రాజులను బంధించినాఁడు. వారందఱి హితముకొఱకు భీమసేనుఁడీతనిఁ జంపెను. ఇప్పుడు నీతో మాకే వైరమును లేదు. మేము సర్వవిధముల నిన్ను రక్షించె దము. ఇప్పుడు విధ్యుక్తముగ మగధరాజ సింహాసనమున నిన్నభిషిక్తు నొనర్చెదము. చచ్చిన నీతండ్రికి అంత్యేష్టి క్రియ లొనర్పుము."

L

సహదేవుఁ డిట్లనెను :- "ప్రభూ ! మీరు సర్వ సమర్థులరు. మీరెవరినైన సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టుము. నాతండ్రి లేకపోయిన తరువాత నేను రాజ్యమును దీసికొని యేమిచేయుదును ?"

భగవానుఁ డిట్లనెను :- "ఓయీ ! అందఱకును దండ్రులు బ్రదికియుండరు. జీవన మరణము లుండితీరును. ఎవఁ డెవరినిఁ జంపఁగలరు ? అందఱకును మృత్యువు ఉండి తీరును. ఎవరి కెవరిచేత మృత్యువు లిఖింపఁబడినదో, ఆవిధము గనే వారిచేత మృత్యువు లభించితీరును. నీవు శోకము వీడుము. చేయవలసిన కార్యములను నెఱవేర్పుము."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈ విధముగ నమేయాత్ముఁడును, భూతభావనుఁడగు శ్రీకృష్ణచంద్రుఁడు జరాసంధుని పుత్రుఁడగు సహదేవునకు బాగుగా నచ్చఁజెప్పి, ఓదార్చి మగధరాజ్యమున కభిషేక మొనర్చెను. అనంతర మాతఁడు తన తండ్రికి అంత్యేష్టిక్రియ లొనర్చెను.

జరాసంధునిఁ జంపిన తరువాత భగవానునకు దాను వచ్చిన ముఖ్యకార్యము జ్ఞాపకమునకు వచ్చెను. జరాసంధు నిచేఁ గారాగృహమున బంధింపఁబడిన రాజులను ముక్తి కొఱకు వచ్చియుండెను. రాఁగానే భగవానుఁడు జరాజంధు నితో నిట్లనెను:-"నీవు బంధితులగు రాజులను విడిచిపెట్టుము. లేమి నీతో యుద్ధమును జేయుము." ఆతఁడు గర్వముతో

నిట్లనెను:-"నేను భయపడి యెవరో చెప్పుటచే బంధితులగు రాజులను విడిచిపెట్టను. నేను యుద్ధమొనర్చుటకు సిద్ధముగ నున్నాను. మీముగ్గురితోఁ బోరాడఁగలను. లేదా సేనను దీసికొనిరండు, దానితోఁగూడ యుద్ధము చేయఁగలను." అని యిట్లు గర్వయుక్తమగు ప్రత్యుత్తరమొసంగి, రాజులను విడిచిపుచ్చుట కంగీకరింపక పోఁగా, నప్పుడు భగవానుఁ డాతని భీమసేనునిచేఁ జంపించెను. ఆతనిఁ జంపి ఇరువదివేల ఎనిమిదివందల రాజులను విడిపించుటకు జరాసంధుని సుందర పతాకయుక్తమగు రథముపై నెక్కి వెడలిరి. ఇప్పుడచ్చటికిఁ బోయి భగవానుఁడెట్లు వారిని విడిపించినదియు నేను మీకు జెప్పుదును. మీరందఱును సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.

---

## బంధితులగు రాజులకు కృష్ణదర్శనము

శ్లో॥ కృష్ణ సందర్శనాహ్లాద ధ్వస్త సంరోధన క్లమాః।
ప్రశశంసు హృషీకేశం గీర్భిః ప్రాంజలయో నృపాః॥

—శ్రీభాగ. ౧౦స్కం. ౭౩అ. ౭శ్లో॥

చ॥ భరితముదాత్ములై విగతబంధనులై నిజమస్తముల్ మురా
సురరిపు పాదపద్మములు సోఁకఁగ జాఁగిలి మ్రొక్కి నమ్రులై
కరములు మోడ్చి యో పరమ కారుణికోత్తమ సజ్జనార్తి
సంహరణ వివేకశీల మహితాశ్రిత పోషణ పాపశోషణా॥

వ. అని స్తుతించిరి.

—శ్రీమదాంధ్ర భాగవతము.

భగవానుని కృపపై భారముంచి, ఆతని కొఱకై నిరంతరము ప్రతీక్ష చేసినచో, నాతనికి భగవానుఁడవశ్యము దర్శన మొసంగును. భగవంతుఁడు భక్తులను గుర్తుపెట్టు కొనఁడనుట తప్పు భగవానుఁడు వచ్చుటలో నాలస్యమైన కావచ్చునేమోగాని అంధకార ముండదు. ఆలస్యమగుటకు మన శిథిలతయే కారణము. ఏకాగ్రత, విశ్వాసములలో లోటే కారణము. ప్రతీక్ష చేయించి భగవానుఁడా లోటును బూర్తిచేయును. తదనంతరము దర్శన మొసంగును. భగ వానుని దర్శనమైన తరువాత నిఁక బంధన ముండదు. ప్రారబ్ధకర్మ యున్నంత వఱకు ఆతఁడభిమాన శూన్యుఁడై భోగించును. భోగశేషమైన తరువాత పరమ పదవినిఁ బ్రాప్తించును. భగవానుని హృదయ పూర్వకముగ నిరం తరము చింతింపవలెను. వాక్కుతో నాతని స్తుతింపవలయును. ఆతని కైంకర్యమున నుండినచో నంతకంటె సుఖమేమి యుండగలదు ? అట్టి సమయమున స్వర్గమున నుండినను, నరకమున నుండినను నంతయును సుఖమే.

సూతుఁడిట్లనెను:-"మునులారా ! జరాసంధునిఁ జం పించి, ఆతని పుత్రునకు రాజ్యాభిషేక మొనర్చి, కృష్ణుఁడు జరాసంధునిచేఁ దన కారాగృహమున బంధితులై, నిరంత

రము ప్రభు చింతన మొనర్చు రాజులను విడిపించుటకై వారి కడకు బోయెను. వారందఱును బన్ధతములచేఁ జుట్టుకొనఁ బడిన గిరివ్రజమను దుర్గమున బంధింపఁబడిరి. దుర్గద్వార మును దెఱవుమని కృష్ణుఁడు సహదేవునకుఁ జెప్పెను.

భగవదాజ్ఞచే సహదేవుఁడు వెంటనే ద్వారమును దెఱచెను. భగవానుఁడు లోపలికిఁబోయి చూడఁగా రాజు లందఱును మాసిన చినిఁగిన గుడ్డలను ధరించి యుండెను. వారింటివద్ద యేఁబదియాఱు పిండి వంటలతోఁ బంచ భక్ష్య పరమాన్నములను దినెడువారు, ఇప్పుడువారు సగము కడు పుతోఁ,ఒక్కొక్క దినమునఁ గేవలము పిండినిఁ దినుచున్నారు. ఈ కారణమున వారి పొట్ట డొక్కల కంటుకొని పోయెను. వారి ముఖములు మాలిన్యములయ్యెను. కారావాస కఠిన క్లేశములచేఁ గృశించి దుర్బలులైరి. ఇంతలోనే తమ సమ్ముఖ మున నవజలధర శ్యాముఁడును, దన తేజముచే దశదిశలను బ్రకాశింపఁ జేయువాఁడునగు శ్యామసుందరునిఁ గాంచిరి. వారిది వఱకిట్టి సుందర పురుషుని దర్శించి యుండలేదు.

ఒక అద్భుత అలౌకిక పురుషుఁడు మందహాస మొన ర్చుచుఁ గృపాభరిత దృక్కులతోఁ గాంచుచు వారివైపునకే వచ్చుచుండుటను వారుకాంచిరి. ఆతని శరీరము నూతన జలధర మేఘము వలెనుండెను. మెఱయుచుండిన పట్టుపీతాం బరమును ధరించి యుండెను. వక్షఃస్థలమున నతి మనోహర

ముగు శ్రీవత్స చిహ్నము శోభించుచుండెను. మృణాళముల వలె మృదువై బలిష్ఠములైన నాలుగు భుజములుండెను. ఒకచేతిలోఁ దెల్లని శంఖమును ధరించెను. ఇంకొక చేతిలో గదను బట్టుకొని అటునిటు ద్రిప్పుచుండెను. మూఁడివ చేతిలో వేయంచులు వాలును దుర్ధర్షమునను సుదర్శన చక్రముం డెను. నాల్గివ చేతిలో అర్ధస్ఫుటిత క్రీడాకమల ముండెను. దాని నాడించుచు నందఱను దనవైపున కాకర్షించుచున్నట్లుం డెను. ఆతని గ్రీవము శంఖమువలె నుండెను. ఆతని ముఖార విందము శారద చంద్రునివలె నాహ్లాద కరముగను, ఆకర్షము గను నుండెను. ఆతని యుగళనేత్రములు కమలకోశము వలె విశాలములుగను సుందరముగను నుండెను. కర్ణము లందు మకరకుండలములు వ్రేలాడుచుఁ దళతళ మెఱయు చుండెను. కటియందు మొలనూలు మెఱయుచు గలగల శబ్దమొనర్చు చుండెను. కరము లందుండిన కనక కేయూ రాదులు కాంతులను వెదజల్లు చుండెను. కంఠమందు కౌస్తుభ మణి తన యనుపమ సౌందర్యమును వెదజల్లుచుండెను. పంచరంగులు కల వనమాల ఇంద్రధనస్సువలె శోభించు చుండెను. చూడగనే యీతఁడు సచ్చిదానంద కందుఁడగు శ్రీకృష్ణచంద్రుఁడని అందఱును గ్రహించిరి. ఇప్పుడు వారి హృదయములలోఁ బ్రేమ పెల్లుబుకుచుండెను.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఎవరిమీఁద నైన మనస్సునందు విశుద్ధప్రేమ యుండినచో, ఆతఁడెదు టకు వచ్చినచో నా సమయమున హృదయస్థితి యెట్లుండునో, దానిని వాక్కుద్వారా యెవరును వర్ణింపఁజాలరు. పరుగిడి పోయి ఆతనిఁగౌఁగిలించుకొనవలయుననిచిత్తము కాంక్షించు, ఆతనిఁ ద్రాగవలయునని కన్నులు కోరుకొనును. ఆతనిఁ జప్పరింపవలయునని నాలుక కోరుకొనును. ఈతని దివ్య గంధమును నిరంతరమును వాసన జూడవలయుననియు, భుజములాతని నిరంతరమును బాహుపాశమున గట్టిగాఁగౌఁగి లించుకొనవలయుననియు, నెన్నటికిని విడువఁగూడదనియు, వాక్కు నిరంతరమీతని గుణములను గాన మొనర్పవలయు ననియు, మనస్సాతని మనోహరమూర్తిని ధ్యానమొనరింప వలయుననియు గోరును. ఈ స్థితియే యిప్పుడు రాజులకును గలిగెను. వారి హృదయమున నానందముప్పొంగెను. వారు భగవద్దర్శనముచే నాత్మవిస్మృతినిఁ జెందిరి. తాము బంధితుల మను సంగతియే వారు మఱచిపోయిరి. వారి కవర్ణనీయ మగు సుఖము కలిగెను. దానిని భగవద్విముఖులగు వా రూహింపనైన నూహింపఁజాలరు. తమ క్లేశములన్నియును నశించెనని వారనుభవపూర్వకముగఁ దెలిసికొనిరి. వారు పరుగిడిపోయి, విహ్వలులై ప్రభు పాదపద్మములందు బడిరి. కొంచెముసేపటికి వారికి శరీరము తెలిసి, లేచి గద్గద వాక్కు లతో ప్రభువును స్తుతింప నారంభించిరి.

వారిలో నొక రాజిట్లనెను:- "ప్రభూ! మీరు శరణాగత భయభంజనులు, అజ, అవినాశులు. దేవదేవేశ్వరా! మీ పాదపద్మములకు ప్రణామములు. మేము మీకు శిరసాష్టాంగ ప్రణామ మొనర్చుచున్నాము." ఆరాజుయొక్క స్తుతిని విని భగవానుఁడు ముందునకుఁ బోయెను. అచ్చటను నొక రాజు నిలుచుండియుండెను. ఇదంతయును నిమిషములోఁ గారాగృహమంతటను వ్యాపించెను. వారును భగవానుని గాంచి స్తుతించిరి :- "దేవదేవేశా! ఇప్పుడు మేమీ ప్రపంచమనిత్యమైనదని తెలిసికొని దీనియెడలనుదాసీనులమై మీ శరణమునకు వచ్చితిమి. మీరు శరణాగత ప్రతిపాలకులు. సమస్త ప్రపంచమునకును రక్షకులు. కావున మమ్మును రక్షింపుము."

భగవానుఁ డిట్లనెను :- "రాజులైనను మీకును జాల కష్టము కలిగినది. ఈ జరాసంధుఁడు మీకు దుఃఖమును గలుగఁజేసినాఁడు."

అంతఁ గొందఱు రాజు లిట్లనిరి :- "లేదు స్వామీ! మేము జరాసంధుని దోషియనము. మీ రెవరి ననుగ్రహింపఁ దలచితిరో వారి ధనైశ్వర్యములను హరించెదరు. ధనైశ్వర్య మదముచే మానవులు నానా అనర్థముల నొనరించును. ఏవిధ మగు మదముండినను మదమోహనుఁడవగు నీ ప్రాప్తి కలుగదు. మీ నామమే మదహారియైనది. మీరు జరాసంధుని

పరాజితునిఁ గావించి మా మదమణఁచితిరి. కావున నీ దుఃఖము నను మేము మీ యనుకంపగనే భావించుచున్నాము. రాజుల హృదయమందు దీనత, వినయము నుండదు. వారు మీ మాయచే మోహితులగుటచే నీ యనిత్య క్షణభంగుర చంచల ద్రవ్యమునే సమస్తమని భావించుచుందురు. ఈ ధనము నిత్యమనియుఁ దమ వెంట వచ్చుననియు మిథ్యాభినివేశమునఁ బడెదరు. ఎండమావులను గాంచి నీరని భావించి అజ్ఞానులగు వారి హానివైపున కెట్లు పరువిడెదరో అట్లే మూఢజనులీవికారమయమాయను సత్యమని భావించి దానివలలోఁ బడి పోవుదురు. మీ దర్శనముచే మేము కృతార్థులమైతిమి. మేము మీ పాదపద్మములకుఁ బ్రణామమొనరించుచున్నాము.”

భగవానుఁ డింకను ముందునకుఁబోయెను. చేతులను జోడించుకొని, మలిన వస్త్రములను ధరించి వృద్ధులగు రాజులు నిలుచుండిరి. కృష్ణుఁడు వారిదయనీయ దశను గాంచి దుఃఖితుఁడై యిట్లనెను :-“కాలగతి యెంత కుటిలమైనదో చూడుఁడు. ఈ రాజు లిదివఱలో లక్షల కొలఁది మానవులను శాసించెడువారు. నేఁడు వీరాఁకలిచే బాధపడుచున్నారు. ఇతరులచేత బంధితులై కాలమును గడుపుచున్నారు.”

అంత నొక వృద్ధ నరపతిఁ యిట్లనెను :- “స్వామీ! మానవుఁ డేది చేయునో దాని ననుభవించును. మేమిది వఱకు రాజ్యలక్ష్మీ మదమున మదోన్మత్తులమై కన్నుగాన

గంటిమి. మే మెవరిని లక్ష్యపెట్టక పోయితిమి. మా కంటె గొప్పరాజు లెవరున్నా రనుకొంటిమి. ఒక రాజువైభవము పెరిగినదా దాని నోర్వజాలక యీర్ష్యా ద్వేషములకు వశులమై ఒకరినొకరము జయింప వలయునని యుద్ధము లొనర్చితిమి. మా సామ్రాజ్యమును వృద్ధిఁ బొందించుటకై కాల స్వరూపుడవగు నిన్ను మఱచితిమి. ప్రాణి యెప్పుడు పుట్టుచున్నాఁడో మృత్యువును నప్పుడే పుట్టును. అది వాని వెన్నంటియే యుండును. మేమా మృత్యుభయమును మఱచి పరస్పరము పోరాడి నిర్దయులమై ప్రజలను సంహరించితిమి. మీరు జరాసంధుని ద్వారా మిమ్ములను శ్రీహీనుల నొనర్చి మా గర్వమును నాశ మొనరించితిరి. ఇప్పుడు మేము దీనులమై మీచరణారవిందములను నిరంతరమును జింతించు చుందుము. మీరు మాకు విపత్తుల నొసంగి కను దెఱిపించితిరి. ఈ రాజ్య సుఖము లనిత్యములనియు, రాజ్యము సంగతి నటుంచి నిరంతరము క్షీణించునదియును, అనంతరోగములకు నిలయమును, మలమూత్రముల కొంపయును, ఆధివ్యాధులకు క్రీడా భూమియునగు నీ శరీరము నశ్వరమైనదనియు, ఇది యెప్పుడు నశించునో తెలియదనియు, దీనితో ననుభవించు నవన్నియును మిథ్యాభోగము లనియును దెలిసెను. ఇదే విధముగఁ జచ్చిన తరువాత స్వర్గమం దమృతము లభించుననియును, అప్సరసలతో విమానములలోఁ దిరుగ వచ్చుఁ

ననియును, నందనవనమున విహరింప వచ్చునను శ్రుత మధుర వాక్యములును మమ్ముల నిప్పుడాకర్షించుట లేదు. ఇప్పుడు మాకెల్లప్పుడును నీ చరణములను నిరంతరము చింతింప వలయునని యున్నది.''

కృష్ణభగవానుఁ డిట్లనెను :-''ఇఁక మీరు పోయి ధర్మముగఁ బ్రజాపాలన మొనర్పుడు. ఇప్పటినుండి న్యాయముగ వర్తింపఁ వలయును. కోశాధ్యక్షుని, సేనాధ్యక్షుని, మంత్రులను, సచివులను, సంతోష పెట్టవలయును.''

రాజు లిట్లనిరి:-''ప్రభూ ! ఇదంతయును మేము చేయుచునే యుంటిమి. ఇప్పుడు మాకు వ్యావహారిక నీతి అక్కఱ లేదు. మా కిప్పుడు కావలసినది - మేము ప్రారబ్ధవశముచే సూకర, శునకాది జన్మలెత్తినను, స్వర్గ నరకములలోని కేచ్చుటికి బోయినను మీచరణారవింద స్మృతి కలుగు నుపాయమును, సుగమ సాధనను జెప్పుడు.''

ఇది విని అందఱును నైక్యకంఠముగ నిట్లనిరి :- ''ఆనందకంద శ్రీకృష్ణచంద్రా ! నీకు ప్రణామము లొనర్చుచున్నాము. వాసుదేవ భగవానునకు నమస్కారములు. సమస్త పాపములను హరించు హరికి చరణాగతులమైతిమి. పరబ్రహ్మ పరమాత్మ స్వరూపమగు ప్రభువునకు మా అభివాదము. శరణాగత ప్రతిపాలకుఁ డవును, ప్రణత క్లేశ నాశకుఁడవు నగు నీకు మేము ప్రసన్నులమైతిమి. గోలోక విహారి గోవిందునకు పునఃపునః ప్రణామములు.''

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఈ విధముగ జరాసంధునిచే బంధింపఁబడి విముక్తులైన రాజు లతిదీనముగ బూర్ణభక్తి వాక్కులతోఁ బ్రార్థింపగా, భవభయ హారి యగు భగవానుడు వారిని గృప జూచెను. వారిని బంధము నుండి వదలించుచు నేమి యుపదేశించెనో దాని వర్ణనము జేయబోవు చున్నాను. సమాహిత చిత్తులరై ఆప్రసంగమును శ్రవణ మొనర్పుఁడు."

---

## బంధితరాజుల విడుదల- ధర్మరాజుని హర్షము.

శ్లో॥ నిశమ్య ధర్మజ స్తత్తే్కశవే నాను కంపితమ్।
ఆనందాశ్రు కలాంముంచ స్ప్రేమ్ణా నోవాచ కించన॥
—శ్రీభాగ. ౧౦స్కం. ౭౩అ. ౩౫శ్లో॥

వ. ధర్మజుండు విస్మయ వికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ సమ్మాధవు మాహాత్మ్యంబునకుం దమ యందలి భక్తిస్నేహ దయాది గుణంబులకుం బరితోషంబు నొందుచుండె.

—శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచమున రెండే సంబంధములు కలవు. దాసుఁడు స్వామి. ప్రతివాఁడును నెవరికైన దాసుఁడో లేక స్వామియో యైయుండును. చిన్నలలోఁ జిన్నపతి తన పత్నికిని,

దన పుత్రులకును, దన ఆశ్రితులకును స్వామి. గొప్పవారిలో గొప్పవ్యక్తి తనరాజునకును, గురువునకును, గురుమాతాపితరులను నధీనుఁడై యున్నాడు. స్వామి సేవక భావము లేక సాంసారిక కార్యములును నెఱవేరవు. పరమార్థ కార్యములును నెఱవేరవు. కొందఱు పరమార్థ పథమునందు తలను గుండు చేయించుకొని, వస్త్రములకు రంగు వేయించుకొని స్వామియగు చుందురు. కొందఱు తాము దాసుల మనుకొను చుందురు. ఏవిధముగ నైనను సరియే స్వామియో, దాసుఁడో కావలసియుండును. భేదమే మనఁగా క్షుద్రునకు దాసుఁడగుట కంటె గొప్పవానికి దాసుఁడగుట శ్రేష్ఠము. జగద్దాసత్వమును వీడి పరమాత్మకు దాసుఁడగుట పరమ పురుషార్థము. భగవానుని కృపకు ఒక్కటే గుర్తు. ఆతఁడు జగద్దాస్యము నుండి భగవద్దాస్యమును బ్రసాదించుటయే. జగత్సంబంధమును వదలించి, తన సంబంధమును గలిగించుటయే, ఇదే ఆతని అసీమ అనుగ్రహము.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! జరాసంధునిచే బంధితులైన రాజులు తమముక్తి సమయమున శ్రీకృష్ణుని అనేక విధములఁ బ్రార్థింపఁగా, నాతఁడు మందహాస మొనర్చుచు మధురవాణితో రాజులతో నిట్లనెను:- "రాజులారా! మీరు నాకు జేసిన వినతి చాల యోగ్యమైనది. మీకు

సర్వేశ్వరుఁడనగు నాయందు తప్పక సుదృఢమగు భక్తి కలుగఁగలదు. ఇప్పుడు మీరు ధనమద, ఐశ్వర్యమదములచేఁ గలుగు నుచ్ఛృఖలత్వ దోషములను వర్ణించితిరి. అది యథార్థమే. ధనైశ్వర్య మదముచే మదోన్మత్తులగువారు, ఇంకెవరిని లక్ష్యపెట్టరనుట యథార్థమే. ఇంతటి దుఃఖము సహించుటచే మీబుద్ధులు బాగుపడినవి. మీరు నాభజన మొనర్చుటకు నిశ్చయించితిరి. ఇది మిక్కిలి సౌభాగ్యకరమగు విషయము. కావున్న ధనైశ్వర్య మదమున మానవులకు నేత్రములుండినను నంధుఁడై పోవును. ఎంతటి జ్ఞానియైనను, ఎంత చదివినవాఁడైనను, కులీనుఁడైనను, సుందరుఁడైనను, వానిని మదమణఁచినచో వాని గుణములన్నియును నవగుణములగును. హైహయవంశ మందలి కార్తవీర్యార్జునుఁడు గొప్ప యోగి. ఆతఁడు దత్తాత్రేయుని సేవయొనర్చి సమస్త సిద్ధులను బొందెను. ఆతఁడు ప్రపంచమున గొప్ప బలవంతుఁడు. దిగ్విజయ మొనర్చినవాఁడు. ఆతని వేయిచేతులు. విశ్వవిజయుఁడగు రావణునిఁ బశువువలె బంధించి తన యంతఃపురమున నుంచెను. ఆతనిని దీపస్తంభముగ నొనర్చి, ఆతని శిరస్సులపై దీపములను వెలిగించెను. ఇంతటి జ్ఞాని, ధ్యాని, యోగి, బలి, శూరవీరుఁడు, విశ్వవిజయ మొనర్చినరాజు ఐశ్వర్యమదమంధునిగ నొనర్చెను. జమదగ్ని మహర్షియొక్క కామధేనువును బలవంతముగ హరించెను. అప్పుడు పరశురాముఁడాతని, నాతని కులమును నాశమ్మొనర్చెను.

ఇదే విధముగ నహుష మహారాజునకును నైశ్వర్య మదము కలిగెను. దేవేంద్రునకు బ్రహ్మహత్యరాఁగా దేవతలును, ఋషులును నాతని స్వర్గమున కింద్రునిఁగ నొనర్చిరి. ఇంద్రుఁడు కాఁగానే ఆతనికి మిక్కిలి అహంకారము కలిగెను. ఆతఁడింద్రాణి యగు శచీదేవితో ననుచిత ప్రస్తావమును గావించెను. ఋషులచేఁ బాలకీని మోయించుకొని, ఆమెయింటికి నడిపించుచుండెను. బ్రహ్మజ్ఞానులగు మహర్షులను గర్వముచే నవమానించెను. అప్పుడు ఋషులు వానికి శాపమొసంగి సర్పముగ నొనర్చిరి. స్వర్గ భ్రష్టునిఁ గావించిరి. ఈతఁడంతటి ప్రతాపియై, మర్త్యలోకమునకు రాజయ్యును నాశరీరముతోడనే స్వర్గమునకు రాజయ్యెను. అట్టివాఁడును నహంకార కారణమునఁ బతనమయ్యెను. అట్టియెడ సాధారణుల విషయము చెప్పనేల ?

వేనరాజు ఐశ్వర్య మదమునఁ దా నెవరిని లక్ష్యపెట్టుటలేదు ఆతఁడు యజ్ఞ, యాగ, దాన, వ్రత, ఉపవాస మొదలగు సమస్త శుభకర్మలను ఆపివైచెను. ఆతఁడు తనరాజ్యమున దాన ధర్మాదులను, యజ్ఞయాగాదులను జేయఁగూడదని శాసించెను. భగవత్పూజ నాపి తనపూజను జేయుమనెను. ఆతఁడు మదమున మహర్షుల నవమానించెను అందువలన మహర్షులు హుంకరించి వానిని భస్మమొనర్చిరి. తన అహంకారమునకుఁ దగిన ఫలము నాతఁడు వెంటనే పొందెను.

ఈ విధముగ రావణుఁడును దాను విశ్వవిజయుఁడ నని బ్రహ్మాది దేవతల నవమానింప నారంభించెను. ఆ యైశ్వర్య మదముననే ఆతఁడు జగజ్జనని యగు జానకిని హరించెను. అప్పుడు నేనే శ్రీరామ రూపమున వానిని కుల సహితముగ సంహరించితిని.

నరకాసురుఁడు నా పుత్రుఁడే. ఆతఁడు చాల బలవంతుఁడు. ఆతఁడును వేలకొలఁది రాజకన్యకలను బంధించెను. అప్పుడు నేను పోయి వధించి, రాజకన్యకలను విడిపించి, వారి కోరిక లనుసరించి నేనే పెండ్లాడితిని. ఎన్నని చెప్పఁ గలను. ఇట్టివారెందఱో రాజులు కలరు. దేవ, దైత్య, అసుర, గంధర్వ, గుహ్యక, నాగ, పన్నగ, యక్ష, రాక్షసాదులలో నెవరు మదమత్తులై అనర్థము నొనర్చిరో, వారు తమ స్థానమునుండి భ్రష్టులై పరలోక వాసులైరి. మీకును రాజైశ్వర్యమదము కొంచెముగఁ గలదు. అది యీ బందీ గృహమున నుండుటచే వదలిపోయినది. ఇప్పుడు మీరు మీ రాజధానులకు బోయి, రాజ్యము నొనర్చుకొనుఁడు. ఈ దేహము నశ్వరమైనదని తెలిసికొనుఁడు. యజ్ఞ యాగాదుల ద్వారా నన్ను యజించి, మీ మనస్సు నాయిందు లగ్నమొనర్పుఁడు. సావధానులరై ధర్మానుష్ఠాన మొనర్పుడు. కర్తవ్యమను భావముతో న్యాయముగఁ బ్రజాపాలన మొనర్పుఁడు. అప్పుడు మీకు కర్మచేసిన దోషము లేవియు నంటవు.'

రాజు లిట్లనిరి :- 'స్వామీ! మా కిప్పుడు సాంసారిక భోగముల ననుభవింపవలయు ననియు, రాజ్యమును జేయ వలయుననియు నభిలాష లేదు. మేమిప్పుడు మీ చరణార వింద భక్తి నొనర్పఁదలఁచు చున్నాము.'

భగవానుఁ డిట్లనెను :-"ఓయీ! ప్రారబ్ధకర్మ లను భవింపక నశింపవు. మీరు ప్రారబ్ధభోగములని తెలిసికొని సంతానమును వృద్ధిచేయుఁడు. ప్రారబ్ధానుసారముగ లభించు సుఖదుఃఖములు, లాభహానులు, కీర్త్యపకీర్తులు, జీవన మర ణములలో నేవి ప్రాప్తించునో, వాని ననుభవింపుఁడు. చిత్త మును నిరంతరము నాయందు లగ్నమొనర్పుఁడు. ఎవరి చిత్త మెవరియందు లగ్నమగుచుండునో చివర కాతఁడు దానినే పొందును. మీరు నాయందు చిత్తముంచుఁడు. అట్లుచేసిన బ్రహ్మనగు ననుఁ బొందఁగలుగుదురు.'

సూతుఁ డిట్లనెను:-'మునులారా! భగవానుని యీ యాజ్ఞను విని వారందఱును దానిని సహర్షముగ శిరసా వహించిరి. అప్పుడు భగవానుఁడు సహదేవున కిట్లాజ్ఞాపిం చెను. "వీరందఱకును రాజోచిత సమ్మానము లొనర్చి వీడ్కొల్పుము."

భగవానుని ఆజ్ఞ కాఁగానే సహదేవుఁడు వేలకొలఁది దాసదాసీజనములను వారి సేవకై నియోగించెను. వారంద ఱును రాజులకు స్నానము చేయించి తలంట్లు దివ్యౌషధ, మహా

వధ సుందర సుగంధిత జలములచేఁ బోసిరి. వారికి క్షౌరాది కర్మ లొనరింపఁ జేసెను. సుందర బహుమూల్యము లగు వస్త్రాభూషణాదుల నొసంగి, స్వాదిష్ట భక్ష్య భోజ్యాదులచే షడ్రసోపేత భోజనముల నిడిరి. చందన, మాలా, పుష్ప, తాంబూలాదుల నొసఁగి వారికి సమ్మానమును గావించెను. వారు రాజోచిత వస్త్రాభూషణాదులను ధరించి సింహాసనముల మీఁదఁ గూర్చుండఁగా శరద్రాత్రులందు చుక్కల వలెఁ గనకకుండలములచేఁ బ్రకాశించుచుండిరి. అంత భగవానుని ఆజ్ఞచే సుందర సుందర రథముల నొసఁగెను. దివ్య హయములచేఁ బూన్పఁబడిన నా రథములపైఁ గూర్చుండి వారందఱును దమ తమ నగరములకు బోవ నారంభించిరి. సహదేవుఁడు వారిని మిక్కిలి సమ్మానముతోడను, ఆదరముతోడను వీడ్కొలిపెను. ఈ విధముగ వారు ప్రభు కృపను బొంది, తమ తమ రాజధానులకు వెడలిపోయిరి. వారు సకుశలముగ వచ్చుటను గాంచి పురజనులును, బరిజనులును సమస్త ప్రజలును సంతోషించిరి. అందఱును గలిసి ఆనంద కందుఁడగు శ్రీకృష్ణచంద్రునకు జయకారము లొనర్చిరి.

తమతమ రాజధానులకుఁబోయి అందఱును తమ మంత్రులకును, బురోహితులకును, ప్రజలకును భగవానుని అనుగ్రహమునుగూర్చి వర్ణించిరి. భగవానుఁడు భీమసేనునిచే జరాసంధు నెట్లు చంపించెనో, ఆవృత్తాంతమునంత

యును జెప్పిరి. వారందఱును దమ తమ అంతఃపురము లందుండి భగవానుని పావన లీలలను జింతించుచు, నాతని పావన గుణములను గానమొనర్చుచుండిరి. ఆతని నామములనే తాళస్వరాదులతో సంకీర్తన మొనర్చుచుండిరి. వారు భగవదాజ్ఞ ననుసరించియే వర్తించుచుండిరి. వారంద ఱును ధర్మజ రాజసూయమునకు వివిధోపహారములను, వస్తువులను బ్రోవుచేయుచుండిరి.

ఇచ్చట జరాసంధునిఁ జంపించి, ఆతని కుమారుఁడగు సహదేవునకు రాజ్యాభిషేకమును జేయించి, తామింద్ర ప్రస్థమునకుఁబోవ సిద్ధపడిరి సహదేవుఁ డత్యంత శ్రద్ధా భక్తులతో భగవానునిఁ బూజించి, భీమార్జునలను గూడ సమ్మానించెను. అంత వారందఱు నత్యంతాదరముతో వీడ్కొలిపెను. ఈవిధముగ సహదేవునిచే బాగుగా సమ్మా నితులై శ్రీకృష్ణ భీమార్జునులు రథముమీఁద గూర్చుండి, ఇంద్రప్రస్థమునకుఁ బోయిరి. వారు పరమ పరాక్రమవంతుడు విశ్వవిజయుఁడునగు శత్రువును జయించి,ఆ విజయోల్లాసమున నతి శీఘ్రముగ దేశ, నదీ, నద, పర్వతములను దాటుచు నింద్రప్రస్థ సమీపమునకు వచ్చిరి.

నగర సమీపమునకు జేరి ముగ్గురును నత్యంతోల్లా సమున నానందమగ్నులై తమతమ శంఖములనూదిరి. ఆ శంఖములయొక్క భీషణ ధ్వనిని విని సుహృదులందఱును

సంతోషించిరి. కాని ద్వేషుల కాధ్వని శూలములవలె గ్రుచ్చుకొనెను. శంఖములయొక్క ఆహ్లాదపూర్ణధ్వనిని విని సమస్త నగర నివాసులు రాజసూయమునకుఁ బ్రబల కంటకుఁడగు జరాసంధుఁడు చచ్చినట్లును, ధర్మరాజుయొక్క దిగ్విజయ సంకల్పము పూర్తియైనదనియుఁ దెలిసికొనిరి. ఇప్పుడు దిగ్విజయమునకు విఘ్నమును గలిగించు శత్రువెవఁడును లేఁడు."

ధర్మరాజును మూఁడు శంఖముల ధ్వనిని విని ఆనందాంబుధిలో మునిఁగిపోయెను. ఇంతలోనే ఆతఁడు భీమార్జులతోఁగూడుకొని నవ్వుచు వచ్చుచున్న కృష్ణుఁడు కనఁబడెను. ముగ్గురును వచ్చి ధర్మరాజునకు నమస్కరించిరి. ధర్మరాజు ప్రేమ భరిత హృదయముతో శ్యామసుందరునిఁ గౌఁగిలించుకొనెను. భీమార్జునుల శిరస్సు మూర్కొనెను. భగవానుఁడు రాఁగానే యిట్లనెను :-"రాజా! పని పూర్తియైనది."

అశ్రువిమోచన మొనర్చుచు ధర్మరాజిట్లనెను :- "ప్రభూ! మీరున్నచోట గార్యము కాకపోవుటయుండునా? మీరు పరిపూర్ణతములు. మీ సంకల్ప మాత్రముచేతనే అన్నియును జరుగఁగలవు. మీకు జరాసంధుని జయించుట కష్టమే మున్నది?"

భగవానుఁ డిట్లనెను :-రాజా! నేను జయింపలేదు. నీ తమ్ముఁడు భీముఁడు వానిని ద్వంద్వ యుద్ధమునఁ జంపి నాఁడు.''

ధర్మరాజిట్లనెను :-''ప్రభూ! ఎవఁడైన ఖడ్గముతో నెవరి శిరస్సునైనను ఖండించినచో ఖడ్గము శిరస్సును ఖండించినదని యెవ్వరు ననరు. అందఱును నట్లు చేసినవానినిఁ జెప్పెదరు. అట్లే భీముఁడు నీకు యంత్రము. నీవు యంత్రివి.''

ఈవిధముగ నిద్దరును బరస్పరము మధురముగ మాటలాడుకొనిరి. ధర్మరాజు జరాసంధుని యొక్క సమస్తవృత్తాంతమును విని ఆనంద మగ్నుఁడయ్యెను. భగవంతుఁడు తన పనినెట్లు నిర్వహించుచున్నదియు, దనపై నెంతటి యనుగ్రహమున్నదియు దనయందెంతటి వాత్సల్యమున్నదియుఁ దెలిసికొని, ధర్మరాజానంద మగ్నుఁడయ్యెను. అతనికి నోట మాట రాలేదు. గద్గదిక మయ్యెను. ఆనందాశ్రువులను వర్షించుచు, మాటి మాటికిని భగవంతుని వైపునకు జూచుచుండెను. అతఁడొక్క శబ్దమునైనఁ బలుకఁ జాలకుండెను.

సూతుఁ డిట్లనెను :- ''మునులారా! ఇఁక రాజసూయము జరుగుటకే సందేహమును లేకుండెను. కృష్ణుడు ధర్మరాజుతో నిట్లనెను :- ''రాజా! ఇఁక నాలస్యము చేయవలసిన పనిలేదు. యజ్ఞమునకుఁ గావలసిన సమస్త సామగ్రులను బ్రోవుచేయించుము. కర్మకాండను దెలిసిన వైదిక

బ్రాహ్మణులను బిలిపించుము. రాజసూయ యాగమును జాల వైభవముగఁ జేయవలయును. నీకు సేవకుఁడనై నే నున్నాను.''

తన హృదయానందమును బ్రకటించుచు ధర్మరా జిట్లనెను :- ''నీవల్లీల పలుకవు, నీపద్ధతియే అంత. నీవు భక్తులకు గొప్పదనమిచ్చుచుందువు. కాకున్న దీనబంధూ! నీవెక్కడ మేమెక్కడ? నీవు త్రిలోకములకును గురువవు. సమస్త చరాచరలోకములకును నీశ్వరుఁడవు. ఈ భూమండల మందలి నరపతులేల బ్రహ్మాది దేవతలే నీమాటను శిరసా వహించెదరు. ఇంతటి యైశ్వర్యము గల మీరెక్కడ, దీన హీన మతిమలీనులమగు మేమెక్కడ? అయినను నకించను లమును, అజ్ఞానులము నగు మా యాజ్ఞలను బాలించుట, ఇదంతయును మీలీలయే. మీయాట, మీలీల, మనోవినో దము. మీరేక రసస్వరూపుఁడవు చిన్నపని చేయుటచే మీరు చిన్నవారుకారు. గొప్ప పని నొనర్చుటచే గొప్ప వారు కారు. మీలో గొప్పతనము కొద్దితనమును లేవు ఏకరసమవు. సూర్యుఁడుదయించినను అస్తమించినను నాతని తేజము తగ్గదు. ఒకే విధముగ నుండును. ఇదేవిధముగఁ గర్మలొనర్చుటచేతను, చేయకుండుటచేతను మీ తేజము పెరుగదు, తరగదు. నీకు స్వపర భేదములులేవు మీసంగతి నట్లుండుఁడు. మీభక్తుల మనస్సులందును అహంకార

మమకారములు మొదలగు భావములుండవు. వారికి వికార యుక్తమగు భేదబుద్ధి నశించును. వారు సమస్త రూపము లందును నిన్నే చూచెదరు.''

భగవానుఁ డిట్లనెను :- ''ఇవన్నియు జరుగుచునే యుండును. ఇప్పుడు మీరు యజ్ఞప్రయత్నము లొనర్పుఁడు''

సూతుఁ డిట్లనెను :- ''మునులారా! ప్రభుని ఆజ్ఞను బొంది ధర్మరాజు సేవకులకు సామగ్రినిఁ బ్రోవుచేయవలసిన దనియు, వేదజ్ఞులగు బ్రాహ్మణులను బిలువవలసినదనియు నాజ్ఞాపించెను. ఇప్పుడేవిధముగ రాజసూయ యాగమెట్లు జరిగినదో దానిని వర్ణించెదను.''

---

## ధర్మజ రాజసూయము

శ్లో॥ మేనిరే కృష్ణభక్తస్య సూపపన్న మవిస్మితాః
అయాజయన్మహారాజం యాజకా దేవవర్చసః।
రాజసూయేన విధివత్ప్రాచేత సమివా మరాః॥

—శ్రీభాగ. ౧౦స్కం ౭౪అ. ౧౬శ్లో.

''రాజా! రాజసూయ యాగమునకు నిమంత్రితులై వచ్చిన రాజులే విధమగు విస్మయమును బ్రకటింపకయే శ్రీకృష్ణ భగవానున కనన్య భక్తుడగు ధర్మరాజుయొక్క యీ వైభవశాలి యగుయజ్ఞమును ఉచితమనియే తలంచిరి.

దేవతలవలె, దేజస్వు లగు యాజకులు ధర్మరాజుచేఁ బ్రాచీన కాలమున వరుణదేవునిచే దేవతను చేయించినట్లు చేయించిరి.

ఎవని మీఁద భగవానుని కృపయుండునో వాని యజ్ఞయాగాదులే సఫలము లగును. భగవత్కృప లేక శుభ కర్మలు నెఱవేరవు. భగవద్భక్తుఁ డేమైనఁ జేయ వచ్చును. ఎవని శిరస్సున శ్యామ సుందరుఁడు కలఁడో, ఆతనికిఁ బ్రపంచమునఁ గఠిన మేమియు నుండదు. ఆతఁ డేమైన జేయఁ గలఁడు. కఠిన కార్యమైనను నాతనికి సరసము కాఁగలదు. అసంభవమును సంభవము కాఁగలదు. దుష్కరమును సుకరము కాఁగలదు. అపూర్ణమును బూర్ణము కాఁగలదు. కావునఁ బ్రతివారును భగవానుని పాదపద్మములందు ప్రేమ కలిగి యుండునట్లు ప్రయత్నము చేయవలయును. భగవద్భక్తి కలిగినచో జగత్తులో గొప్పగొప్ప కార్యములును సామాన్యముగ నెఱవేరును.

సూతుఁడిట్లనెను:–"మునులారా! శ్రీకృష్ణ భగవానునిచేఁ అనుగ్రహముచే బృథివి యందుగల రాజులందఱును ధర్మరాజునకు వశులైరి. ఆతని కోశము, ధన, రత్న, మణి, మాణిక్యాదులచేఁ బరిపూర్ణ మయ్యెను. అప్పుఁ డాతఁడొక దినమున శ్రీకృష్ణునితో నమ్రతతో నిట్లు నివేదించుకొనెను. "యదునందనా! మీ యనుగ్రహముచే నిప్పుడు రాజ

సూయ యాగమును జేయవచ్చు ననుకొనుచున్నాను. ఇప్పు డప్పుడమిని నాకు లొంగని రాజు లేఁడు. ఇది జగద్విదితము. నీ యనుగ్రహమున నాకోశములోఁ జేరిన ధనము నెన్నిఁ సంవత్సరములు కొల్లగొట్టుకొని తిన్నను దరుగదు. ఇంద్ర ప్రస్థమున నిప్పుడు రాజసూయయాగమును జేయవలయునని యున్నది. దీనికి మీరే దీక్ష దీసుకొన వలయును. ఏలఁ ననఁగా సమస్త యజ్ఞములను జేయుంచువారును, జేయు వారును, యజ్ఞభోక్తలును, హవిర్దాతలును మీరే. మీరే హవిస్సు, మీరే అర్పణము. మీరే అగ్ని. మీరే యజ మానులు, ఋత్విజులు, సదస్సులు, సభాపతులు. కావున మీరు రుక్మిణితోఁ గూడి రాజసూయయాగ దీక్షితులు కండు."

ఇది విని నవ్వుచుఁ గృష్ణుఁ డిట్లనెను :–"ధర్మరాజా! రాజసూయయాగ మొనర్చు యోగ్యత నీయందే కలదు. నీవు ద్రౌపదీదేవితోఁ గూడి యజ్ఞదీక్షను గొనవలయును. నీవద్ద ఏవస్తువును గొదువలేదు. యాజ్ఞను బరిపాలించుటకు మేమందరమును సేవకులమై సిద్ధముగ నున్నాము. నీ విప్పుడు విలంబన మొనర్పరాదు."

ఇది వినగానే ధర్మరాజు ఆనందమునకు మేఱ లేకుం డెను. ఆతఁడు తన నలుగురు తమ్ములను, మంత్రులను, బిలిచి వారితో నిట్లనెను :–"రాజసూయ యాగ మొనర్ప వలయును. పెరుగు, పాలు, నేయి మొదలగు వాని నుంచు

టకై పెద్దపెద్ద కుండముల నేర్పాటు చేయవలయును. వానిని జక్కగ ముఖము కనబడు నట్లుగ నునుపుగను, తెలుపుగను నొనర్పవలయును వానినిగప్పుటకై మంచిగంధపు చెక్కలు కావలయును. తిల, యవ, వ్రీహి పర్వతముల నేర్పఱుపవల యును. బెల్లము, చక్కెరలతో నిండిన సంచుల పర్వతముల నేర్పఱుపుఁడు. బ్రాహ్మణుల కొఱకు సుందర స్వాదిష్ట పదా ర్థములకై యేర్పాటులు కావింపుఁడు. మంచి మంచి వంటలను, బిండివంటలను జేయగల వంటవాండ్రను దేశ విదేశముల నుండి పిలిపింపుఁడు. ఇంతకు సారాంశ మేమ నఁగా ఏ వస్తువును లోటు రాఁగూడదు. ఏ వస్తువు నడిగినను నిది లేదని పలుకఁగూడదు. యజ్ఞమునకు వచ్చినవారు వచ్చి యే వస్తువు నడిగిన దాని నా సమయముననే లేదని కీయ వలయును.''

అందఱేక కంఠమున నిట్లనిరి:- ''ప్రభూ! అట్లే అగు గాక! మే మిప్పు డేర్పాటు లన్నియును జేయగలము.''

ఇట్లు పలికి అందఱును గలిసి యజ్ఞసంబంధమగు సామగ్రుల నన్నిటిని సమకూర్చిరి. వేదవ్యాసునీ యజ్ఞము నకు ముఖ్యులుగ నొనర్చిరి. ఆతఁడు యజ్ఞములను జేయింపఁ గల గొప్ప గొప్ప ఋషులను, మునులను మనుష్యులను బంపి అత్యంత గౌరవముతోఁ బిలిపించెను. శ్రీకృష్ణుని దర్శ నాపేక్ష చేతను, ధర్మరాజుయొక్క ప్రేమపూర్వకమగు

బిలుపుచేతను, గొప్ప గొప్ప బ్రహర్షులును, రాజర్షులును రాజసూయ యాగమునకు విచ్చేసిరి. వారిలో ముఖ్యులు వీరు, వేదవ్యాసుఁడా యజ్ఞమున కధ్యక్షుఁడు కదా! ఆతఁడు గాక భరద్వాజుఁడు, సుమంతుఁడు, గౌతముఁడు, అసితుఁడు, వశిష్టుఁడు, చ్యవనుఁడు, కణ్వుఁడు, మైత్రేయుఁడు, కవ షుఁడు, త్రితుఁడు, విశ్వామిత్రుఁడు, వామదేవుఁడు, సుమతి, జైమిని, క్రతువు, పైలుఁడు, పరాశరుఁడు, గర్గుఁడు, వైశం పాయనుఁడు, అథర్వుఁడు, కశ్యపుఁడు, ధౌమ్యుఁడు, రాముఁడు, భార్గవుఁడు, ఆసురి, వీతిహోత్రుఁడు, మధుచ్ఛ దుఁడు, వీరసేనుఁడు, అకృతవ్రణుఁడు మొదలగు వేదమర్మ జ్ఞులగు ఋషులును, మునులును విజయమొనర్చిరి.

ధర్మరాజు, తన సోదరుఁడగు నకులుని హస్తిన పురమునకుఁ బిలిచి, మన కులమందలి పిన్నలను బెద్దలనం దఱను యజ్ఞమునకు బిలచికొని రావలయునని చెప్పెను. ధర్మ రాజు ఆజ్ఞానుసారముగ నకులుఁడు హస్తినాపురమునకు బోయెను. అచ్చట నాతఁడందఱి నాదరపూర్వకము నాహ్వానించెను. భీష్మ, ధృతరాష్ట్ర, విదురాదులిది వి మన వంశములో రాజసూయయాగ మొనర్చువాఁడు నొకఁడు కలఁడని చాల సంతసించిరి. ఈ యజ్ఞము ని వఱలో వరుణుఁడును, చంద్రుఁడును జేసి యుండిరి. వారం దఱును బరమానందమును జెంది యింద్రప్రస్థమునకు బయ

దేరిరి. భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్ర, విదుర, కర్ణ, శల్య, బాహ్లీక, సోమదత్త, భూరి, భూరిశ్రవ, అశ్వత్థామ, కృపాచార్య, జయద్రథ, యజ్ఞసేనాది, రాజులందఱును రాజసూయ యాగమును జూచుటకై వచ్చిరి. దుర్యోధనునకు లోపలఁ బాండవులనిన మంట. వారి యైశ్వర్యమును గాంచి యీర్ష్యఁ జెందు చుండును. ఆతనికి మనస్సులో యజ్ఞమునకుఁ బోవలయునని లేదు. కాని లోకము కొఱకు ఇష్టములేకున్నను బోవలసి వచ్చెను. ఆతఁడును జాలవైభవముగఁదమ్ములతోఁ గూడి రాజసూయయాగమునకు వచ్చెను. దేశ దేశాంతరములనుండి వచ్చిన రాజులు వేసినడేరాలు గంగాతీరమున యోజనము వఱకు కలవు. గజ, తురగ, రథాదులచే యజ్ఞస్థలమొక విశాల నగరమున్నట్లుండెను. అంగ, వంగ, కళింగ, సౌరాష్ట్ర, మగధ, ద్రవిడ, పాండ్య, చోళ, కుండల, మాళవ, కాశ్మీర, బాహ్లీకాదులును, వేలకొలఁది పర్వతప్రాంతము లందలి రాజులును ధర్మజ రాజసూయమునకు వచ్చిరి. ధర్మ రాజందఱకును స్వాగత సత్కారముల నత్యద్భుతముగ నొనర్చెను. దానికొక స్వాగత సమితి నేర్పఱచెను. దానికి ప్రధానాధ్యక్షులు ద్రోణాచార్యుఁడును, భీష్మాచార్యుడునై యుండిరి. వీరిద్దరకును ధర్మరాజు సర్వాధికారముల నొసంగెను. వీరు వారిష్టము వచ్చినట్లు చేయవచ్చును. అన్ని కార్యములకును నుపసంఘము లేర్పఱుపఁబడినవి. వానికి

ఒక్కొక్కరిని, ఇద్దరిద్దరిని నధ్యక్షులుగ నేర్పఱచెను. భోజనములమీఁద పెత్తనము భీమునకొసంగఁబడెను. తినుట తెలియని వాఁడితరుల కేమి పెట్టఁగలఁడు? ఎప్పుడైనను భోజనముమీఁద పెత్తనము బాగుగాఁ దినువాని కీయవలెను. భీమసేనుఁడు మణుఁగున్నర హల్వాను అల్పాహారముగఁ దిని వేయును. ఆతని కాఁకలైనప్పు డితరుల ఆకలిని గూడ గమనించును. అందువలన భోజనముల భారమీతనిపైఁ బెట్టఁబడినది. కాని యీతనిలో నొక లోపముకలదు. గృహస్థు. ధర్మరాజుని తమ్ముఁడు. ఆతఁడు వ్యయమొనర్చును. లోభమనది ఆతనికి లేదు. అందఱకు నిష్టమువచ్చినట్లు పెట్టుచుండును. ఒకవేళ అన్నము వ్యర్థమగునేమోనని ఆతనికి దుశ్శాసనునిగూడ భోజన విభాగమున కధ్యక్షునిగ నియమించిరి. ద్రోణపుత్రుఁడగు నశ్వత్థామునకు బ్రాహ్మణ సత్కారకార్యము నొసంగిరి. ఆతఁడు తనసహచరులతోఁ గలిసి యజ్ఞమునకు వచ్చుచుండిన బ్రాహ్మణుల నందఱను సత్కరించుచుండెను. వచ్చిన రాజులందఱకును స్వాగత సత్కారము లొనర్చుటకై సంజయుని నియోగించిరి. రాజులు తెచ్చిన నరణములను గ్రహించుటకై దుర్యోధనుని నియోగించిరి. దుర్యోధనుఁడు చక్రవర్తివలె రాజులనుండి వివిధ వస్తువులను, వారి ప్రణామములను స్వీకరించుచుండెను. బ్రాహ్మణులకు దక్షిణలొసంగు కార్యము కృపాచార్యున

కొసంగఁబడెను. ఆతఁడే బ్రాహ్మణునకైనను నెంతధనము నైనను, రత్నములనైనను నొసంగవచ్చును. అచ్చటికి వచ్చిన రాజులకు చందన తాంబూలములను, సత్కారముల నొనర్చుకార్యము సహదేవున కొసంగఁబడెను. ఏవిభాగమున కేవస్తువు కావలసి వచ్చినను దానినిఁ జేకూర్చుటయును, ఆ వస్తువు నొసంగు కార్యము నకులున కొసంగఁబడెను. భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్ర, దుర్యోధనాది మాన్యులకే లోటును రాకుండ చూచుభారమును నర్జునుఁడు పెట్టుకొనెను. దానాధ్యక్షునిఁగఁ గర్ణుఁడుండెను. ఏలననఁగా ధనముమీఁద నాశకలవాఁడు ధారాళముగ ముక్తహస్తముతో దానము లొనర్పఁజాలఁడు. ప్రపంచమునఁ గర్ణునకు మించిన దాత లేనేలేఁడు. అందువలన దానమొసంగుట కాతఁడు నియోగింపఁబడినాఁడు. అన్నములను వడ్డించు కార్యమును స్వయముగ ద్రౌపదియును, ధృష్టద్యుమ్నుఁడును, శిఖండియును స్వీకరించిరి. యజ్ఞమునకు వ్యయమొనర్చు కార్యము విదురున కొసంగఁబడెను. వీరు కాక సాత్యకి, వికర్ణుఁడు హార్దిక్యుఁడు, భూరిశ్రవుఁడు, బాహ్లికపుత్రుఁడగు సంతర్దనాదు లితర విభాగములలో నధ్యక్షులై యజ్ఞ సేవా కార్యములను నిర్వహించుచుండిరి.

ధర్మరాజందఱకు నన్ని కార్యములను నియోగింపఁగా వాసుదేవభగవానుఁ డిట్లనెను:-"రాజా! మాకును నేదైన కార్యము నొసంగుము."

ప్రేమ భరిత కంఠముతో గద్గద స్వరమున ధర్మ రాజిట్లనెను :- "వాసుదేవా! అంతయును జేయునదియును జేయించునదియును మీరే. మీ రందఱకును స్వాములు. మీకు బనిచెప్పఁగలవారెవరు? మీకిష్టము వచ్చిన దానినిఁ జేయుఁడు."

నవ్వి నారాయణుఁడిట్లనెను :- "అట్లు కాదు రాజా అట్లు పలికినచోఁ బనులు జరుగవు. నాకును యజ్ఞమునఁ జిన్న కార్యమునో పెద్ద కార్యమునో వప్పఁజెప్పుఁడు."

ధర్మరాజిట్లనెను :- "మాధవా! నేను జెప్పుచునే యున్నాను గదా! మీకే కార్యము మంచిదని తోఁచిన నాకార్యభారమును వహింపవచ్చును."

భగవానుఁడిట్లనెను :-"సమస్త అతిథులును, ఋషులును, మునులును కాలినడకను యజ్ఞమంటపము కడకు వచ్చుచుందురు. చరణముల కధిష్టాతృదేవత విష్ణువు. పైఁగా విష్ణు ప్రీతికై మీరు యజ్ఞము నొనర్చుచున్నారు. వచ్చిన అతిథుల పాదములను గడిగినచో యజ్ఞసేవయొక్క సమస్త ఫలమును లభింపఁగలదు. కావున నేను ఋషిమునుల చరణములను గడు కార్యమును స్వీకరించెదను." ఇది వినఁగానే అందఱ కన్నులలోఁ బ్రేమాశ్రువులు నిండెను. ధర్మరాజిట్లనెను:-" ప్రభూ! ఈ కార్యము మీకనురూపమైనదే. అందు వలననే మీకు బ్రహ్మణ్యదేవుఁడను పేరువచ్చినది. అది

సార్థకమైనది. యజ్ఞమునకు వచ్చిన వారీ యద్భుత, అపూర్వ దృశ్యమును దమ కన్నులారఁ జూడఁగలరు.''

భగవానుఁడిట్లనెను:- ''ఏమైనఁగానిండు. యజ్ఞములో నేనీసేవనే చేసెదను.''

సూతుఁడిట్లనెను :-''మునులారా! ఇట్లు పలికి కృష్ణుడు బ్రాహ్మణుల కాళ్లు కడుగు కార్యమును దనపైఁబెట్టుకొనెను. అచ్యుతుని కరకమల మతిమృదులము. ఆతని యరచేతులతి మృదువుగ నుండును. దానినుండి నిరంతరము దివ్య కమల గంధము వెలువడుచుండును. ఆతఁడు మునుల పాదములను బాగుగా గీచిగీచి కడుగునప్పుడు, మునుల మనము కురములు వికసించుచుండెను. వారు బ్రహ్మానంద మగ్నులగు చుందురు. వారి కత్యంతానందము కలుగు చుండెడిది. ఆ సుఖము కొఱకై వారటు నిటు వెడలి వచ్చి మరలఁ బాదములను కడిగించుకొనెడువారు. కృష్ణుఁడు విసుగు కొనెడు వాఁడు కాదు. ఎన్నిసారులు కడిగించుకొనుటకు వచ్చిన నన్ని సారులు భక్తితోఁ గడిగెడువాఁడు.''

ఆ సమయమున దుర్వాస మహాముని యెచ్చటినుం డియో తిరిగి తిరిగి వచ్చెను. ఆతనిఁ గాంచఁగనే అందఱును భయపడిరి. ఆతనికడ నెల్లప్పుడును శాపముల పొట్లము సిద్ధముగ నుండును. ఏలోపమున నేమి శాపమును బెట్టునో యని యెవరును నాతని యెదుటకు రాలేదు. ఆతఁడు వచ్చి

ద్వారమున నిలుచుండెను. కృష్ణుఁడును భయపడెను. దుర్వాసుని పాదములకు బురదయై యుండెను. కృష్ణుఁడాతని పాదములను గడుగుచుండెను గాని ఆతని కరములు కంపించుచునే యుండెను. నేనందఱకును శాపమొసంగితిని. శ్రీకృష్ణునకు మాత్రము శాపమొసంగకుండిన నా దుర్వాస నామమెట్లు సార్థకము కాఁగల' దని వచ్చినాఁడేమో! భగవానుఁడంతర్యామి. సమస్త జీవరాసుల హృదయములలో నేముండునో తెలిసికోనఁగలఁడు. ముని తనకు శాపమొసంగఁ దలఁచుచున్నాఁడని ముకుందుఁడు తెలిసికొనెను. సరే, నాకు పత్రము, పుష్పము, ఫలము, జలము ప్రేమతో విష మొసంగినను నేను సంతోషముతో స్వీకరించెదను. పూతన విష మొసంగుటకై వచ్చినది. నేను విషమును, దానితోఁ బాటుగ దాని ప్రాణములను గూడ త్రాగివేసితిని.' అని లోలోపల ననుకొనుచు దుర్వాసుని యెడమపాదమున కడుగు భాగమునఁ గొంచెముగ బురదను గడుగుచు వదలివైచెను. ఇంకేమున్నది ? వెంటనే దుర్వాసుఁడు తనశాపరూపమగు నమోఘాస్త్రమును విడిచెను. ఆతఁడిట్లడిగెను:—''కృష్ణా! నీ కహంకారమున్నది. నీవు సేవాకార్యమును గ్రహించితివి. కాని దానిని బాగుగా నిర్వహించుటలేదు. చూడుము. నా కాలికి మధ్యమధ్య బురద అంటుకొనియే యున్నది. కావున నేను నీకు శాపమొసంగుచున్నాను. నీ కాలిలో బాణము తగిలి, దానితోడనే అంతమయ్యెదవు.''

భగవానుఁడు తలనూపి దుర్వాసుని శాపమును సహర్ష ముగ స్వీకరించెను. తర్వాత మునికిఁ బశ్చాత్తాపము కలిగెను. కాని భగవానుఁ డిట్లు పలికి ఆతని నాశ్వాసించెను:- ఇదంతయును నాయిచ్ఛచేతనే జరిగినది. ఈ విషయమునఁ జింతింపవలసిన పనిలేదు.''

సూతుఁ డిట్లనెను :- ''మునులారా! ఈ విధముగ ధర్మరాజు యజ్ఞము మిక్కిలి వైభవముగ జరుగుచుండెను. ఎటుచూచినను వేదధ్వని వినిపించుచుండెను. అచ్చట భోజనమున కడ్డులేదు. ఎవరైనను వచ్చి తినినంత దిన వచ్చును, తీసికొనిపోయినంతఁ దీసికొనిపోవచ్చును, ఎవరే వస్తువును యాచించెదరో వారికావస్తువు వెంటనే లభించును. ఆ యజ్ఞమున నన్నము పర్వత మంతయుండెను. పప్పు, పులుసు, క్షీరాన్నము, పిండివంటలు మొదలైనవి పెద్దపెద్ద కుండలములనిండ నుండెను. తినుబండారములలో సమృద్ధిగ లేని వస్తువేదియును లేదు. యాచకుల యాచకులగుటయే గాక దాతలగు నంతగ దానము లొసంగఁబడెను. బ్రాహ్మణులు తామెత్తలేనంతగ దక్షిణలను బొందిరి. ఈ విధముగ ధర్మజ రాజసూయము చాల వైభవముగ సమాప్తమయ్యెను. అచ్చట కృష్ణున కగ్రపూజ యెట్లు జరిగినదియుఁ జెప్పెదను వినుఁడు.''

---

# శ్రీకృష్ణున కగ్రపూజ

శ్లో॥ శ్రుత్వా ద్విజేరితం రాజా జ్ఞాత్వా హార్దం సభాసదామ్ ।
సమర్హయద్ధృషీకేశం ప్రీతః ప్రణయ విహ్వలః॥

—శ్రీభాగ. ౧౦ స్కం. ౭౪ అ. ౨౬ శ్లో॥

కం॥ చంచత్కాంచన రుచిరో
దంచిత వస్త్రముల నూతనార్కప్రభలన్
మించిన రత్నములం బూ
జించెన్ ధర్మజుఁడు కృష్ణుజిష్ణు సహిష్ణున్॥

—శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచమునఁ బూజ భగమునకే కలుగును. సమగ్ర ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, ధర్మము, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆఱింటికి భగమని పేరు. ఈ యాఱు నెవరి యందు బూర్ణముగ నుండునో ఆతఁడు భగవానుఁడనఁబడును. ఎచ్చటనైనఁ బూజజరిగినచో నీయాఱు కారణముల వలన జరుగును. ఎచ్చటనైన నైశ్వర్యశాలి, వీర్యవంతుడు, యశస్వి, శ్రీమంతుఁడు, జ్ఞానవంతుఁడు, వైరాగ్యవంతుఁడుండునో, వారే పూజింపఁబడెదరు. ప్రపంచమున వారంశ రూపముననుండెదరు.లోకమున శ్రీమంతులనబడువారికడలక్షయో రెండులక్షలో, కోటియో, అర్బుదమో, ఖర్వమో ద్రవ్యముండవచ్చును గాని భగవానుని సేవలో సర్వదా లక్ష్మీదేవి మూర్తిభవించి సేవించుచుండును. కావున నాతనికి మించిన

శ్రీమంతుఁడెవఁడుండఁగలఁడు ? స్వయముగ సాక్షాత్సాకార స్వరూపుఁడగు శ్యామసుందరుఁడుండిన సభలో నింకెవరి కగ్రపూజ జరుగఁగలదు ? ఋషి, ముని, దేవ, ద్విజాదు లందఱును నాతని యంశములే. కాని పురుష రూపమునఁ నుండినఁ బురుషోత్తముఁ డాతఁడు. నరులలో నాతఁడే నరోత్తముఁడు. నరులలో నేదైనఁ బూజ జరుగవలసియుండిన నరోత్తమునకే పూజ జరుగవలెను.

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! ధర్మజుని రాజసూయ యాగము మిక్కిలి యుత్సాహముగ జరిగినది. యజ్ఞాంతమున నొక సౌత్యదివసముండును. ఆ దినమున సోమవల్లీ లతను దంపి, రసమును దీసి, ఆ రసమును దేవతలచే బానము చేయించెదరు. యజ్ఞములందా దినము సర్వశ్రేష్ఠమైనది. ఆ దినముననే యజ్ఞాంత స్నానమును జరుగఁగలదు. ఆదినమున ఋత్విజ, సదస్య, సభాపతులకును అచ్చటికి వచ్చిన రాజులకును విశేషముగ సమ్మానము జరుగును. పద ప్రతిష్ఠ, యోగ్యతలను బట్టి అందఱకును నర్ఘ్యమీయఁబడును.

ధర్మరాజు ముందుగా యజ్ఞమును జేయించు గొప్ప గొప్ప శ్రోత్రియ, వేదజ్ఞులగు యాజకులకును, సభాపతికిని సావధానముగఁ బూజ కావించెను. యజ్ఞముయొక్క సద సస్పతి, యాజక, శ్రేష్ఠ, బ్రాహ్మణ పూజనమైన తరువాత

నిప్పుడచ్చటికి వచ్చిన రాజులనందఱను సమ్మానింపవలసి యుండెను. వారికిని నర్ఘ్యము నొసంగి సమ్మానింపవలయును. అచ్చటికి వచ్చినరాజు లెవరికి వారు తామే శ్రేష్ఠులమను కొనుచుండిరి. ఇప్పుడగ్రపూజ నెవరికిఁ జేయవలయునను ప్రశ్న వచ్చెను. ధర్మజ రాజసూయమున నే రాజు అగ్ర పూజను బొందునో ఆతఁడే శ్రేష్ఠుఁడుగ నెన్నఁబడును. ఈ విషయమునఁ జాల అభిప్రాయ భేదము లేర్పడెను. అచ్చటికి దేశ దేశాంతరములనుండి రాజులు వచ్చిరి. వారు తామే గొప్పవార మనుకొనుచుండిరి. తమకే అగ్రపూజ జరిగి, ఆ సామ్రాగ్రి వారికే లభింపవలయునని వారికోరిక. తమంతట తాము చెప్పుకొనక, తమకనుకూలురగు రాజులచేఁ జెప్పించు చుండిరి. తమ్ము సమర్థించు వారెక్కువగఁ గలవారు వారినిఁ బ్రశంసించుచుఁ గోలాహల మొనర్చుచుండిరి. తమ పక్షము వారినిఁ బ్రశంసించుచుండిరి. అగ్రపూజ కర్హులు కారని యితర రాజులను దూషించుచుండిరి. ఇతర రాజులను దూషించిన గాని తమ శ్రేష్ఠత్వము స్థిరపడదనివారి యూహ. ఇట్లు కోలాహలము జరుగుచుండెను. సర్వసమ్మతమగు నిర్ణయ మేదియును గాకుండెను. ధర్మరాజు మిక్కిలి ధర్మసంకట మునఁబడిపోయెను. ఆతఁడిట్లనుకొనెను :— "ఇంతవఱకు యజ్ఞమంతయును జాల జయప్రదముగ జరిగినది. చివరకు వికటమగు నభిప్రాయభేదము కలిగినదే. ఆతఁడు శంకిత

చిత్తముతో నిలుచుండి, చేతులను జోడించుకొని యిట్లనెను :- "రాజన్యులారా! మీరందఱును శ్రేష్ఠులే. అందఱును గులీనులే. అందఱును బూజనీయులగు నరపతులే. అయినను నగ్రపూజ ఒక్కనికే జరుగఁగలదు. పూజ అందఱకును జరుగఁగలదు. కాని మునుముందుగాఁ బూజ యెవరికిఁ జేయవలయునో తెల్పుఁడు."

ఇదివిని ధర్మరాజుతమ్ముఁడు సహదేవుఁడు లేచి, ఆవేశమున రాజుల నందఱను సంబోధించుచు నిట్లనెను :- "సభాసదులారా! నేనొకటి నివేదించెదను. ఈ సభలో నందఱును శ్రేష్ఠులే. కాని అగ్రపూజ కొక్క యదునందనుఁడగు వాసుదేవుఁడే అర్హుఁడు. యజ్ఞమునందలి ధనాద్యుపకరణములును, దేశ, కాల, పాత్రములును నాతని స్వరూపములే. ఈతనికి భిన్నమైన దేదియును లేదు. అగ్నిహోత్రము, దర్శ, పౌర్ణమాస్య, చాతుర్మాస్య, పశుయజ్ఞ, సోమ యజ్ఞాదులన్నియును నాతని స్వరూపములే. అగ్ని, ఆహుతి, మంత్ర, సాంఖ్య, యోగాదులన్నియు నొనర్చుట ఆయన కొఱకే. శాస్త్రములన్నిటినిఁ బ్రతిపాదించినదీతఁడే. ఈ దృశ్య ప్రపంచమంతయు నీతని స్వరూపమే. ఈతఁడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులై సృష్టి, స్థితి, లయము లొనర్చుచుండును. ఈతనివలననే యీ జగత్తంతయును గర్మలొనర్చుచున్నది. సమస్త కర్మలకు సిద్ధినొసంగు సిద్ధిదాతయగు

సర్వేశ్వరుఁడీతఁడే. నా యభిప్రాయము సర్వేశ్వరుఁడగు నచ్యుతునకే అగ్రపూజ జరుగవలెను. ఈతఁడు జీవులకు స్వామి. ఈతనికి బూజ జరిగిన నందఱకును బూజ జరిగినట్లే. చేసిన కర్మల ననంతమొనర్చుకొనుటకై అన్నిటిని నీ యఖిలేశ్వరుఁడగు నచ్యుతునకే సమర్పింప వలయును. ఈతఁడు భేదభావ రహితుఁడు. శాంతుడు. పరిపూర్ణుఁడు. సమస్త భూతముల కంతరాత్మ. ఏ దానమునైనను నీతని కొసంగినచో నక్షయమును ననంతమునగును. కావున నాఅభిప్రాయమున నీతఁడే అగ్రపూజ కధికారి. మీరందఱును నాయభిప్రాయమును సమర్థించి శ్రీ కృష్ణునకే అగ్రపూజకావించుటకై మీ అందఱును మీమీ సమ్మతి నొసంగఁగలరని నేనాశించుటయే కాదు. విశ్వసించుచున్నాను ''

ఈ విధముగఁ బ్రబల యుక్తులతోఁ దన యభిప్రాయమును సమర్థించుకొనుచు, భగవానుని ప్రభావము నుగ్గాటించుచు సహదేవుఁడు నిలుచుండెను. అతఁడు లేచుటను గాంచి ధర్మరాజు కసురుచు నిట్లనెను :- ''సహదేవా నీవింకను గుఱ్ఱవాఁడవు. ఈ సభలో మన కులగురువులును, మనకందఱకును బితామహుఁడగు భీష్ముఁడు నుండఁగా నీవు మాటలాడు టెందులకు ?''

ధర్మరాజుకసరఁగా సహదేవుఁడు లజ్జితుఁడై తన స్థానమునకు బోయి కూర్చుండెను.

అప్పుడు భీష్మపితామహుఁడు ధర్మరాజును వారించుచు నిట్లనెను :- "యుధిష్ఠిరా! నీ వ్యవహారము శాస్త్రసమ్మత మైనది కాదు. తల నెఱసినవాఁడు కాదు వృద్ధుఁడు. ఉచితమును, యుక్తియుక్తము నగు వాక్యములను బలుకువాఁడే వృద్ధుఁడు. బాలకుఁడై నను ధర్మయుక్తమును, శ్రేష్ఠమునగు వాక్కులు పలికినచో నవి గ్రాహ్యములే కాఁగలవు. దీనికి విపరీతముగ వృద్ధుఁడై నను ధర్మవిరుద్ధములగు వాక్యములను బలికినచో నవి గ్రాహ్యములు కాఁజాలవు. సహదేవుఁడు యుక్తియుక్తములగు వాక్యములను బలికినాఁడు. మన కర్ఘ్య మొసంగుట సమ్మాన సూచకము. ఆచార్య, ఋత్విజ శ్వశురాదులును, శ్రేష్ఠసంబంధులును, స్నాతక బ్రహ్మచారియును, మిత్రుఁడును, రాజును వీరు వచ్చినచో వీరు శ్రేష్ఠులు కావున వీరి కర్ఘ్య మొసంగి సమ్మానింపవలెను. చాలకాలము తనకడ నున్నవారును నర్ఘ్యమున కర్హులే. ఈ సంబంధమున యజ్ఞమునకు వచ్చిన రాజులందఱును బూజనీయులే. నీవు వీరి కందఱకును నర్ఘ్యము నొసంగి, సమ్మానింపవలయును. ఇంతకు వివాదము ముందెవరి కర్ఘ్య మీయవలయు ననియే. సదాచార మేమనఁగా నప్పటికుండిన రాజులందఱిలో నందఱికంటె నధిక సామర్థ్యము కలవాఁడును, శ్రేష్ఠుఁడు నెవఁడుండునో ముందాతని కర్ఘ్యము నొసంగి, తరువాత సామాన్యరూపమున నితరుల కీయవలయును. సహదేవుఁడు

చేసిన ప్రస్తావము సర్వథా ఉచితమైనది. శ్రీకృష్ణుఁడు సామర్థ్యమందును, పరాక్రమ, నీతి, ధర్మ, కుశలతా, యుద్ధ చాతురీ, రూప, గుణ, సౌందర్య, ప్రభావ, ఓజ, తేజ, బల వీర్యాది సమస్తవిషయము లందును శ్రేష్ఠుఁడు. ఈ సభ యంతయును నింతగా శోభించుటకు కారణము శ్రీకృష్ణుఁ డుండుటయే. కావున మునుముందుగా వాసుదేవునకే పూజ జరుగవలయును. అతఁడే దీనికి సర్వోత్తమ పాత్ర."

ఇది విని బ్రాహ్మణు లైక్యకంఠమున నిట్లనిరి :— "సాధుసాధు. ఇది సర్వోత్తమమైనది. శ్రీకృష్ణునకే ప్రథమ పూజ జరుగవలయును." జరాసంధుని కారాగృహమున బంధింపఁబడిన యిరువదివేలమంది రాజులును నిట్లనిరి:-"భగవానునకే సర్వప్రథమ పూజ జరుగవలయును." ఈ కోలాహలమున నెవరి మాటలను వినుటలేదు. ఈ విషయమునఁ బ్రతికూలముగ నున్నవారును నింతమంది ఆ విషయమును సమర్థించుటచే మాటలాడఁజాలక నూరకుండిరి. వారూరక ఆసనముల మీఁదఁ గూర్చుండిరి. అందఱ యంగీకారము వచ్చినదని భావించి, ధర్మరాజు సహదేవునితోఁ బూజ సామాగ్రులను శ్యామసుందరుని సమ్ముఖమునఁ బెట్టుమని ఆదేశించెను. అన్నదమ్ము లైదుగురు నొక్కచోటునకుఁ జేరిరి. ద్రౌపదీదేవి ధర్మరాజు ప్రక్కనఁ గూర్చుండెను. నేఁడు తామందఱ ముందఱ తమకు హృదయధనమగు యదు

నందనునకుఁ బూజ నొనర్చుచుంటిమను విషయమును స్మరింప గానే వారికి రోమాంచమయ్యెను. ధర్మరాజు ప్రేమ విహ్వా లుఁడై శరీరమును మఱచెను. కురుకులమందలి సంబంధు లందఱును భగవానునిఁ బూజించుట కొక్కచోటునకుఁ జేరిరి. ధర్మరాజుని మంత్రులును, పురోహితులును, సుహృ ద్జనులును, ఇతరపరివారమును నచ్చటనే కూర్చుండిరి. ఆ సభలో శివ, బ్రహ్మేంద్రాదులును, లోకపాలురును సమ తమ గణములతోఁగూడి విరాజల్లుచుండిరి. గంధర్వ, విద్యా ధర, సర్ప, యక్ష, రాక్షస, ముని, కిన్నర, ఖగ, సిద్ధచార ణాదులును నుండిరి. భగవానుని బూజనుగాంచి, అందఱును ప్రముదితులైరి. సోదరుల సహాయముచే ధర్మరాజు శ్రీకృష్ణుని పాదపద్మములను ప్రక్షాళనము గావించి, యా భువనమో హన పాదోదక జలమును భక్తిపూర్వకముగ శిరస్సున ధరిం చిరి. అంత నర్ఘ్య, ఆచమనీయ, స్నానీయజలముల నొసంగి యజ్ఞోపవీతములను, రెండు పట్టుపీతాంబరములను బహు మూల్యములగు నాభరణములను నాతని కర్పించిరి. చంద నాక్షత, పుష్ప, మాలా, ధూప, దీప నైవేద్యాదులచే నాతని విధ్యుక్తముగఁ బూజించెను. ఆ సమయమున ధర్మరాజు స్థితి విచిత్రముగనుండెను. ఆతఁడు భక్తిచే నధీరుఁడయ్యెను. కరము గడగడ వణఁకుచుండెను. పురోహితుఁ డేదైన వస్తు వును దీసికొనుమనిన దానినిఁ దీసికొనును. ఆతఁడు గంధము

నర్పించుమనిన నక్షతల నర్పించుచుండును. ఆతఁడు శ్యామ సుందరుని త్రిభువన మోహన రూపమును గన్నులారాఁ గనఁదలఁచు చుండును. కాని నిరంతరము కన్నుల నీరు క్రమ్ముటచే నాతఁడు బాగుగా భగవంతునిఁ జూడఁజాలక పోవుచుండెను. ఆతనికి సభలో నే వస్తువును బాగుగాఁ గన బడుటలేదు. సభలో నంతటను నానందోల్లాసము వ్యాపించి యుండెను. అందఱును నాకాశము బ్రద్దలగునట్లు జయజయ ధ్వానము లొనర్చుచుండిరి. ఆకాశమునుండి సురగణము కల్పవృక్ష కుసుమములను ననవరతము వర్షింపఁ జేయుచుండిరి. ప్రజలందఱును జేతులను జోడించుకొని, కన్నుల నానంద బాష్పములను గార్చుచు, బిగ్గఱగ 'జయజయధ్వానులును, ధన్యవాదములును, నమోవాకములను జెప్పుచు నఱచు చుండిరి. ఆ కోలాహలమున నెవరి మాటయును వినఁబడుట లేదు. ధర్మరాజు ఆత్మవిస్మృతినిజెం'ది యంత్రమువలెఁ బూజించుచుండెను. ఆతఁడు భగవంతుని కర్పించుటకే వస్తువును గనఁబడుటలేదు. ఆతఁడు తన శరీరమునే భగ వంతుని కర్పించివైచెను.

సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఈసభయం దందఱును బ్రసన్నులుగను, సంతుష్టులుగ నుండిరి. కాని చేదిదేశపు రాజగు శిశుపాలుఁడీర్ష్యావశమున మండిపడుచుం డెను. కృష్ణున కిట్టి సన్మానము జరుగుట ఆతని కిష్టములేదు.

క్రోధముచే నాతని శరీరమునుండి మిణుగురులు రేగుచుండెను. ఆతని నేత్రము లెఱ్ఱనయ్యెను. రోషముతో నాతఁడు పండ్లను బటపటకొఱుకుచు, శ్రీకృష్ణునకుఁ బూజ జరుగుచుండఁగనే, ఓర్పులేక తన యాసనమునుండి లేచి, అందఱను గసరుచు భగవానుని దూషించుచుఁ గఠినపు పలుకులను బలుక నారంభించెను. ఇప్పుడా వర్ణనమును గావించెదను.''



## కృష్ణుని శిశుపాలుఁడు దూషించుట

శ్లో॥ ఇత్థం నిశమ్య దమఘోషసుతః స్వపీఠా
దుత్థాయ కృష్ణగుణవర్ణన జాతమన్యుః।
ఉత్క్షిప్య బాహు మిదమాహ సదస్యమర్షీ
సంశ్రావయన్భగవతే పరుషాణ్యభీతః॥

—శ్రీభాగ. ౧౦ స్కం. ౭౪ అ. ౩౦ శ్లో॥

క॥ దమఘోషసుతుఁడు దద్వైభ
వము సూచి సహింప కలుక వ్రేలఁగాఁ బీ
ఠము డిగ్గి నిలిచి నిజ హ
స్తము లెత్తి మనోభయంబు దక్కినవాఁడై॥

వ. అప్పుండరీకాక్షుండు వినుచుండ సభాసదులం జూచి యిట్లనియె.

—శ్రీమదాంధ్ర భాగవతము.

మానవుఁడు భావకోశము. ఈతని హృదయమున సద్భావములును దుర్భావములును నిండియుండును. సద్భావ దుర్భావములు లేని వ్యక్తి యెవ్వఁడు నుండఁడు. సజ్జనుల సద్భావములు ప్రకటమై దుర్భావములణఁగియుండును. అట్లే దుర్జనుల సద్భావము లణఁగి దుర్భావములు ప్రకటమగును. హృదయములోని భావములు ముఖముపై స్పష్టముగ గోచరించుచుండును. ఏవస్తువు సమ్ముఖమునకు వచ్చునో, మనస్సు తద్భావ భావితమై, అది ముఖమండలమున గోచరించును. తనకు ప్రియమగువానినిఁ గాంచఁగనే హృదయముప్పొంగి, రోమరోమమున నానందము వెల్లువుకుచుండును. కన్నులు ప్రకాశించును. అనురాగము జాలువారుచుండును. దీనికి వ్యతిరేకముగఁ దన్ను ద్వేషించువాఁడును, క్రూరుఁడును వచ్చినచో హృదయమున నేవగింపు కలుగును. ఈర్ష్యాళు లన్యుల ఉన్నతినిఁగాంచి మండిపడుచుందురు. వారి శరీరము నుండి ఘృణా, ద్వేష, హింసా, క్రూరతలు వెలువడు చుండును. ఆ సమయమున వారికి లోపలనుండిన ద్వేషాసూయలను వాక్కు-ద్వారా వ్యక్తమొనర్చుచుందురు. ఈ ప్రాణి భావములతోడనే జీవించును. భావముల రాకపోకలు లేనప్పుడే మృతి చెందినాఁడందుము. సుందరుఁడును, నాకర్షకుఁడును, మనోహరుఁడుగను నుండినవాఁడైనను గోపమును జెందినచో, వాని యాకృతి భయంకరమైనదగును. హృద

యమునఁ గామభావము కలుగఁగానే స్త్రీపురుషుల చేష్టలను బట్టి అది స్పష్టముగ గోచరించును. దొంగయును, హంతకుఁ డైనను దన ప్రియురాలికడకు బోఁగానే వాని హృదయమున ప్రేమ జాగృతినిఁ జెందును. వాని వైఖరిలోను, మాటలలోను, జేతలలోను ప్రేమ స్పష్టముగఁగనఁబడుచుండును. ఎవని యెడలనైనను జన్మద్వేషముండినచో, ఆతని సన్మానమును, అభ్యుదయమును, ఉత్కర్షను గాంచిన శరీరమగ్ని లేకయే భస్మమగుచుండును. సామర్థ్యము లేకున్నను వాని కనిష్ఠ మొనర్పఁ బ్రయత్నించుచుండును. ఆతని నుచితానుచిత రీతుల నిందించి, ఆతని యెడల ద్వేషము కలవారలఁ దన వైపునకుఁ ద్రిప్పుకొనుటకుఁ బ్రయత్నించును.

సూతుఁడిట్లనెను :–"మునులారా! ధర్మరాజు దామో దరునకగ్రపూజ నొనర్చుచుండఁగా నందఱును నానందమగ్ను లైరి. అందఱి హృదయములును బ్రఫుల్లతము లయ్యెను. కాని ఆ సభలో భగవంతునకు మూఁడు జన్మలనుండి శత్రు వుగా నున్నవాఁడును గూర్చుండి యుండెను. ఆతడు చేది రాజగు దమఘోషుని పుత్త్రుఁడు శిశుపాలుడు. ఆతఁడు పుట్టి నప్పటి నుండియు బురుషోత్తముని ద్వేషించు చుండెను. అపరాజితుఁ డగు అచ్యుతునిఁ బరాజితు నొనర్చుటకై ఆతడు జరాసంధునకు సేనాని యయ్యెను. రుక్మిణినిఁ దన కిచ్చెదమని రుక్మి యనఁగా కృష్ణుఁడు తీసికొని వచ్చెను,

అప్పటి నుండి ఆతని ద్వేషము పరాకాష్ఠ నందు కొనెను. ఆతఁ డేవిధముగ నైనను భగవంతున కనిష్ఠ మొనర్చుటకుఁ జూచుచుండెను. కాని భగవానున కనిష్టమును గావింప గల వారెవరు? ఆతఁ డందఱకును బరమ యిష్టుఁడు. జరా సంధుఁడు చంపఁబడగానే ఆతని యుత్సాహము భంగ మయ్యెను. ఆతఁడు ధర్మజ రాజసూయమును నిష్టము లేకున్నను సమర్థించెను. యజ్ఞములో బాల్గొనెను. జరాసం ధుఁడు చచ్చిన తరువాత ప్రపంచమున సర్వశ్రేష్ఠుఁ డగు రాజు తానే యనుకొను చుండెను. రాజసూయమున నగ్ర పూజ తనకే జరుగునను కొనెను. కాని ఆతని యభిప్రాయము నకు వ్యతిరేకముగఁ దనకు శత్రువగు కృష్ణునకుఁ బూజ జరిగెను. దీని వలన నాతని కోపమునకు మేఱ లేకపోయెను. ఆతని రోమరోమమునుండి ద్వేషాగ్ని వెల్లుబుఱకు చుండెను. ఆతని ప్రశంసను ప్రతిష్ఠను గాంచఁగనే ఆతని యంతఃకర ణము మండిపోవు చుండెను. ఆతఁడు క్రోధముతో దనఁ సింహాసనము మీఁద నుండి లేచి నిలచుండి గద్దించుచు నిట్ల నెను :—“అందఱును నిశ్శబ్దముగా నుండుఁడు. మేళతాళ ముల నాపుఁడు. నేను నిండుసభలో రాజుల కిట్టి యవమాన మును జరుగుటను సహింపఁ జాలను. అన్యాయము జరుగు సభలో నొక్క-క్షణమైనను నిలువరాదు. సమర్థుఁ డగువాఁడు దానిని జేతనైనంత వఱకు ప్రతిఘటింపఁ వలయును. నేను

సమర్థుడను, శక్తిశాలిని. నేనీ యన్యాయమును బ్రతిఘటించు చున్నాను. రాజు లందఱును నన్ను సమర్థించెదరని ఆశించు చున్నాను.''

శిశుపాలుని భయంకర శబ్దమును విని అందఱును నిర్ఘాంతపోయిరి. మేళతాళము లాగెను. అందఱాతని ముఖ మును జూచుచుండిరి. అంద ఱిట్లనుకొనిరి :- ''ఈతడు దేనిని విరోధించు చున్నాఁడో'' ఇంతలోనే శిశుపాలుడు శుష్కహాస మొనర్చుచు నిట్లనెను:''సభాపతీ! సదస్సులారా! రాజన్యు లారా! మీరు నామాటను ధైర్యముతో విని, దానిమీద గంభీరతతో విచారణ మొనర్పుఁడు. భావుకతావశమునను భయలోభముల చేతను, సంకోచము వలనను దానిని ద్రోసి వేయకుఁడు.''

అంత నొక నృపతి యిట్లనెను:-''ఇంత భూమిక యేల చెప్ప దలచిన దేమో చెప్పుము.''

శుష్కహాస మొనర్చుచు, శిశుపాలుఁ డిట్లనెను:- ''ఏమి చెప్పుదును? కాలము బలవత్తర మైనది. దీనిని దాటుటకష్టము. ఒకప్పుడు కాళ్ళ చెప్పుల దుమ్ము నెత్తిపై కెక్కును. ఒక్కొక్కప్పుడు సుందరమగు పుష్పము కాళ్ళక్రింద బడి నలిగిపోవు చుండును. ఎవరికి సన్మాన మొనర్పవల యునో వానికి లేనేలేదు. ఎవరు సన్మానమునకు దగరో వారికి బూజ జరుగుచుండును. కులీనులగు క్షత్రపతుల నృప

తులు దీనిని గాంచ లేక పోవుచున్నారు. మొదలక ఒకరిముఖ ముల నొకరు చూచుకొనుచుగూర్చున్నారు. ఈ సభయందు గొప్పగొప్ప వయోవృద్ధులును, జ్ఞానవృద్ధులును, విద్యావృద్ధులును, కులైశ్వర్య వర్ణ ప్రభావవృద్ధులు నగు వారున్నారు. అందఱకును బుద్ధి యేల విపరీతమైనదో కాని ఒక్కరైనను మాటలాడరు. అన్యాయము నెదుర్కొనుట కెవరికిని సామర్థ్యము కనఁబడుటలేదు. నాకుఁ దెలిసినంతవఱకిచ్చట నుండిన సభాసదులందఱును సత్పాత్రనుబరీక్షించుటలో సర్వశ్రేష్ఠులే. ఎవరు గరిష్ఠులో, ఎవరు కనిష్ఠులో మీరందఱెఱుఁగుదురు. ఈ యజ్ఞమందగ్రపూజ నెవరికి జేయవలయునో మీరు మఱొక్కమారు ఆలోచింపుఁడు. కుఱ్ఱవాఁడగు సహదేవుని మాటలవలన భ్రమలోఁబడి పోవలదు. సహదేవుఁడు చెప్పిన దానిని నేను నాశక్తి కొలఁది వినోధించెదను. కుల కలంకుఁడగు నీగోపాలున కగ్రపూజ నొనర్చుటను నేను సహింపఁజాలను. ఏ సభలో నపూజ్యులు పూజింపఁబడెదరో, పూజ్యులు పూజింపఁబడక అన్యాయము జరుగుచున్నదో, ఆ సభకు నాశము తప్పదు. యుధిష్ఠిరుఁడు మనరాజుల నందఱను బిలిచి, అవమానించినాఁడు. మన మీ సభలో నొక్కక్షణమైనను నుండరాదు. రాజన్యులారా! మీరు ఛత్ర చామరములను ధరించిన వారిచ్చటనుండ నొక్క గొల్లవాని పూజను జూచుచున్నారు. దానినిఁ బ్రతిఘటించుటలేదు. ఛీ ఛీ! మీ

రాచరికము కావలెనా? ఇట్టిసభ నుండి వెడలిపోదము. ఈయజ్ఞమును విరోధించుచుండు పాండవ పక్షపాతులగు రాజులను హతమార్చుదము."

సూతుఁడిట్లనెను:– "మునులారా! ఇట్లు పలికి, క్రోధముతో శిశుపాలుఁడు తన యాసనమునుండి లేచి వెడలిపోయెను. అతని అనుయాయులును లేచిరి. ఇది యజ్ఞమునకు గొప్పవిఘ్నమని అతఁడు తెలిసికొనెను. అతఁడు వెంటనే పరుగిడిపోయి శిశుపాలునిఁ బట్టుకొని, వినయముతో నిట్లనెను:– "అట్లుచేయకుము. నేనందఱ సమ్మతితో శ్యామసుందరునిఁ బూజించితిని. నీవు పోయెద వెందులకు? కూర్చుండి, నీయభిప్రాయమేమో చెప్పుము"

క్రోధముతో నట్లే నిలుచుండి శిశుపాలుఁడిట్లనెను:– "యుధిష్ఠిరా! నిన్నందఱును ధర్మాత్ముఁడందురు. నేనును నిన్నుఁ బ్రేమించెదను. అట్లు ప్రేమ లేకుండిన నేను యజ్ఞమున కేల రాఁగలను? నేను నీకొసంగిన ధన రత్నాది వస్తువులను నీకు భయపడి యీయలేదు నేను నీ శుభకార్యమునకు సహాయమొనర్చితిని. దీని పరిణామముగ మారాజుల నందఱ నవమానించుచున్నావు. అగ్రపూజ నొనర్చుటకు కృష్ణునిలో నేమి యోగ్యత కలదు?"

ఇది రాజసభ. ఈ యజ్ఞమునకు వచ్చినరాజులలో శ్రేష్ఠున కెవరికైనను బూజ చేయవలసినది నీవు ధర్మమును

విచారించి చెప్పుము. వృష్ణివంశమున నెవరైనఁ జామర మును ధరించిన రాజు కలఁడా ? ఆ వంశము యయాతిచే శపింపఁబడినది. కావునఁ గృష్ణుఁడు రాజు కాఁడు. అట్టియెడ నీవు కృష్ణునేల పూజించితివి ? మనము శ్రేష్ఠులగు క్షత్రియులను బూజింపవలయును. యాదవులు క్షత్రియుల లోనివారు కారు. క్షత్రియ బహిష్కృతులు. అట్టియెడ నీవు కృష్ణపూజ నేల చేసితివి ? శ్రేష్ఠులగు రాజులెందఱో కలరు. వయోవృద్ధుఁడగు ద్రుపదమహారాజు కలఁడు. ఆతనికిఁ బూజచేసియుండిన మాకేమియు నభ్యంతరముండెడిది కాదు. ఇట్టి శ్రేష్ఠులగు సంబంధులను వదలి రాజ్యహీనుఁడగు కృష్ణునేల పూజించితివి ? ద్రుపదుఁడు భార్యా సంబంధమునఁ జుట్టము, మాతృ సంబంధమునఁ బూజింప వలయుననిన మీ మేనమామ యగు వసుదేవునిఁ బూజింప లేకపోయితివా ? ఆతఁడు కాకున్న నాతని మామ ఉగ్రసేనుఁడు కలఁడు కదా ! ఆతని పూజను జేసియుండవచ్చునే. మద్ర దేశాధిపుఁడు శల్యుని పూజను జేయవచ్చునే. కృష్ణుని అన్న బలరాముఁడున్నాఁడు కదా ! ఆతని పూజచేయక, శ్రేష్ఠసంబంధులను వదలి యీ కృష్ణున కేల అగ్రపూజను గావించితివి ?

పోనీఁడు, అస్త్ర శస్త్ర శాస్త్రవిశారదులఁ బూజింపఁ దలఁచినచో నీ ధనుర్వేదాచార్యులగు ద్రోణ, కృపాచార్య, అశ్వత్థామలను, ఇతర ధనుర్వేదాచార్యులను బూజింపక,

వీరందఱను గాదని, నీవు పిఱికిపందయును, బాలపోతువగు గృష్ణునేల పూజించితివి. మేము కులవృద్ధులనే పూజింపఁదలఁచితి మనిన మీకు గులవృద్ధగు భీష్మపితామహుఁడు కలఁడు కదా! ఆతఁడు రణమునఁ బరశురాముని జయించినవాఁడు. మృత్యువాతని వశమునఁగలదు. ఆతనిని వదలి గొప్పగొప్ప తపస్వులును, విద్వాంసులును, వ్రతనిష్ఠులును, నిష్కల్మషులును, బ్రహ్మనిష్ఠులును, లోకపాలుచేతను బూజింపఁబడు సదసత్పతులెందఱో ఉండఁగా గుణహీనుఁడగు గృష్ణునిఁ బూజింప మీకు మనస్సెట్లొప్పినది? యజ్ఞమందలి ఋత్విజులను, యజ్ఞసంభారములను బ్రోవుచేసిన వారినిఁ బూజింపవలెనందువా వ్యాసభగవానునిఁ బూజింపవచ్చునే. పోనిండు బలవంతులను బూజించెదనందువా బలరాముఁడు, దుర్యోధనుఁడు, కర్ణుఁడు, అశ్వత్థామ మొదలగు జగద్విఖ్యాతులగు బలవంతు లుండఁగా నిర్బలుఁడగు గృష్ణున కింతటి అధిక సన్మానమేల చేసితివి? మూర్ధాభిషిక్తులగు రాజులుండ రాజచిహ్న విహీనుఁడగు గృష్ణునిఁ బూజించుట అందఱను దిరస్కరించుట కాదా?"

నీవు, సహదేవ, భీష్ముల మాటలను విని నీవు పొరపడినను, అనుచితమగు నీ పూజ నంగీకరింపకుండ వలసినది. తానధికారి కానని తాను నిరాకరింపవలసినది. ఈ పూజవలన నీతనికి గౌరవము కలుఁగలేదు, పైగా నవమానమే

జరిగినది. ముత్తైదువునకు ముక్కెర నిచ్చుటయును, కన్నులు లేనివాని కద్దమును జూపించుటయును, నపుంసకునకుఁ బెండ్లి యొనర్చుటయును, చేయి తెగినవానికిఁ గంగణము లొసంగినట్లును, జెవిటికి శంకూదినట్లు గృష్ణున కగ్రపూజ చేయుట అసంగతమే కాఁగలఁదు. యజ్ఞమందలి హవిస్సును గాలికి వైచినట్లును, దేవతా నివేదనార్థమై వండిన పాయసమును గుక్కలకు బెట్టినట్లును, సంతర్పమందలి పదార్థములను గాకిదెకు బెట్టినట్లు మీరు కృష్ణున కగ్రపూజను గావించితిరి. మీ బుద్ధి భ్రష్టమైనది. భీష్మునకుఁ దలతిరిగినది. ఇంతటి యన్యాయము జరుగు నీ సభలో నొక్కక్షణమైనను నిలువజాలను.''

ధర్మరాజత్యంత ప్రేమతో శిశుపాలునకు నచ్చఁజెప్పుచు నిట్లనెను :-''నాయనా! శిశుపాలా! నీవు శ్రీకృష్ణు నింతటి కఠోరవచనములను బలుకరాదు. భీష్మపితామహుని నీ విధముగ నవమానింపరాదు. నీవే ఆలోచింపుము. ఈ సభలో నీకంటె వయస్సులోను, విద్యాబుద్ధులందును ప్రతిష్ఠయందును గొప్పవా రెందఱో కలరు. ఎవ్వరును దీని కభ్యంతరము పెట్టలేదు. కావున నీవును వ్యతిరేకించి మా యజ్ఞమునకు విఘ్నమాపాదింపఁ బూనరాదు. నీవేదైనను జెప్పఁదలఁచినచోఁ గూర్చుండి చెప్పుడు. అందఱును జెప్పినదానినిబట్టి నీ వంగీకరించి అట్లుచేయుము.''

క్రోధోద్రేకుఁడై శిశుపాలుఁ డిట్లనెను :- "ఇతరులు భయముచేఁ బ్రతిఘటింపక పోవచ్చునుగాక కాని యీ విషయము అందఱకును జెడ్డదిగానే తోఁచుచున్నది. ఇది చెడ్డదియే. అయినను మీకు ధనమదము కలిగినది. భీష్ముఁడును మీ రేమనిన దానికిఁ దలనూపుచున్నాఁడు. ఎచ్చట ఇట్టి అన్యాయము, అధర్మము, పాపము, పక్షపాతము, మహాపురుషుల కవమానమును జరుగుచున్నదో, అచ్చట నేనొక క్షణమైనను నుండఁజాలను. నేను నాకు చేతనైనంతవఱకు దీనినిఁ బ్రతిఘటించెదను. మీ యజ్ఞమును బూర్తికానీయను."

ఇది వినఁగానే భీష్మపితామహునకు మిక్కిలి కోపము వచ్చెను. ఆతఁడు కోపముతో ధర్మరాజుతో నిట్లనెను :—
"యుధిష్ఠిరా! నీవీ నీచునింతగా బ్రతిమలాడెదవేల? వీఁడు దుష్టుఁడు. వీనిని నేను బుట్టినప్పటి నుండియు నెఱుఁగుదును. వీఁడు కృష్ణద్వేషి. నిందకుఁడు. అధర్మి. గర్వపోతు, సిగ్గులేనివాఁడు. వీనినిఁ బోనిమ్ము. ఈమాటను వినకుండిన నాతఁడు చేయునదేమియో చేసికొననిమ్ము. ఈ గబ్బిలము పోయిన మన యజ్ఞము నెఱవేరదా యేమి? వీఁడు కూర్చుండి నా మాటలను వినినచో శ్రీకృష్ణుఁ డీ యజ్ఞమునకు స్వామియే కాదు. చరాచర విశ్వమునకు స్వామి. యజ్ఞములందు మొదటను, చివరను, మధ్య మధ్యను నీతని పూజ జరుగవలయును."

ఇది విని శిశుపాలుఁడు మరలఁ దన ఆసనము మీఁద గూర్చుండి క్రోధముతో నిట్లనెను :— "ఈ ముసలివాఁడే యింత చేసినాఁడు. ఈతఁడే ధర్మరాజుయొక్క బుద్ధిని భ్రష్ట మొనర్చినాఁడు. ఈతఁడే గొల్లవానినిఁ బరబ్రహ్మ యను చున్నాఁడు. ఈ ముసలివాఁడు కృష్ణు నీశ్వరునిఁగాఁ దలఁచి నచోఁ దన యింటిలోఁ గూరుచుండి యనుకొనును మనుము. రాజసూయ యాగమున శ్రీకృష్ణున కగ్రపూజ కావించుట నీతి, ధర్మ, సదాచార, శాస్త్రాదులకు బొత్తుగా విరుద్ధము."

భీష్మపితామహుఁ డిట్లనెను :- "నీవు శాస్త్రములను జదివి యుండినను, వృద్ధులను సేవించినను నిట్టిమాటలను బలుకవు. శ్రీకృష్ణుఁడు ధర్మముచేతను, నీతిచేతను, సదా చారము చేతను, శాస్త్రముచేతను సమస్త విధముల నగ్ర పూజకధికారి. ఆతని యీశ్వరత్వమును వదలినను నిచ్చట నుండిన రాజులందఱకును నాతఁడు గురువు. విద్యాకారణ మున బ్రాహ్మణులకు శ్రేష్ఠత్వమున్నది. బ్రాహ్మణుఁడు వయస్సులోఁ జిన్నవాఁడై, విద్యలో గొప్పవాఁడైయుండినచో, నాతఁడు వృద్ధులకును బూజనీయుఁడే. వైశ్యులలో గొప్ప తనము ధనమునుబట్టి యుండును. ధనముకలవాఁడే వృద్ధుడు. శూద్రులలో వయోవృద్ధుఁడే పూజ్యుఁడు. క్షత్రియులలో గొప్పతనము పరాక్రమమునుబట్టియుండును. ఒక క్షత్రియుఁ డింకొక క్షత్రియుని యుద్ధములో నోడించినచో నావోడిన

వానికి గెలిచినవాఁడు గురువు. తాను గృష్ణునకోడ లేదనియు, గృష్ణుని కంటెఁ దాను బలవంతుఁడననియు నెవరికైన నహంకారముండినచో నిప్పుడైనను నేక్షత్రియుఁడైన నాతని సమ్ముఖమునకు రావచ్చును. ఈతఁడు రాజుల నందఱ నోడించినచో నీతఁడందఱకును గురువు కాఁగలఁడు. అప్పు డగ్రపూజకు సర్వోత్తమమగు నధికారి కాఁగలఁడు. ఆతని గురుత్వము నంగీకరింపకుండినచో, సంతోషముతో మాకడ నుండి వెడలిపోవచ్చును. అట్లు చేసినవారికిని మేలే, మాకును మేలే."

ఇది విని క్రోధముతో శిశుపాలుఁ డిట్లనెను :- "కృష్ణుఁడు కపటి. ఆతఁడు కపటముతో జరాసంధునిఁ జంపించినాఁడు. కృష్ణుఁడు పిఱికివాఁడు. జరాసంధునకు భయపడి పరివారముతోఁబోయి, సముద్రమధ్యమున దాగినాఁడు. నేను ఢంకామీఁద దెబ్బకొట్టి చెప్పఁగలను. శ్రీకృష్ణుఁడీ యజ్ఞమున నగ్రపూజ కేవిధముగఁ జూచినను నర్హుఁడు కాఁడు. ఆతని కగ్రపూజ నొనర్చినచో మేము యుద్ధము చేసి, యజ్ఞ విధ్వంసనము కావించెదము అందఱను జంపివైచెదము. కాని కృష్ణపూజ నొనర్పనీయము."

భీష్మపితామహుఁ డిట్లనెను :- మేమీ బెదరింపులకు బెదరువారము కాము. ఈ క్రోధచేష్టలు మాముందు కాదు. మేము నీభ్రమలోఁబడువారము కాము. మే మీతని సర్వో

త్తముఁడని భావించి సన్మానించుచున్నాము. ఈతఁడు వీరత్వమందును, విద్వత్తు, నిపుణత, ధన, బల, యశ, శ్రీ హ్రీ, లజ్జా, కీర్తి, నమ్రతా, ధృతి, తుష్టి, పుష్టి, బుద్ధి, రూప, గుణ, జ్ఞానాదులన్నిటిలోను జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుఁడునై యున్నాఁడు. పూజ్యులకు గావలసిన లక్షణములన్నియును నీతనిలోఁగలవు. ఈతఁడు మాకు గురువు. సంబంధి, స్నాతకుఁడు ఋత్విజుఁడు, రాజు, ఆచార్యుఁడు. ఎంతవఱకని చెప్పఁగలను? ఈతఁడు మాకు సర్వస్వము. మాకే కాదు, త్రిలోకములకును నీశ్వరుఁడు. మేమీతనిఁ బూజించితిమి. చేయుచున్నాము, చేయఁగలము. బ్రతికియున్నంతవఱకు చేయుచుందుము. మేమందఱ యభిప్రాయమును దీసికొంటిమి. శిశుపాలునకు కృష్ణుని పూజ సమ్మతము లేకుండినఁ దనకిష్టము వచ్చినది నిశ్శంకముగ జేసికొనవచ్చును.''

ఇది వినఁగానే సహదేవుఁడు ఆవేశమున లేచి నిలుచుండెను. ఆతఁడు గర్జించి యిట్లనెను :- ''శ్రీకృష్ణుఁడు మాకు గురువు, తండ్రి, ఆచార్యుఁడు, రక్షకుడు, సర్వస్వమునై యున్నాఁడు. ఆతని పూజను సహింపని రాజుయొక్క శిరమును గాలితోఁ దన్నెదము. ఎవరికైనను బలపౌరుషము లుండినచో మమ్మెదుర్కొనుఁడు.''

ఇది విని ధర్మరాజు సహదేవునిఁ గసరుచు నిట్లనెను:- ''సహదేవా! నీవధికముగ కఠోర మాటలాడెదవేమి? పితామహుఁడు

మాటలాడుచున్నాఁడుగదా! మనము పితామహుని కధీను లము. ఆతఁడెట్లాజ్ఞాపించిన నట్లు చేయుదము."

గర్జించి భీష్మపితామహుఁ డిట్లనెను:- "యుధిష్ఠిరా! నీవు మాటిమాటికి నడ్డగించెదవేల? సత్యమును జెప్పనే వలయును. సహదేవుఁడు యథార్థము బలుకుచున్నాఁడు. వాని నడ్డగింపకుము. నీవు పూజింపుము. ఎవరైనను బూజకు విఘ్నమాపాదించినచో నే నొక్కఁడనే వాని పని పట్టెదను."

ఇదివిని ధర్మరాజు తలవంచుకొని భగవానునిఁ బూజించుచుండెను. కృష్ణుఁడు నిరపేక్షాభావమున నుండెను. ఆతఁడు శిశుపాలునకును బ్రత్యుత్తర మిచ్చుటలేదు. భీష్మాదుల నడ్డగించుటయును లేదు. ఆతఁడు తనకాలితో నేలపై గీరుచుండెను. శిశుపాలుఁడు క్రోధమునఁ దెలియ కుండెను. ఆతఁడు నిరంతరము భగవానుని దూషించు చుండెను. భీష్మునిఁ దిట్టుచుఁ గృష్ణుని నిందించుచుండెను. ఆతఁడిట్లనెను :–"భీష్ముఁడు నపుంసకుఁడు. ఈతఁడు కృష్ణుని భట్టువలెఁ బొగడుచున్నాఁడు. ఈతఁడు పాండవులచేఁ గృష్ణునిఁ బూజింపఁజేయుచున్నాఁడు. అగ్రపూజ సంగతి నట్లుంచి, కృష్ణుఁ డీ సభలోఁ గూర్చుండుటకును యోగ్యుడు కాఁడు. ఈతఁడు వర్ణాశ్రమకుల బహిష్కృతుఁడు. ధర్మ మర్యాదా విహీనుఁడు. పిఱికిపంద, పొరుబోతు, స్వేచ్ఛాచారి. వృష (వృషభాసురుని) భమును జంపినాఁడు. స్త్రీ (పూతన)

హత్యచేసినాఁడు. ఇష్టమువచ్చినట్లు సంచరించును. ఈతనికుల మంతయు శపింపఁబడినది. ఈతఁడుసత్పురుషుల సభలోఁ గూర్చుండనర్హుఁడుకాఁడు. వీని కులమువారందఱును ద్రాగు బోతులు. ఈతఁడును, నీతని కులములోనివారును జోరులు. పవిత్రులగు ఋషులచేసేవింపఁబడు మథురనువీడి భయమునఁ బారిపోయి సముద్రమునఁ దాగినాఁడు. వీరు ప్రజలను బాధించెదరు. కృష్ణుఁడు కపటి. బహురూపులు ధరించు వాఁడు. మోసగాఁడు, దాసుఁడు, పారుబోతని భావించి జరాసంధుఁ డీతనితోఁ బోరాడలేదు. చేతగాక ఛల, బల, కళా, కౌశలముచేతను నన్యాయముచేతను వాతనినిజంపించి నాఁడు. ఈతఁడు భగవంతుఁడును, సర్వసమర్థుఁడు నైనచో దాగిపారుటెందులకు? ఈతఁడు బ్రాహ్మణవేషము నేలవైచి నాఁడు. వీనికిబలము లేదు, వీర్యము లేదు, పిరికి తిండిపోతు, గోవర్ధనపూజా సమయమున నచ్చటి అన్నము నంతయును మెక్కినాఁడు. దీని కాతని కతి గర్వము వచ్చినది. ఈతఁడు రాజులలోఁబూజింపఁబడుటకు సర్వథా అయోగ్యుఁడు.''

సూతుఁడిట్లనెను :-మునులారా! ఈ విధముగ శిశు పాలుఁ డనేక విధములఁ గృష్ణుని దూషించెను. కాని భగ వానుఁడు నీని నన్నిటిని లెక్కించుచుండెను. ఇట్టఁగనే గీత గీయుచుండెను. సభలోఁ దిట్టుచుండిన లజ్జించుటలేదు. నిరం తరం మాతఁడు తిట్టుచునే యుండెను. తిట్టినకొలఁది వాని

మంగళము నశించుచుండెను. వాని శిరస్సున మృత్యువు తాండవించుచుండెను. కాలము వానినిఁ బ్రేరేంచుచుండెను. శాస్త్రములలో భగవంతుని గాని, భగవద్భక్తులనుగాని నిందించినచో వినుచుండిన వారి పుణ్యములన్నియును నశించు నని చెప్పఁబడుటచే భగవద్భక్తులగు రాజులు చెవులు మూసికొని లేచి పోయిరి.

పాండవులు సహింపఁ జాలకుండిరి. వారు భగవానుని నిందను విని క్షుబ్ధులైరి. ముఖ్యముగ భీమసేనుఁడు మండి పడి పోవుచుండెను. ఆతఁడు గదను గైకొని శిశుపాలుని మీఁదకుఁ బరువిడెను. అప్పుడు భీష్మ పితామహుఁడు లేచి ఆతనిఁ బట్టుకొని యిట్లనెను :—"భీమా! వీనికి చావు భగవానుని చేతిలో నున్నది. నీవు వీనినిఁ జంపవలదు. కొలఁది క్షణములలో నిచ్చట ఈతఁడు చచ్చిపడఁగలఁడు. హద్దూరక వాగుచున్నాఁడు. కాలరూపుఁడగు కృష్ణుఁడే వీడిట్లు వాగునట్లు బ్రేరేంచుచున్నాఁడు. సన్నిపాతరోగి వాగి నట్లీతఁడు వాగుచున్నాఁడు. వాసుదేవుని కన్నియును దెలి యును. అందు వలననే ఆతఁడు మౌనముగ నున్నాఁడు."

అంత శిశుపాలుఁ డింకను నధికముగఁ గుపితుఁడై యిట్లనెను :—"నేను కృష్ణునకును భయపడను. పాండవులకును భయపడను. పాండవు లొక్కొక్కరుగ వచ్చినను సరే, అందఱును గలిసివచ్చినను సరియే, నే నెదుర్కొను

టకు సిద్ధముగ నున్నాను. భీష్మా! నీవీ భీముని విడువుము.
వీనికి బలగర్వము కలదు. నేఁడు నే నీతని గర్వము నణఁచె
దను.''

శుష్కహాస మొనర్చుచు భీష్మ పితామహుఁ డిట్ల
నెను :-''శిశుపాలా! ఏమిచేయుదును? వాసుదేవ భగ
వానుఁడు నన్నడ్డగించుచున్నాఁడు లేకున్న నేను నీకు జవాబు
చెప్పువాఁడనే. ఇంత వాగుడు వాగు నీ జిహ్వను నేను నఱ
కెడు వాఁడనే. అందఱ సమ్ముఖమున నీతల నేలపైఁబొరలు
చుండెడిదే. సరే, నీ యిష్టము వచ్చినట్లు వాగుకొనుము.''

అంత శిశుపాలుఁ డిట్లనెను :-''కృష్ణుఁడు కపటి,
చోరుఁడు, మోసగాఁడు. వీనిపూజను నేను సాగనీయను.
ఎన్నటికిని సాగనీయను. ఈ రాజులందఱును నాపక్షమున
నున్నారు. వీరందఱకును నేను సేనాపతినై యుద్ధమొనర్చె
దను.''

ఇదివిని అర్జున, భీమ, నకుల, సహదేవులును, మత్స్య
దేశపు రాజును, కేకయ, సృంజయ రాజులును దమతమ
అస్త్ర శస్త్రములను దీసికొని యుద్ధమొనర్ప నిలుచుండిరి.
వారందఱును శిశుపాలుని జంపఁదలఁచు చుండిరి కాని మధ్య
నిలుచుండి కృష్ణుఁ డందఱ నడ్డగించెను.

సూతుఁ డిట్లనెను :- ''మునులారా! ఇప్పుడు శ్రీ
కృష్ణుఁడు శిశుపాలు నెట్లు వధించినదియు ముందు చెప్పఁ
గలను.''

# శిశుపాలవధ

శ్లో. తావదుత్థాయ భగవాన్ స్వాన్నివార్య స్వయం రుషా।
శిరః క్షురాన్త చక్రేణ జహారాపతతో రిపోః॥

శ్రీభాగ. ౧౦. స్కం. ౭౪ అ. ౪౩ శ్లో.

వ. .....అమ్ముకుందుం డాగ్రహంబున లేచి తన కట్టెదుర నెదిర్చి యున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల నీక్షించుచు నాక్షణంబ తన్మస్తకంబు నిశిత ధారాకరాళంబైన చక్రంబున నవక్రపరాక్రముండై రుధిరంబు దొరఁగందునిమె.”

—శ్రీమదాంధ్రభాగవతము.

జీవుఁ డవశుఁడు, ప్రభుఁ ప్రేరణముచేతనే అన్నియు జరుగుచుండునను ధృఢమగువిశ్వాస ముండినచో సుఖ దుఃఖములు, లాభాలాభములు, శుభాశుభములు, పుణ్యాపాపములు జయాపజయము లన్నిటిలోను సమముగ నుండును. వానికే విషయ మందును నుద్వేగము కలుగదు. అఖిలేశ్వరుని ఆజ్ఞలేనిది ఆకైనను గదల దనునది ధృవసత్య మగుచో, నెవఁడైనను నిందాస్తుతు లొనర్చుటలో స్వతంత్రత యేమున్నది? భగవంతు డెవనిచేత నిందింపఁ జేయునో, అవశుఁడై ఆతడు నిందించును. ఎవనిచే స్తుతింపఁ జేయునో ఆతడవశుఁడై స్తుతించును. భగవానునకు నిందాస్తుతులు సమానములు. ఆతఁడు తనకు వందన మొనర్చు వారికిని, నిందఁ

నొనర్చువారికిని నొక్క టేగతినిఁ బ్రసాదించును. ఆతనితో నే సంబంధమును బెట్టుకొన్నను సంసారమును దాటినట్లే.

సూతుఁ డిట్లనెను :-"మునులారా! శిశుపాలుఁడు భగవంతుని జాల చెడ్డ మాటలను బలుకుచున్నాఁడనియు, నొక్కొక్క మాటకే ఆతఁడు వధార్హుఁడని పాండవ పక్షఁమందలి రాజులందఱును వానిని జంపఁబోగా భగవానుఁడు వారినందఱ నడ్డగించి యిట్లనెను:-"మీరీ దుష్టుని జంపకుఁడు. నే నింత వఱకు మాఅత్త కొసంగిన మాటను బట్టి సహించియుంటిని. ఇప్పు డీతని యపరాధము పరాకాష్ఠ నందుకొనినది."

అంత ధర్మరా జిట్లనెను :-"ప్రభూ! నీవు నీఅత్తకేమి వరము నొసంగితివి. నీ వింతవఱ కేల మొదలక కూర్చుంటివి ? నీ వింతవఱ కొక్క శబ్దమునైన నేల పలుక లేదు ? నీవు నేలపై గీతలుగీయుచుండిన దెందులకు ? ముందు మాకీ ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మొసంగిఁ తర్వాత శిశుపాలునిఁ దండింపుఁడు."

ఇది విని అందఱును వినునట్లు మేఘ గంభీర స్వరమున ధర్మరాజును సంబోధించుచు నిట్లనెను:-"ధర్మరాజా! నా కైదుగురు మేనత్తలు కలరు. ఒక మేనత్తకుమారులు మీరు. శ్రుతశ్రవయను నొక మేనత్తను జేదిదేశపురాజగు దమఘోషున కిచ్చి పెండిలి చేసిరి. ఆమె కడుపున నీ దుష్టు

డగు శిశుపాలుఁ డుదయించినాడు. వీఁడు నాకు మేనత్తఁ కుమారుఁడు. వీఁడు పుట్టినపుడు వీనికి నాలుగు చేతులును, మూఁడు కండ్లు నుండెను. వీఁడుపుట్టినపుడు పిల్లలవలె నేడువ లేదు. గాడిదవలె నేడ్చెను. దీనినిగాంచి మేనత్త మేనమామలు చాల దుఃఖించిరి. అప్పు డాకాశవాణి యిట్లు పలికెను :- "వీఁడు బలవంతుఁడును, శూరవీరుఁడును, శ్రీమంతుఁడును గాఁగలఁడు. మీరీతనికి భయపడ వలదు. ఈతడు మహా కాలునకు దక్క యింకెవని చేతను జావఁడు. ఈతనిఁ జంపు వాఁడు భూమిపై బుట్టి యున్నాఁడు."

ఇది విని మాఅత్త చేతులను జోడించుకొని వినీత భావముతో నిట్లనెను :-"మాకే దేవత యీవిషయమును జెప్పుచున్నాఁడో, ఆతఁడు వీఁడెవరిచే జచ్చునో తెలుపఁ వలయును."

అప్పు డాకాశవాణి యిట్లనెను :-"వీఁ డెవరి చేతిఁ లోనికిఁ బోయినప్పుడు వీని మూఁడవ కన్ను, రెండుచేతులు మాయమగునో వాని చేతిలో వీఁడు చచ్చును. మేమును నిట్టి యద్భుత బాలకుడుఁ పుట్టినాడని విని బలరామునితోఁ గూడి చూచుటకు బోయితిమి. దేశదేశాంతర రాజులును వీనినిఁ జూచుటకు వచ్చిరి. ఏ రాజు చేతిలోనికి బోయినను వీని కన్నులు, చేతులు జారి పడిపోవలేదు. మా మేనత్త నా చేతికిని యిచ్చినది నా చేతిలోనికి రాఁగానే వీని రెండు

